# శరత్ ఉత్తరాలు





అనువాదం :

లవణం
నీలకంఠం

శరత్ గ్రంథమాల, విజయవాడ.

# ఇందలిలేఖలు





శ్రీమతి లీలారాణి గంగోపాధ్యాయకు వ్రాసినవి!

శివపూర్ - హౌరా,
24-7-1919.

సౌభాగ్యవతికి,

మీ ఉత్తరం, 'మిలన్' మొదటినుంచి చివరివరకూ పూర్తిగా చదివాను. నా పుస్తకం మీకు బాగుంది. రచయితకు అంతకంటె కావలసిన బహుమాన మేముంది కనుక ?

మీరు భక్తివిషయం ప్రస్తావించారు. కేవలం వినయమే కాక, సరియైన భక్తివుండే సమయంలో మీ కోరిక సమంజసమైనదే. అయితే ఎవరియెడల భక్తిని ప్రదర్శిస్తారో అది ఆలోచించవలసిన విషయం.

మీతో నా కెక్కువ పరిచయం లేదు. అందువల్ల ఎక్కువ ప్రశ్నించడం మంచిది కాదు. అయినా కొద్దిగా ప్రశ్నించాలని, అనిపిస్తోంది మీరు బ్రహ్మసమాజానికి చెందకపోతే మీరు విధవావివాహాలు చెయ్యాలని ఎందు కనుకుంటున్నారు?

ఇది మీలో కలిగిన క్షణికమైన ఉద్రేకమా? లేక హేమ, గుణేంద్రుల పరిస్థితి చూచి మీకు జాలి వేసిందా? ఇందులో మీకు వాస్తవంగా ఏమీ ఇబ్బంది లేదా? ఒకవేళ ఇబ్బందివుండి 'మిలన్' (సమాగమనం) జరిగినంత మాత్రముననే మీ మనస్సు సంతృప్తి చెందితే ఆ సమాగమానికి ప్రత్యేక విలువవుందని నేను అనుకోను.

రచన విషయంలో అంటే దాని మంచి చెడ్డలను

పరిశీలించి ఆ రచనకు విలువకట్టడం ఒక చిన్న ఉత్తరంలో జరిగేపని కాదు.

మీరు నా పుస్తకాలన్నీ చదివారో లేదో నాకు తెలియదు. ఒకవేళ మీరు చదివివున్నట్లయితే మన సమాజంలో విధవావివాహాలు జరగకపోవడంవల్ల ఎన్ని జీవితాలు నాశనమైపోతున్నాయో మీరు తెలుసుకునే వుంటారు. ఇంతకంటే నే నేమీ ఎక్కువ చెప్పవలసింది లేదు.

—శరచ్చంద్రచటోపాధ్యాయ

—....—

శివపూర్ - హౌరా,
బం॥ సం॥ 26-7-1919.

సౌభాగ్యవతికి,

మీ ఉత్తరం అందింది. నాకు ఉత్తరం వ్రాసి జవాబుకోరకు నిరీక్షించడం ఒక దురాశ. నా ఈ మంచిఅలవాటు విషయం మీ కెలా తెలిసిందా అని ఆలోచిస్తున్నాను. ఎందుకంటె ఆ విషయం ఏమాత్రం కాదన డానికి వీలులేనిది. నిజంగా నానుండి ఎవరికీ జవాబులు వెళ్ళవు. నే నంత సోమరిని.

అయినా మీకు రెండు ఉత్తరాలు ఎలా వ్రాశానా అని ఆలోచిస్తే బహుశా మీరు కోరిన భక్తిభావంవల్లనే అసంభవం కూడా సంభవమైనదని అనుకుంటాను. నిజం ఆలోచిస్తే ఇది (భక్తి) మనుష్యులచే ఎన్నెన్నో విచిత్ర కార్యాలుచేయిస్తుంది. నన్ను సోదరునిగా పూజించే ఆమెకు ఉత్తరం వ్రాస్తున్నానంటే, ఆమె విషయాలకు జవాబు

లిస్తున్నానంటే అందులో ఎంత ఆనందం, విశాలగర్వం దాగి వున్నాయ్!

మీకు ఏమీ నేర్పలేదు. కళ్ళతో చూడలేదు. ఎవరి కూతురు; ఎవరికోడలు,—మీరెవరో ఏమీ తెలీదు. కాని నా చెల్లెలుగా మిమ్ము చెప్పుకుంటున్నారంటే — ఇట్టి అదృష్టం ఏ కొద్దిమందికో గాని కలగదు. అట్టి అదృష్టం గలవానిలో ఒకవిధమయిన మత్తు వ్యాపించిపోతుంది.

నన్ను ఎరుగకుండానే, మీరొక హిందూకుటుంబం లోని కోడలైవుండి సంకోచించకుండా నాకు వుత్తరం వ్రాశారు. ఇలా అందరూ చేయలేరనేది నిజం. అయితే నేను సంకోచించకుండా సమాధానం ఇస్తానా ఇవ్వనా అని మీరు ఆలోచించలేదు. అందుచేతనే మీరు అలా వ్రాయ గలిగారు. మీకు ఆ సంకోచంవుంటే వ్రాయగలిగేవారు కాదు. నామీద మీకంత నమ్మకంవుంది. లేకపోతే నే నిన్ని పుస్తకాలు వ్రాయడం వ్యర్థమైపోయేదే.

బాగుంది. చెల్లెలిలాగానే మీకెప్పుడు వ్రాయాలని పిస్తే అప్పుడు ఉత్తరాలు వ్రాయండి. నాకు నిజమైన శిష్యురాలు సోదరికంటే ఎక్కువైన ఒకవ్యక్తి వుంది. ఆమె పేరు నిరుపమ. బహుశా నేటి సాహిత్యప్రపంచంలో మీతో పరిచయంకూడా కలిగియుండవచ్చు. 'దీదీ' అన్న పూర్ణ 'దేవాలయం' 'నుదుటి వ్రాత' మొదలైనవి ఆమె రచనలే. కాని ఈమె తన పదహారేళ్ళ వయస్సులోనే అక స్మాత్తుగా వితంతువయి నిస్తబ్ధురాలైనప్పుడు, వితంతువు కావడమే స్త్రీ జీవితంలో చరమదుఃఖంగానూ, హానిగానూ

గాని లేక ముత్తయిదువుగావుండడమే ఆమె జీవితంయొక్క సార్థక్యముగాని కాదు! అని నేను పదేపదే నచ్చజెప్పేవాడిని. అప్పటినుంచీ ఆమెను పూర్తిగా సాహిత్యజీవితంలో ప్రవేశపెట్టాను. ఆమె రచనలన్నీ దిద్దుతూ చెయ్యిపట్టుకుని వ్రాయడం నేర్పేవాడిని. అందుచేతనే ఇవాళ ఆమె కేవలం ఒక్క స్త్రీగానే ఉండిపోక మనిషిగా తయారయింది.

ఇది నాకు చాలా గర్వించతగ్గ విషయం.

భర్తని ఎరుగని, భర్తముఖంచూడని బాలవితంతువుల వివాహంలో తప్పేముందని వ్రాశావు. నీనుండి ఈ విషయం రావడం గొప్పతనమే. నా రచనలు నీలో ఏ ఒక్క బాల వితంతువుయెడలనైనా జాలి కలుగజేశాయంటే నాకు పెద్ద బహుమతి లభించినట్లుంది.

ఇక నీ రచనగురించి కొద్దిగా ముచ్చటిస్తాను. ఈ రోజుల్లో బెంగాలీలో లెక్కలేనన్ని నవలలు వెలువడుతున్నాయి. వాటినుంచి నేను రెండు విషయాలు గుర్తించాను. ఒకటి పురుషుల రచనలు సాధారణంగా నిస్సారంగానూ చదువపీలులేకుండానూ ఉంటున్నాయి. ఇంతేగాక వాటిల్లో పదిహేను అణాలభాగం ఇతరులనుండి దొంగిలించబడ్డ విషయాలే వుంటున్నాయి. దీనికి వారు ఏ మాత్రమూ సిగ్గుపడడం లేదు. తమ పుస్తకాలు అమ్మకమైతేనే చాలునని వారు చూచుకుంటున్నారు.

రెండవ విషయం ఏమంటే, స్త్రీల రచనల విషయంలో ఏమివున్నా లేకపోయినా కనీసం వాటిలో సాహిత్య చౌర్యంలేదు. వారు తమ చిన్న కుటుంబంలో చూసిన విష

యాలను, తన జీవితంలో యదార్థంగా జరిగే అనుభవాలను మాత్రమే కల్పనద్వారా ప్రకటించుటకు ప్రయత్నిస్తారు. అందుచేతనే అవి ఎక్కువగా కృత్రిమంగా వుండవు.

నీ రచనలో వున్న సత్సాహసము, సరళత్వము నన్ను ముగ్ధుణిగా చేశాయి. రచన అంత బాగుండకపోయినా కృత్రిమత్వం లేకపోవడంవల్లనే అందంగా సాగింది. శేషాంశము నాచే వ్రాయించాలని సమయం నష్టపరచుకోకు. స్వతంత్రించి పుస్తకం వ్రాయి. నువ్వు ఎవరికీ తీసిపోవని నేను ఆశీర్వదిస్తున్నాను.

ఇక్కడ నేనిప్పుడు నీకు ఒక ఉపదేశంచేయాలనుకుంటున్నాను. స్త్రీకి భర్త పరమపూజ్యుడే. అందరినీ మించిన గురువుకూడా. అలాగని స్త్రీ పురుషునికి దాసి అని అర్థంకాదు. కాని ఈ సంస్కారం స్త్రీని ఎంతగానో కించపరచి చిన్నబుచ్చుతుంది.

నువ్వు పుస్తకం వ్రాసేటప్పుడు ఈ విషయాన్ని బాగా గుర్తుంచుకోవాలి. భర్తఎడల తిరుగుబాటు భావాన్ని ఎప్పుడూ మనస్సులోనికి రానీయకు. భర్తకూడా మనిషే; మనిషిని భగవంతుడుగా ఎంచి పూజించడం అనవసరమే కాక, దానివల్ల తననూ, తనభర్తనుకూడా చిన్నబుచ్చుకుంటుంది.

నిన్ను ఒక ప్రశ్న అడుగుతున్నాను. "భర్తను ఎరుగని, చూడని వితంతువు........."

అయితే ఒకసారి భర్తతో కలిస్తే అంటే 16, 17 సంవత్సరాల వయస్సులో వితంతువైతే ఆమెకు మరొకరిని

ప్రేమించడానికిగాని, పెళ్ళిచేసుకోడానికిగాని అధికారం లేదా? ఎందుకు లేదు? కొంచెం ఆలోచిస్తే స్త్రీ భర్త యొక్క ఆస్తి అనే సంస్కారం ఇమిడివుందని బోధపడుతుంది. స్త్రీకి స్త్రీగా అస్తిత్వం లేదన్నమాట.

"హేమ సందేహంతో రోజులుగడుపుతూంది. గట్టితనంలేనివారికి బంధనాలే మంచివి కాదా?"

వివాహమే స్త్రీకి సర్వశ్రేష్ఠమైన శ్రేయస్కర విధానం అని నిర్ణయమైనప్పుడు మాత్రమే ఆ బంధనాలు మంచివౌతాయి.

ఇంతవరకూ నే నెక్కడా వితంతు వివాహాలు చేయించలేదంటే నీకు ఆశ్చర్యం కలుగవచ్చు.

దీనికి సమాధానమల్లా ఒక్కటే: ప్రపంచంలో ఆశ్చర్యకరమైన విచిత్రవస్తువులు ఎన్నో వున్నాయి. ప్రయత్నించినా నాటికి కారణాలు కనబడవు.

నా ఆశీర్వాదాలు అందుకో—

శరత్‌చంద్ర చటోపాధ్యాయ.

— .... —

మంగళవారం. 5 ఆగష్టు 1919
శివపూర్ - హౌరా.

సౌభాగ్యవతికి,

మీ వారిత్రపతి, యితర రచనలు సరిగానే అందాయి. ఇంత వెంటనే సమాధానమివ్వడానికి పూనుకుంటున్నానంటే నాకు చాలా సంతోషంగా వుంది. ఈసారి మీకు చెప్పవలసినవి చాలా విషయాలున్నాయి అనిపిస్తుంది.

కాని మీలాగా విషయాలన్నీ వరుసలో పెట్టి ఉత్తరం వ్రాసే శక్తి నాలో లేదు. అందుచేతనే పిల్లలు వ్రాసినట్లు చిందర వందరగా వ్రాసిన నా కాగితాలను కలిపి చదువుకోటానికి, చదువుకున్నతర్వాత అది అర్థంచేసుకోడానికి తలప్రాణం తోకకివస్తోందని నా మిత్రులు ఫిర్యాదుచేస్తుంటారు. వీరి అభియోగం నిరాధారమైనది కాదు. సవినయంగా దాన్ని స్వీకరిస్తున్నాను. అయితే అట్టి నమూనా మీ యెడల నేను చూపలేదు. ఈవిషయాన్ని మీరు చాటున మీ మిత్రులకు చెబితే నేనేమీ కోపం తెచ్చుకోనులెండి......

బ్రహ్మసమాజ స్త్రీలలో చాలామంది నాకు మిత్రులున్నారు. వారికి ఒక మిత్రునివలె ఉత్తరం వ్రాయడానికి నేనెప్పుడూ సంకోచించలేదు. కాని నేటి మన సమాజ నియమాలు ఎలా వున్నాయంటే చెల్లెలికి ఉత్తరం వ్రాద్దామన్నా ఆమె భర్తగాని లేక ఇతరులుగాని ఏమనుకుంటారో అనీ, దానివల్ల ఆమె కేమేనా బాధలు కలుగుతాయేమోననీ భయపడవలసివస్తోంది. అయినప్పటికీ మీ కిన్ని విషయాలు వ్రాయడానికి పూనుకున్నాను. స్త్రీల విషయమై నాకుగల అనుభవంతో మీ ఉత్తరాలు చదివిన మీదట స్త్రీలలో ఆత్మగౌరవం వుత్పన్నమయ్యే వయస్సులోనే మీ రీ ఉత్తరాలు వ్రాశారని తెలుసుకున్నాను. ఈ గాంభీర్యం, ఈ సాహసం, ఈ సంయమం స్త్రీలలో పాతికసంవత్సరాలలోపుగా కలగడం నే నెక్కడా చూడలేదు. అయితే మీవిషయంలో నాది తప్పు కావచ్చునేమో కాని అలా కాకుండా వుంటేనే నేను నిశ్చింతగా వుంటాను. ఒక యుక్త

వయస్సుగల యువతితో ఉత్తరప్రత్యుత్తరాలు జరపడంలో నాకు సంకోచం ఎందుకు కలుగుతుందోననే విషయం మీరా వయస్సు దాటిపోతే మీకు తేలికగా అర్థంఅవుతుంది. కాని అన్నిటికంటె ముఖ్యమైన విషయమేమంటే నువ్వు నన్ను అన్నయ్యా అన్నావు. అన్నదగ్గర చెల్లెలికి సిగ్గుపడవలసిన అవసరంలేదు. అన్నకు తగ్గ గౌరవాన్ని, మర్యాదనూ అట్టేపెడుతూ ఎప్పుడువడితే అప్పుడు ఏది వ్రాయాలని వుంటే అది వ్రాయమని, నీ యిష్టంవచ్చినట్లు అన్నగారిని చికాకుపరచమనీ చెబుతున్నాను. అందులో నాకు సంతోషమే గదా!

నీ ఉత్తరంవ్రాసే విధానం, ఆ భంగిమ చూస్తే మాట మాటకి నిరుపమ గుర్తుకువస్తోంది నీ దస్తూరికూడా ఒక్కలాగే వుంటుంది.

వర్షంలో తడవడంవల్ల నాలుగైదు రోజులనుంచీ జ్వరంగావుంది. బయటకు ఎక్కడకూ వెళ్ళలేకపోవడంవల్ల నీ ప్రతిని శ్రద్ధగా చదవగలిగే అవకాశం చిక్కింది. చదువుతూవుంటే నా కెలా అనిపించిందో తెలుసా? దుకాణంలో విలువైన వస్తువులు చిందరవందరగా పడిఉండడం చూచినప్పుడు, ఆ వస్తువుల విలువ తెలిసినవానికి ఎలాంటి కష్టమనిపిస్తుందో నాకూ అలాగేవుంది. సరిగ్గా ఒకనాడు ఇలాంటి స్థితిలోనే నిరుపమ రచనలుకూడా నా ముందుకు వచ్చాయి.

చెల్లీ! నీ వద్ద చాలా విలువైన సామానుంది. కాని అది చాలా అస్తవ్యస్తంగా ఉంది. వీటిని సర్దటమే నా వృత్తి గదా! అందుచేత నిరుపమలాగనే నీ చెయ్యికూడా పట్టుకుని

ఒక సంవత్సరం వ్రాయడం నేర్పాసంటే, ఇంతకు ముందు నేను నిన్ను ఆశీర్వదించిన వాక్యాలు సార్థకమై నీ రచనా లత పూలతో కళకళలాడుటకు ఎంతో కాలం పట్టదు. అప్పుడు 'దీదీ' (సోదరి) వంటి పుస్తక మొకటి పాఠకలోకం ముందుంచడంలో ఆలస్యంపట్టదు. కాని ఇది జరిగే అవ కాశం లేనప్పుడు దాన్ని గురించి బాధపడడం అనవసరం కదా! ఇలా కొద్దిగా నేర్పితేనే ప్రకాశించగల వ్యక్తులెందరో ఆ మాత్రం శిక్షణకూడా దొరకని కారణంగా నష్టపడు తున్నారని నేను విచారిస్తూఉంటాను. కాని దాన్ని గురించి పట్టించుకునేది ఎవరు? మౌలికత్వం (వరిజినాలిటీ) లేక సాహిత్యచౌర్యంచేస్తూ చెత్తవ్రాసేవారి గుట్టలతోనే బెంగాలీ సాహిత్యం నేడు నిండిపోయింది. తను జీవితంలో సత్యాను భూతి పొందినవారు, స్నేహ, ప్రేమ స్వరూపాలను గుర్తించినవారు అంతరాళంలో అణిగిపోయి ఉంటున్నారు. దుఃఖాగ్నిలో తపించి తను అనుభూతిగయొక్క నాణ్యాన్ని నిరూపించనివారే నేడు సాహిత్యసృష్టి చేస్తున్నారు. అందు చేతనే నేడు సాహిత్యం అధోగతికి పోతోంది.

లీలా! హృదయానుభూతి పొందినంతమాత్రముననే ఏ విషయాన్నీ భాషద్వారా వ్యక్తీకరించలేము. ప్రతీదానికీ కొంత అధ్యయనం అవసరమౌతుంది. ఈ అధ్యయనం ఎప్పుడూ ఎవరంతవారు స్వయంగా చేసుకోవడంవల్లనే పూర్తికాదు. కాని ఏంచెయ్యను చెప్పు; నీకు నేర్పి నిన్ను కూడా నిపుణురాలిగ తయారుచేసే అవకాశంలేదు. లేనిదానికి విచారించి ప్రయోజనమేమిటి?

ఏమైనా స్థూలంగా నీకొక ఉపదేశమిస్తున్నాను. రచనను అధ్యాయాలుగా విభజించాలి. తొంభైపాళ్ళు రచయిత చెప్పకుండా పాత్రలనోట చెప్పించాలి. అలా కానిచోట మాత్రమే పాఠకుల మనస్సును పట్టిఉంచడానికి రచయిత తన మాటలలో చెప్పాలి. మరొక ముఖ్యవిషయ మేమంటే చిన్నచిన్న విషయాలు తీసుకుని తానూ బాధపడి పాఠకులను బాధపెట్టడం జరగరాదు. చాలా విషయాలు పాఠకుల ఊహకు వదిలిపెట్టాలి. కొంత రచయిత చెప్పి కొంత పాఠకుల ఊహకు వదిలిపెట్టడం విద్యాసాపేక్షమూ బుద్ధిసాపేక్షమూ కూడాను.

ఇకనుంచి నీ చదువు ప్రారంభం. అధ్యాయాల్లో విభజించి నా పుస్తకాలమాదిరిగా రెండు అధ్యాయాలు వ్రాసి పంపు. నా సామాన్య శక్తిని అనుసరించి దాన్ని అవసరమైన మార్పులు చేర్పులతో దిద్ది త్రిప్పిపంపుతాను. దానితోపాటు మార్పులకు కారణాలుకూడా వ్రాస్తాను. ఇంతశ్రమ నేనెందుకు పడుతున్నానో తెలుసా ? నీ ద్వారా సాహిత్యదేవి పూజ నిష్కల్మషంగా జరుగుతుందనే ఆశ నాకుంది. అంతేకాక నీ కలంనుండి ఉద్భవించే సామాగ్రి తక్కువస్థాయికి చెందిందికాదని నా ఉద్దేశ్యం. నీలో ఈ అమూల్యవిషయాలు చూచిఉండకపోతే అనవసరంగా నిన్ను పొగడి నీ సమయాన్ని, నా సమయాన్ని నష్టపరచుకునేవాడినికాను.

నేను చెప్పే ఈ సంగతి గుర్తుంచుకో. నువ్వు ఎవ్వరికీ తీసిపోవని నేను ఆశీర్వదిస్తున్నాను.

నీ వ్రాతప్రతి రెండు మూడు రోజుల్లో పంపుతాను.

'కాల్లో' కథను నా 'పరిణీత' లాగా అధ్యాయాలుగా విభజించి వ్రాసి పంపగలవా? చెప్తే, మొదట్లో కొంచెం కష్టంగా ఉంటుంది; కాని ఓర్మి లేకపోతే లాభం లేదు. ఇంత పరిశ్రమ, ఇంత కష్టంతో కూడుకున్నది కనుకనే దీనికింత విలువ. ప్రారంభంలో మన శ్రమ చాలా వృథాగాపోతున్నట్లు కనపడుతుంది. కాని ఎప్పుడూ శ్రమ వృథాగాపోదు. తర్వాత ఏదో ఒక రూపంలో దానివల్ల లాభం కలుగకపోదు. చాలా రాత్రి అయింది. పైకి వెళ్ళాలనే ఆందోళన పెరిగింది. అందుచేత ఇవాళ ఇక్కడితో ఆపుచేస్తున్నాను. ఇవాళకూడా ఇంకా కడుపులో అన్నం పడకపోవడం మూలంగా ఉత్తరం గడబిడగాఉంది. అందుచేత కొంచెం కష్టపడి చదువుకో. ఎక్కడైనా వరుసగా లేకపోతే నీ అన్నని కానడంవల్ల క్షమించు. నా ఆశీర్వాదా లందుకో. రాత్రి పన్నెండున్నర అయింది.

—నీ అన్న.

సరిగా ఉందనుకోగానే నేనే ఏదైనా మాసపత్రికకు పంపుతాను. నేను పంపితే ఏ సంపాదకుడూకూడా కాదనడు. సరిగా లేకపోతే నేను ఎప్పుడూ పంపనని వారికి తెలుసు. ఇంటిపనులు నీ కెక్కువ ఉండటంవల్ల తీరిక తక్కువ ఉంటుంది; నిజమే. కాని ఎప్పుడూ తీరిక లేకపోయినప్పుడే ఏదో ఒక సమయం దొరుకుతుంది గాని, తీరికగా ఉన్నప్పుడుమాత్రం పనిచేయుటకు అవకాశమే దొరకదు.

—— .... ——

శివపూర్ — హౌరా.
14-8-16.

సౌభాగ్యవతికి,

నువ్వు వ్రాసిన చిన్న-పెద్ద ఉత్తరాలు రెండూ నిన్న-ఇవాళ అందాయి. మొట్టమొదట స్వవిషయం చెప్పుకోనీ. నేను ఎప్పుడూ కిటికీలు, దర్వాజా తెరచిపడుకుంటాను. ఒకరోజు వుదయం లేచి చూసేసరికి నా తలగడ, పరుపు, బట్టలు అన్నీ మంచుతో తడిసిపోయాయి. అదే రోజున మధ్యాహ్నం నీళ్ళలో కూడా తడవవలసివచ్చింది. ఈ రెండూ కలిసేసరికి జ్వరం ముంచుకువచ్చింది. ఒకటి రెండు రోజుల్లో తగ్గిపోతుందేమోనని చూశాను. కాని తగ్గలేదు సరిగదా హెచ్చిపోయింది. ఇప్పుడు పూర్తిగా నెమ్మదించిందిలే. మరొక చిత్రమైన విషయమేమంటే చాలా రోజులనుంచీ కుడి మోకాలు క్రింద బాగా దురద, మంట ప్రారంభమై చాలా బాధపెట్టింది. నాలుగురోజుల తర్వాత చూచుకుంటే కొంచెం ఎర్రబడి ఎగ్జిమాలా తయారైంది. కొంచెం వాపుకూడా కనిపించింది. కొన్నాళ్ళబట్టీ ఇక్కడ బెరీబెరీరోగం ఎక్కువగా వుందని విన్నాను. కాని అది ఏమిటో ఎలాగవుంటుందో ఇంతవరకూ చూడలేదు. బహుశా అదే అయివుండవచ్చుననుకున్నాను. తరచు టించర్ అయొడిన్ వ్రాశాను. దాంతో స్థితి విషమించి నిజంగానే బెరీబెరీ అయితే బాగుండు ననిపించింది. తర్వాత డాక్టరువచ్చి నానా చివాట్లు పెట్టి, 'మీలో ఏ మాత్రమూ ఓర్పు లేకపోతే ఎలాగ? ఇంక ఏ యాసిడ్ గాని, సోడాగాని వ్రాసుకోండి' అన్నారు.

కాని చివరకు చికిత్సకు ఉపక్రమించి రెండుకాళ్లూ తలగడల మీదపెట్టుకుని పడుకోండి అని చెప్పాడు. మరి ఏంచెయ్యాను చెప్పు! అందుచేత నే కదలడంలేదు. మూడవ విషయం ఏమంటే నేనెప్పుడూ ఆరోగ్యని కాలేను. నేను చాలా తక్కువ తింటాను. ఆ రోజున ఇంటినుంచి తెచ్చిన మిఠాయిలు బల వంతంగా తినిపించారు. ఆ త్రేన్పులు ఇంకా వస్తూనే వున్నాయి. నేను ఈ దేశంలో పేరుపొందిన సోమరిని. నడవవలసివస్తుందనే భయంతో తిండితినడం మానివేసే రకాన్ని. అలాంటి నా మీద ఇంతదారుణం వచ్చిపడిందే! ఎలా సహించను? కాని యింట్లోవాళ్ళకి తెలీక నేను ఇలా ఏమి తినకపోవడంవల్లనే చిక్కిపోయాననుకుంటారు. అందు చేత బాగా తింటే ఏనుగుగున్నలాగా బలిసిపోతానని వారి భావం.

కీ. శే. గిరీశ్ బాబు తన "అబూహసన్"లో లక్షువగ హేలమాట ఒకటి చెప్పారు. "స్త్రీలు చాలా దురాశా పరులు. వాళ్ళు చచ్చిపోయినా యింకా తినడం మానరు" అన్నారు. స్త్రీజాతిని బాగా కనిపెట్టా రాయన.

ఇప్పటికి 20 సంవత్సరాలనుంచీ మాయింటిలో భోజనం విషయంలోనే తగాదాపడుతూవస్తున్నాము. 'ఆయన సరిగా భోజనంచెయ్యకపోవడంవల్లనే ఇంత చిక్కి పోయారు. ఇల్లూ-వాకిలీ-వంట ఇవన్నీ ఎవరికోసమో? ఎలా జరిగేదలా జరుగుతుంది. చివరికి నేను వైరాగ్యం తీసుకుం టాను" అంటూవుండేది. అప్పుడు నే ననేవాడిని—"నీకు వైరాగ్యం పుచ్చుకోవాలని ఉంటే త్వరగా పుచ్చుకో.

నన్నిలా భయపెట్టి ఎందుకు బాధిస్తావు? ఎక్కడైనా స్వర్గం అంటూ ఉంటే బహుశా అక్కడ తినడానికి ఎవరూ బల వంతపెట్టకుండా ఉంటూ ఉండాలి. ఒకవేళ స్వర్గంలో కూడా తిండివిషయంలో బలవంతపెడితే నేను నరకానికి వెళ్ళడానికే ఇష్టపడతాను.

అన్నట్లు మర్చిపోయాను. మరొక విషయముంది. ఇరవై రోజులక్రిందట కుక్కలమధ్య తగాయిదా తీర్చడానికి వెళ్ళాను. కాని ఏ ప్రక్కనుంచో ఒక కుక్క వచ్చి నా అర చేతిని కరిచింది. పాపం! ఆ కుక్క ఎంత కృతఘ్నురాలు! దాన్ని నా 'భేలూ' బారినుండి తప్పించాలని వెళ్ళాను. ఈ విషయం నే నెవరికీ చెప్పలేను. పూర్తిగా ఎండిపోయిం దనుకో. కాని మళ్ళా నిన్నటినుంచీ కొంచెం నొప్పిగా ఉంది.

ఇప్పుడు తగ్గుతోందిలే ప్రస్తుతానికి ఇంతటితో నా శారీ రిక క్షేమసమాచారాల పట్టికను ముగిస్తున్నాను. సంతో షించదగ్గ విషయ మేమంటే, నే నింక వృద్ధుణ్ణి అయిపో యాను. ఏదో ఒక మిషమీద ఈ ప్రపంచాన్నుంచి వెళ్ళి పోక తప్పదు.

ఎన్నెన్ని దుఃఖాలు, బాధల మధ్య 40 సంవత్సరాలు గడిపానో! మా యింట్లో ఇంతవరకూ ఎవరూ నలభయ్యో సంవత్సరాన్ని చూడలేదట! కనీసం ఈ విషయంలోనైనా మా తాత ముత్తాతలను ఓడించాను. ఇంతకంటే కావలసిన దేముంది?

అవన్నీపోనీ, ముసలివాళ్ళ జీవన్మరణ విషయాలు

చెప్పి మిమల్ని దుఃఖపెట్టదలచుకోలేదు. కాని చెల్లీ! నీ ఆరోగ్యంకూడా అంత బాగుండలేదుకదా. వంటివిషయంలో కాస్త జాగ్రతపడు.ఇప్పుడు నువ్వేమీ కష్టపడనక్కరలేదులే. ఆరోగ్యం కోలుకుని తిరిగివస్తే అదే చాలు. నీ రచనలన్నీ చాలా శ్రద్ధగా చదివాను. ఇందులో అన్నీ ఉన్నాయి; కాని నేర్పరితనంలేదు. సాహిత్యాన్ని సృష్టించే కౌశలాన్నికూడా నేర్చుకోవాలి. ఒక్క అనుభూతి మాత్రమే చాలదు. నేనా వృత్తిలోనే ఉన్నాను గదా. ఆ కాస్త నేర్పడానికి ఇంక ఎంతో కాలం పట్టదు.

చెల్లీ! సంఘటిల్లే ఘటనలన్నీ వ్రాసేయకూడదు. కొన్నిస్పష్టంగా చెబితే, కొన్నిటిని సంజ్ఞామాత్రంగా వదిలి వేయాలి. మరికొన్ని చదువరులు తమకు తామై అర్థంచేసు నేలా చెప్పాలి. ఉత్తరం ద్వారానూ, దిద్దుబాటులతోనూ, దూరంగాఉండి ఎంతచేయగలనో అంతాచేస్తాను. ఎక్కు వగా చేయలేకపోయినా ప్రయత్నిస్తున్నాను గదా. ఈ మాటు శీతాకాలంలో నేను ఇల్లు కదలగలిగినట్లయితే మీ హిందీవాళ్ళ దేశంలో 0–15 రోజులుండాలను కుంటున్నాను. అప్పుడు నీకు కొంత స్వయంగా నేర్పగలుగు తాను. కాని ఒకవేళ నా పాత సోమరితనం ఎక్కువైతే ఏమీ చెయ్యలేను.

...వా? వాళ్ళు కుశలంగా నే ...ల్చను నా మనస్సు అంగీక ... చెబుతాను. వాళ్ళు

నభ్యసించినవాళ్ళూను ! ఏ ఒకరిద్దరో తప్ప మిగిలినవాళ్ళం దరూ లోపల్లోపల నే నంటే భయపడతారు. నేను వాళ్ళని పూర్తిగా ఆపాదమస్తకం ఎరుగుదునని వాళ్ళకి తెలుసు. అందుచేతనే నా ముందు వాళ్ళ ఆటలు సాగవు. వాళ్ళ హృదయంలోఉన్నంత కృత్రిమం సంకుచితత్వం బెంగాలులో మరి ఏ యితరులలోనూ ఉండదనిపిస్తుంది. చెల్లీ! నే నెప్పుడూ వంటకాలకి అంటిపెట్టుకోలేదు. కాని నేను మహిళచేతో వండినది తినను! తల్లిదండ్రు లిద్దరూ బ్రాహ్మణులై, పెళ్ళికూడా బ్రాహ్మణులతో చేయించుకున్నవారు వండితేనే తింటాను.... సోషియల్ అంటావా, దాసినల్ల వచ్చేదీ పోయేదీ ఏమీ ఉండదు. కాని అలా పంగమజాతి అంటినది నేను తినను. 'శరత్ బాబు పెద్దపెద్ద కబుర్లు చెబుతారు. గొప్పగా వ్రాస్తారు. అంతేకాని ఆయన వాస్త వంగా చాదస్తుడు' అంటారు. లీలా! అలా అంటారేగాని నేను చాదస్తుణ్ని కాదు. అయితే నాకు వాళ్ళంటే వున్న కోపంకారణంగానే నేను వాళ్ళు వండింది తినను. ఇంకా యిది కూడా చూచేవుంటావు...... ఆడపిల్లల్లో 99మంది కురూపిణులే. కాని, సబ్బులు, పౌడర్లు, స్నోలు పూసుకుని, మెరిసేబట్టలు, సెంట్లతోనే అలా తయారౌతారు! నేను ఫ నలుగురైదుగురు ఆడపిల్లల్నే మాత్రం చూచాను. నిజంగా గౌరవార్హులు. వాళ్ళు ... వాళ్ళనీ మన పిల్లల్ని పోల్చి... రణాలా హిందూపిల్లలవలె ...

రావచ్చు. కాని నీకు తెలుసు, నా చెల్లీ! నా హృదయంలో మీరంటే నా కెంత గౌరవమో; మీయందు నే నెంత స్నేహం చూపుతానో? కేవలం టిప్‌టాప్‌గా తయారవడం, చదువును ప్రదర్శించుకోవడం, అజ్ఞానంవదలి నాగరికులమయ్యామనే గర్వం, యదార్థంకాని దాని మీదుండే మిథ్యాభిమానం-ఇవి చూస్తేనే నాకు ఇంత చీదరింపు.

వాళ్ళముందు నువ్వు అపహాస్యంపాలవుతావా? వీళ్ళల్లో ఒకటి - రెండు డజన్లనందిని పట్టి నీ దగ్గరికి కాన్పూరు రవానాచేయనా అనిపిస్తుంది. వాళ్ళు కనీసం దేనికీ పనికిరాకపోయినా నేను చెప్పినవిషయాలు నిరూపించడానికైనా పనికివస్తారు.

"అన్నగారిని గౌరవించడం" ఎలాగో నీ కెలా తెలుస్తుంది. నీ కెవరూ అన్నలు లేరుగదా!

నీ భర్తయొక్క ఉదారతను గురించి తెలుసుకుని చాలా సంతోషించాను. నేను హృదయపూర్వకంగా వారిని ఆశీర్వదిస్తున్నాను కాని చెల్లీ, వారితో ఒక్కమాట చెప్పాలనిపిస్తుంది. చిన్నతనంలో నేను ఒకసారి ఆరేడువందల మంది కులంనుండి బహిష్కరింపబడ్డ బెంగాలీ స్త్రీల చరిత్ర సేకరించాను. దీంట్లో చాలా కాలమూ, చాలా డబ్బుకూడా ఖర్చయ్యాయి. అయితే దానివల్ల నే నెన్నో విచిత్ర విషయాలు నేర్చుకున్నాను. చెడు ప్రచారం బాగా జరిగినా నే నొక విషయాన్ని స్పష్టంగా బయటపెట్టాను. ఇలా కుటుంబాలు వదిలివచ్చిన స్త్రీలల్లో నూటికి ఎనభైమంది

భర్తలుండి కాపురంచేస్తున్నవాళ్ళే, వితంతువులు చాలా తక్కువ! భర్తఉంటేనేమి! ఎంతకావలాలమధ్యపెడితేనేమి! లేక వితంతువైతేనేమి! చెల్లీ, ఎన్నో దుఃఖాలు, కష్టాల కారణంగానే స్త్రీ తన ధర్మాన్ని నాశనంచేసుకొనుటకు పూనుకుంటుంది. అలా చేయుటకు కారణం పరపురుషుల రూపం కాదు. ఇతర భీభత్స ప్రవృత్తుల లోభమూ కాదు. తమ ఇంత గొప్పవస్తువును పోగొట్టుకుంటున్నారంటే బయటబడి మరేదో ఆశ్చర్యకరమైనదానిని పొందుతామనే ఆశయోకూడా కాదు. ఏదో ఒకదానినుండి ముక్తిపొందుటకే వారిన్ని కష్టాలకూ వెనుదీయుటలేదు. ఇవన్నీ బహుశా నీకు అర్థంకావు. నేను చెప్పడమూ బాగుండదు. కాని అన్నిటికంటే మించినదేమంటే నువ్వు స్త్రీవి మాత్రమే కాక, నా చెల్లెలివికూడాను! ప్రపంచంలో ఆ సంబంధం నీచమైనదికూడా కాదు.

'కథ' లో ఎంతయదార్థం, ఎంత కల్పనవుందో నాకు తెలియదు. కల్పనే ఎక్కువవుంటే గొప్పవిశేషమే. కాని సాహసం చాలడం లేదు. అది ఎవరో? ఇప్పుడిక పవిత్రుని గురించికూడా కొంచెం చెప్పాలి. నాకు ఎక్కువగా తెలియదుగాని స్వచ్ఛమైన శీలంగల మంచిచుత్రవాడు నిన్ను 'సోదరీ' అనవచ్చు. వయసులో నీకంటే రెండుమూడు మూనాళ్ళైనా చిన్నవాడు కావచ్చు. అలా సంబోధించడంవల్ల ఏ స్త్రీకి అగౌరవం కలగదని నా నమ్మకం. అతనికి నువ్వు ఉత్తరాలు వ్రాయవచ్చు. అందులో ఏమీ నష్టం వుండదు. అంతేకాక నువ్వుకూడా కల్పితేని కనకానివికదా. ఎవరిని

ఎలా గౌరవించాలో నీకు బాగా తెలుసునని నా నమ్మకం. కొద్దిరోజుల్లోనే బెంగాలీ సాహిత్యక్షేత్రంలో ఎవ్వరికీ తీసిపోని రచయిత్రి వుదయిస్తుందని ప్రచారం చేస్తున్నాడని విన్నాను. నిన్న ఒకాయన ఆ 'సమాగమము' అచ్చువేస్తానని వచ్చాడు. కాని నేను ఇవ్వలేదు. పత్రికల్లో ప్రకటించబడేటంత బాగా లేదని అన్నాను. ఇప్పుడు కొందరు ఏమీ వద్దు. చాలామంది చాలా బాగుందని అంటారు. నాకా విషయం తెలుసు. అలాగే బాగుండలేదనీ నిందించేవాళ్ళుకూడా తక్కువ వుండరనీ నాకు తెలుసు. ఓపికపట్టి ఒక సంవత్సరం ఆగితే, నేను మాసపత్రికలో ప్రచురణకిచ్చినప్పుడు ఆ సంశయాలు వాటంతట అవే తీరిపోతాయి.

నేను నిన్ను శిష్యురాలినిగా అంగీకరించాను. కాని చూడు చెల్లీ, నిరుపమ మాదిరిగా చివరికి గురువునే 'చంపే' విద్య మాత్రం నేర్చుకోకు. ఇప్పుడామె నాకంటె గొప్పదై పోయింది. కొంతకాలం తర్వాత నువ్వుకూడా అలా గొప్పదానివైపోవచ్చు. ప్రపంచంలో విచిత్రమేమిటంటే రేపు ఎప్పుడేమి జరుగుతుందో చెప్పలేము!

నువ్వు ఆరోగ్యం కోలుకొని బాగుపడ్డానని, ఇంక ఏమీ జబ్బు మిగలలేదని వ్రాసినప్పుడే నేనా విషయాన్ని ఒప్పుకోగలను! మానసికరోగం వున్నవాళ్ళను శిష్యులుగా చేసుకోను. మొదట నువ్వు డాక్టరు సర్టిఫికేటు తీసుకు రావాలి. లేకపోతే నిన్ను శిష్యురాలినిగా చేసుకొని నీకు అన్నీ నేర్పినతరువాత అకస్మాత్తుగా ఈ ప్రపంచాన్ని వీడి పోతే నా శ్రమకు లాభం ఏముంటుంది గనుక?

'మీకు పరిచితమైన శ్రీరాంపూర్' అని నువ్వొక సారి వ్రాశావు. అయితే 'జయరాంపూర్' పరిచయం లేదా? దాని మలేరియా, బరోగ్రీరోగాలవలెనే దోమల దండులను తేలికగా మర్చిపోయేవారెవరూ వుండరు. క్రిందటి వైశాఖంలో ఈ భయంవల్లనే 'పులగం పండుగ' కు నాకు ఆహ్వానంవచ్చినా అంగీకరించలేదు. జయరాంపూర్ లోని మరొకపిల్ల నన్ను అన్నయ్యా అని పిలుస్తుంది. నేనా అమ్మాయిని చెల్లీ అంటాను.

దేహరీ వెళుతున్నావా? నువ్వు పుట్టకముందు నేను ఆ దేహరీ యేటిఒడ్డున పండిన...... ఏరుతూ వుండేవాడిని. వలవేసి తొండలను పడుతూవుండేవాడిని. అబ్బా! ఎన్ని రోజుల క్రిందటి సంగతనుకున్నావు ఇది. రైలుమార్గం పడనప్పుడు ఆరానుంచి స్టీమరుఎక్కి వెళ్ళవలసివచ్చేది. బహుశా నీ బంగళానుకూడా చూచేవుంటాను. ఇప్పటికినాకు కళ్ళకుకట్టినట్లుంది. మీయింటిలోంచి బయటకురాగానే కుడిచేతివేపు సూర్యుడు వుదయిస్తాడు కాదూ? ఆ రోజుల్లో 'సతీచౌరా' అనో అలాంటి పేరుతోనే ఒక రేవు వుండేది. మీ యింటినుంచి రెండు మైళ్ళుంటుంది. కొంతసేపు అక్కడికిపోయి కూర్చుంటూవుండేవాడిని. నేడు ఆ రేవు వుందో లేదో నాకు తెలియదు.

'దేశద్రిమ్మరి'కి రాకపోకల్లో ఏమీ అంతబాధ ఉండదు. ఆ విషయంపోనీ. బర్మాగురించి ఇన్నివిషయాలు ఎలా తెలుసుకున్నావ్? అక్కడ మేజస్ట్రీటు మ్యాక్ అని నీ కెవరు చెప్పారు. మాండలేనుంచి స్టీమరుమీద వెళ్ళివచ్చే

మార్గం ఉందని ఎవరిద్వారా విన్నావు? ఒకవేళ నిజంగా నువ్వు కొంతకాలం బర్మాలో ఉండిఉంటే ఎక్కడ ఉన్నావు? ఆ దేశాన్ని నా యీ రెండుపాదాలతో కొలవని ప్రదేశంలేదు. అయినా నా వంటి సోమర చక్రవర్తులు ఈ ప్రపంచంలో చాలా తక్కువమంది ఉంటారు.

'రాజ్యలక్ష్మి' ఎక్కడుందా? అదంతా కల్పనా చిత్రము మాత్రమే. శ్రీకాంత్ ఉపన్యాసంలో తప్ప మరెక్కడా ఉండదు. అలాంటి ఆధారరహితమైన అప వాదులగురించి పట్టించుకో కూడదు. కథ నిజమేనా అంటావా? ఎవరికథ? నువ్వు చిరంజీవినివవు దీర్ఘాయుష్మాన్ భవ. మాటమాటకీ ఇలాగే ఆశీర్వదిస్తాను. నే నింత చెప్పినా, చచ్చిపోయికూడా ఆరోగ్యంగురించి అశ్రద్ధ వహించకు. నిన్నింతవరకూ చూడలేదు. కాని నీయెడల నా కెందుకో ఇంత స్నేహం కలుగుతోంది. అది నీ అదృష్టం అనుకుంటాను. నేను సోమరిని కాకపోతే నిన్ను చూడడానికి శీతాకాలంలో కాన్పూరు వచ్చిఉండేవాడినే అనుకుంటాను. కాని అది జరిగేదికాదనే సంగతికూడా తెలుసు.

నీ ఇద్దరు పిల్లలను ఆశీర్వదిస్తున్నాను. వాళ్ళకి తల్లి దండ్రుల గుణాలు అబ్బితే వాళ్ళ జీవితాలు నిజంగా సార్థక మౌతాయి. నువ్వు జీవించి ఉండి వాళ్ళని మనుష్యులుగా తయారుచెయ్యాలి. చచ్చిపోయి సాధించేదేమీ ఉండదు. అలా జరిగితే నాకూ నిజంగా చాలా కష్టం కలుగుతుంది.

—అన్న.

క్రమ వరుసలో వ్రాసిన నీ ఉత్తరానికి సమాధానంగా చీకిరిబాకిరిగా వ్రాసిన నా ఈ ఉత్తరాన్ని పంపుతూఉంటే నాకు సిగ్గువేస్తోంది.

నేటి కథ ప్రథమఅధ్యాయం ముందు ఉత్తరంలో వ్రాస్తాను.

---

శివపూర్.
బెం. సం. 7 భాద్రపదం 1326.

సౌభాగ్యవతికి,

నీ ఉత్తరం అందింది. అందులో అవసరమైన విషయాలున్నాయి. నిరుపమ అంటే నాకెంతో ఆశఉండేది. కాని 'దీదీ' తప్ప మరేమీ వ్రాయలేకపోయింది.

ఎందుకో తెలుసునా? వారాలు, వ్రతాలు, జప-తపాలతో ఆమెలోని మాధుర్యం ఆమె వయస్సులోనే ఎండిపోయింది. మన ఇళ్ళల్లో ఇవన్నీ చెయ్యని స్త్రీలు ఎవరుంటారు అసలు? సరేలే అదిపోనీ. నీవు నా రెండో ఆశవు. ఇప్పుడు నీకున్నవయస్సే ఇహలోకంనుంచి ప్రయాణంకట్టే సమయం. అందుచేతనే నీకు నేర్పాలనుకుంటున్నాను. అందుకనే నీ ఏ రచననూ కూడా అచ్చువేయించడానికి సిద్ధంగాలేను. తన రచన, తనపేరు అచ్చులో చూచుకోవాలనే కోరిక చాలామందికి ఉంటుందని నాకు తెలుసు. అయితే నువ్వు ఒక సంవత్సరం ఓర్పు వహించగలవనికూడా తెలుసు.

కాని ఇప్పుడు పూర్వంలాగా నేర్పగలిగే వీలులేదు. అట్టి వీలుకు అవకాశంకూడా లేదు. అయినా ఒకసారి అటు వస్తాను. నేను ఎక్కడున్నా నిన్నొకసారి కలుసుకుంటాను.

"వీరి పుస్తకాలేగదా చదువుతున్నాను. వాటిని చదవడంవల్ల నేర్చుకోలేకపోతే వీరువచ్చి రెండురోజులుండి నాకు పెద్దగా ఏం నేర్పగలరు?" అని నువ్వు అనుకోవచ్చు. అది నిజంకూడా. వాస్తవంగా అది నేర్పగలిగే విషయంకాదు. అయినా "మృత్యుముఖంలోంచి తులసి......మొదలైనవి" నువ్వు వ్రాసేటప్పుడు నేను ఉండివున్నట్లయితే చెప్పి ఉండేవాడిని. తులసి చనిపోయి, మొత్తం కథలో ఇక తిరిగిరానప్పుడు ఆమెను గురించి ప్రారంభంలోనే రెండు పేజీల గాథ పాఠకులను విసుగెత్తించేస్తుంది. నేనయితే ఎక్కడనుంచి ప్రారంభిస్తాను అని చెప్పేముందు-అసలు ప్రారంభించడమే కష్టం. ప్రారంభంమీదే పుస్తకం ఆధారపడి ఉంటుంది అని చెప్పేవాడిని.

ఇలా ప్రారంభిస్తే ఎలా ఉంటుందో ఆలోచించు— ఒకనాడు తులసి మృతశరీరం స్మశానంలో బూడిదగా మారిపోతోంది. ఆమె పదమూడు సంవత్సరాల కూతురు మంజరి నిశ్చేష్టురాలై ప్రక్కనే నిలబడిఉంది. నిర్వాణోన్ముఖమైన చితిలోని కిరణజాలం ఆమె ముఖంమీద ఎంతసేపటినుంచీ చిత్రవిచిత్రంగా నృత్యంచేస్తున్నా ఎవరూ పట్టించుకున్నట్లు లేదు. కాని అకస్మాత్తుగా ఆపిల్ల ముఖంపై ఠాకూర్ భార్య తారదృష్టిపడి మంజరిని చూడడంతోనే తార సంభ్రమాశ్చర్యాలలో మునిగిపోయింది. నశ్వరకాయాన్ని విడిచ

వ్యక్తే తిరిగి తన బాల్యావస్థలో ప్రత్యక్షమయిందా అనిపించింది. అచ్చంగా అటువంటి సాటిలేని రూపము, సరిగ్గా అటువంటి మధురమైన శాంతం, ముఖంమీద తీవ్రమైన విషాదరేఖలు అంకితమైయున్నట్లున్నాయి. ఈ మాతృహీనురాలైన అమ్మాయిముఖంవంక చూడగానే ఆమె ఆలోచనా పరంపర గతంలోని సుఖదుఃఖాలతో నిండిన గాథలమధ్య చలనచిత్రం మాదిరిగా తిరుగాడింది. తులసి భర్తను పోగొట్టుకుని మొట్టమొదటిసారిగా తన యింట్లో అడుగుపెట్టిన క్షణం గుర్తుకు వచ్చింది. ఆ తర్వాత తులసి తన వికసించిన రూప లావణ్యాన్ని యితరులనుండి గుప్తంగా ఉంచి తన (తార) కుటుంబసేవలో పదహారణాలా ఎలా మునిగిపోయిందో గుర్తుకు వచ్చింది...... మొదలైనవి......

ఇలా గతచరిత్రను ఎంత సంక్షేపంలో ముగించగలిగితే అంతమంచిది. ఎందుకంటే పుస్తకంలో అది తిరిగిరాదనీ, అందుచేత ఆమెగురించి ఎక్కువ చెప్పవలసిన అవసరంలేదనీ తెలుసుకోవాలి.

దీనితర్వాత కథలో ప్లాటు అనేదానిపైనే ఎక్కువ ధ్యాసఉంచడం అనవసరం. పుస్తకంలో వచ్చేపాత్రల గుణగణాలను గురించి మొదట స్పష్టంచేసుకోవాలి. ఉదాహరణకు నువ్వు నీ తండ్రిని, భర్తని బాగా అర్థంచేసుకున్నావనుకో. వారు తమ గుణదోషాలమధ్య ఏఏ సందర్భాలలో బాగా రాణించగలరో నిశ్చయం చేసుకోవాలి. నీ తండ్రి తన స్వంతపనుల్లో, తన వ్యాజ్యాలూ వాటిల్లో, అలాగే నీభర్త తన మిత్రునికి ఉద్యోగం వెతకడంలో, త్యాగంలో

ఉదారతలో పరిపూర్ణత సంపాదించారని నువ్వు అనుకున్నప్పుడే కథ ప్రారంభించాలి. లేకపోతే మొదటినుంచీ ప్లాటు ఆలోచిస్తూ తలనెప్పి పుట్టించుకోవడంవల్ల ప్రయోజనం ఉండదు.

ఇంకా చిన్న పెద్ద విషయాలున్నాయి. కాని, వాటిని వ్రాస్తే చాలదు. దగ్గరుండి చెప్పాలి. ఉత్తరంలో అవి వ్రాయడం కష్టమౌతుంది. వీటిని నీకు ఎప్పుడో ఒకప్పుడు చెబుతానులే. కాని ఆ సమయం ఎప్పుడునసుందో ఆ సర్వేశ్వరునికే తెలియాలి... నా లెక్కలేనన్ని ఆశీర్వచనాలతో.

నీ అన్న శరచ్చంద్ర చటోపాధ్యాయ.

——…——

శివపూర్,
24-11-16.

సౌభాగ్యవతికి,

నిన్న రాత్రి గం॥ 10-30 ని॥లకు అక్కగారి యింటినుంచి తిరిగివచ్చేసరికల్లా నీ ఉత్తరం, సరోజ ఉత్తరం వచ్చివున్నాయి. సరోజ ఉత్తరం ఇంగ్లీషులో ఉంది. నాకు ఇంగ్లీషు అంత బాగా రాకపోవడంవల్ల నేనా ఉత్తరాన్ని సరిగా అర్థంచేసుకోలేకపోయాను. ఏ ఇంగ్లీషు తెలిసిన మిత్రుడో వచ్చినప్పుడు చదివించుకోవాలి. అప్పుడు దానికి సమాధానమిస్తాను.

అక్కగారి అత్తగారి దహన సంస్కారాలు చాలా వైభవోపేతంగా జరపబడ్డాయి. నేను మహాలోకపనిలో మునిగి

వున్నాను. వారి ప్రాంతంలో ఇన్‌ఫ్లూయెంజాజ్వరం చాలా ఎక్కువగాఉంది. పాపం! దానివల్ల చాలమంది చనిపోతు న్నారు. మందుల పెట్టె తీసుకుని వెళ్ళాను. నా చేతుల్లో ఇద్దరుమాత్రం చనిపోయారు. బహుశః నే నింకా ఎక్కువ కాలం ఉండేటట్లయితే ఇంకా కొంతమంది నా చేతుల మీద పోయేవారేమో! మందులు, పథ్యం సరిగా లేక ఎంతో మంది దైవసాన్నిధ్యానికి చేరుకుంటున్నారు. నేను కొన్ని మందులు వగైరాలు తీసుకువెళ్ళడంకోసమని వచ్చాను. కాని రేపు ప్రొద్దునకల్లా ప్రస్తుతం వేడిగా ఉన్న నా శరీ రంలో ఏ జ్వరం ఉందో స్పష్టపడిపోతుంది. ఇవాళ్టికి ఆగి ఉంది. రేపుకూడా ఇలాగే ఉంటే ఎల్లుండి వెళతాను.

నీ అన్న.

---

శివపూర్ (హౌరా)
30-3-1921.

సౌభాగ్యవతికి,

బారిసాల్ సమావేశానికి వెళ్ళాలని మహా అను కున్నాను. కాని, నా క్రొత్తపాఠశాల పనిలో మునిగి ఉండడంవల్ల వెళ్ళడానికి తీరిక లేకపోయింది. ఇంతకు ముందు చేస్తున్న అన్నిపనులనుండి విముక్తి పొందాలని ప్రయత్నిస్తున్నాను. ఇప్పటివరకూ ఎన్నో తప్పులూ-దుఃఖాలు - కష్టాలు కలిగిఉంటాయి. వాటి అన్నిటికి ప్రతి ఫలం అనుభవించాల్సిన సమయం వచ్చింది. అంతేకాక ఈ

దీర్ఘ జీవితకాలంలో ఎన్నో ముళ్ళుపడిపోయాయి. వాటి నన్నిటిని తీరికగా కూర్చుని విప్పుకోడానికి ఇప్పుడిక వయస్సు చాలదు. అందుచేత తొందరపాటులో ఉన్నాను.

నీ తండ్రిగారి ఆరోగ్యం ఇప్పుడు కొంచెం బాగుందను కుంటాను. సరోజ ఉత్తరంలో ఆ విషయం వ్రాసింది.

నా గురించి నే నేమైందీ నీకు తెలిపేవాళ్ళు ఎవరో ఒకరుంటారు. అందుచేత ఇంక ఆ విషయంలో నేను నిశ్చింతగా ఉంటాను. ఈ అన్నగారి చిరస్నేహాన్నీ ఆశీ ర్వాదాన్నీ అందుకో. నేను తిరిగి పిచ్చివానిని కావద్దనే నువ్వు ప్రార్థించు.

నీ అన్న.

—...—

శివపూర్ (హౌరా)
27 జూన్ 1961.

సౌభాగ్యవతి లీలా !

ఇవాళ నీ ఉత్తరం అందింది. నీకు జవాబు వ్రాయలేకపోయాను. అందుకు తీరిక లేకపోవడమే కారణం. చెల్లీ! ఇప్పుడు నాకు నిజంగా తీరిక లేదు. కాంగ్రెసు కార్య క్రమాలు సార్థకమైతే నాకేమైనా తీరిక దొరుకుతుంది. నాకీ నాడు రెండు సంవత్సరాల క్రిందటి గాంధీగారి సత్యాగ్రహపు రోజులు గుర్తుకు వస్తున్నాయి.

నే నొక స్వయంసేనకుణ్ణి. నా ప్రక్క మనిషి, మరి ఐదారుగురు 'చచ్చిపోయాను' అంటూ తుపాకీ గుండుదెబ్బ

తిని ఒరిగిపోయారు. అప్పుడు నేను పారిపోలేదు. నాకు గుండూ తగలలేదు. అప్పుడు నాకు తుపాకీగుం డెందుకు తగలలేదా అని నాకు ఆశ్చర్యంవేస్తుంది. ఇవాళ దాని అవసరంకూడా ఉందేమోననిపిస్తోంది...

—అన్న.

---

శివపూర్ (హౌరా)
1 జనవరి 1923.

సౌభాగ్యవతికి,

గయనుంచి తిరిగివచ్చాను. ఆరోగ్యం సరిగా లేక పోవడంవల్ల కాంగ్రెసు పూర్తికాకుండానే వచ్చేశాను. వెళ్ళేముందే ఉత్తరం వ్రాద్దామనుకున్నాను. కాని వ్రాయడం పడలేదు. గయ వెళ్ళినతర్వాత అక్కడనుంచైనా వ్రాద్దామనుకున్నాను. కాని అక్కడనుంచికూడా వ్రాయలేకపోయాను. ఇప్పు డిక తిరిగివచ్చి జవాబిస్తాను. ఇదిగో వ్రాద్దాం, అదిగో వ్రాద్దాం అని అనుకుంటానుగాని వ్రాయడం పడడంలేదు. దీనికి ఒక అర్థం ఉండకపోదనుకుంటాను. కాని ఇది ఎంతమంది తెలుసుకోగల రంటావు? 'మీ అర్థాలు పర్థాలు అనవసరం, మా అమూల్యమైన ఉత్తరానికి సమాధాన మివ్వండి' అని అంటావు.

ఒకప్పుడు నాగురించి అందరూ నేను చాలా దయార్ద్ర హృదయం కలవాడినని అనేవారు. కాని ఇప్పుడో! అందరూ అక్కచెల్లెళ్ళు, అన్నదమ్ములు, బావమరదులు, బంధువులు,

మిత్రులు- అందరూకూడా దయామాత్ర నన్ను విడిచి పోయినదంటున్నారు. దానికీ ఒక అర్థం, విలువ ఉందని నే నంటాను. నా అర్థం, విలువ తను కక్కర్లేదనీ, మొదట్లోని ఆ అర్థంలేని విలువలేని వస్తువే తనకు కావాలనీ అందరూ అంటున్నారు. ఆఖరికి ఇంటావిడకూడా ఆ గొంతులో తన గొంతు కలిపింది. బహుశః అందరి గొంతులకంటె ఆవిడ గొంతుకే గట్టిగా వినిపిస్తోందేమో!

—అన్న.

...

శివపూర్ (హౌరా)
3 మే 1973.

సౌభాగ్యవతికి,

కొన్నాళ్ళక్రితం నే నొక దుర్ఘటనలో చిక్కుకున్నాను. ఎలైన్స్ బ్యాంకు దివాలాతీయడంతో అంతా మునిగిపోయినట్లుంది. ఇల్లూ పూర్తికాలేదు. చెరువుపనీ పూర్తికాలేదు. ఈ సంవత్సరం అన్నీ పూర్తిచేద్దామనుకున్నాను. కాని డబ్బు ఆగిపోవడంతో అన్నీ ఆగిపోయాయి. కాని నాకు చాలా కష్టంకలుగుతున్న విషయమేమంటే నా కారణంగానే ఎంతోమంది తమకున్నదంతా ఈ బ్యాంకులో వేశారు. నేను వారిని మోసంచెయ్యననే నమ్మకంతో. ఇప్పుడింక వాళ్ళకి దమ్మిడీలతో తీర్చెయ్యాలి. ఎన్నో కుటుంబాల బాధ్యత నామీద వచ్చిపడింది. వాళ్ళతో

ఏం చెప్పాలో నాకేమీ తోచడంలేదు. కాని ఒకటిమాత్రం నిశ్చయం. నేను ఊరుకుంటే వాళ్ళయింట్లో పొయ్యిమీద పిల్లి కూడా లేవదు. దేవుడెక్కడనుంచైనా తెచ్చి యిస్తే అది వేరేవిషయం. సాధారణంగా అలా ఇవ్వడు. మనుషులు ఆకలితోనూ, అర్ధాకలితోనూ చావవలసిందే. ఎక్కడికైనా వెళ్ళి రాత్రింబవళ్ళు రెండుమూడు రోజులేమైనా ప్రయత్నిస్తే కనీసం ఐదారువేలరూపాయలైనా కూడగట్టగలనేమో చూడాలనుకుంటున్నాను. దాంతో కొంత సర్దవచ్చు. మరీ దగ్గరవాళ్ళ కుటుంబాలను చూస్తేనే చాలా బాధగా ఉంది.

---నీ అన్న.

శివపూర్ (హౌరా)
17 మే 1023

సౌభాగ్యవతికి,

కొంతకాలంగా యిక్కడ లేను. రెండు మూడు గంటలక్రిందటే బారిసాల్‌నుంచి తిరిగి వచ్చేసరికి నీ పోస్టుకార్డు అందింది, అందుచేతనే యథాసమయంలో జవాబు వ్రాయలేకపోయాను....

హుగ్లీ జైలులో మన కవిమిత్రులు కాజీ నజ్రుల్ ఇస్లాం ఉపవాసంచేసి మరణాసన్నులై ఉన్నారు. ఒంటిగంట బండిలో వెళుతున్నాను. ఇంటపూర్వాల ఇస్తే, ఒకవేళ నేను చెప్పడంవల్ల ఏమైనా నిరాహారదీక్ష విరమించటానికి సమ్మ

తీస్తారేమో చూస్తాను. వారొక ఉత్తమకవి. రవిబాబు తర్వాత వారిని మించిన గొప్పకవి మనదేశంలో ప్రస్తుతం మరొకరులేరు.

—అన్న.

—...—

సామతాబేడ్. పి. ఓ. పానిత్రాస్,
హౌరాజిల్లా. 13 కార్తీకం 1333

సౌభాగ్యవతి లీలా!

నీ ఉత్తరం అందింది. ఇలాగే అప్పుడప్పుడు నీ కుశల సమాచారాలు వ్రాస్తూ ఉండు.

ప్రభాస సన్యాసి నా రెండవ అన్న. బహుశః నీకు తెలిసి ఉండవచ్చు. ఆయన బర్మానుంచి తిరిగి రాగానే గత మంగళవారం జబ్బుపడ్డారు. "తరచు జబ్బుపడడంవల్ల ఈ శరీరం శిథిలమైపోయింది. అందువల్ల దీన్ని వదిలివేయాల్సివుంది" అని మాటమాటకి అంటున్నారు. మర్నాడు స్వయంగా పక్కమీదనుంచి లేచి యిల్లుదాటి బయటకు వచ్చారు. నా ఒడిలో తలపెట్టుకుని ప్రాణత్యాగం చేశారు. చెల్లీ! నేనూ, భార్య, ప్రకాశ్ మాత్రమే ఉన్నాము.

—అన్న.

—...—

## శ్రీ ఉపేంద్రనాథ గంగోపాధ్యాయకు

డి. ఎ. జి. ఆఫీసు,
రంగూన్ 10-1-1913.

ప్రియమైన ఉపేన్,

నీ ఉత్తరం అందింది. నాకున్న కోపమంతా దూరమై పోయింది. రెండురోజులక్రితమే ఫణీంద్రుని ఉత్తరమూ, 'చరిత్రహీన్' అందినవి. నీమీద ఎక్కువకాలంవరకూ కోపంతో వుండలేను. ఇప్పుడు నాకేమీ కోపంలేదు. కానీ, కొద్దిరోజులక్రితంవరకూ కోపంగానే వున్నాను. విచారం కూడా కలిగింది. ఇలాచేస్తుంటారేమిటని అప్పుడప్పుడూ ఆశ్చర్యంతో ఆలోచిస్తూవుంటాను. ఒక్క వుత్తరానికికూడా జవాబురాయకపోయేసరికి నీ మతి తిరిగిపోతుందేమో నను కున్నాను. నాలో ఒక చెడ్డతనముంది. ఎవరు ఏదిచేసినా, ఆలోచించే చేస్తుంటారని నేను అనుకుంటాను. అదే నాకున్న దురలవాటు. ఇష్టంలేకపోయినా ఏదో ఒక అలవాటు కారణంగా మరొకవిధంగా నడుస్తుంటాను. sencitive (సంవేదన) అనేపేరుగల సున్నితమైన పదం ఒకటివున్నది. నాలో అది ఒకమోతాదు ఎక్కువగానేవున్నది. ఇవాళటికి రెండువారాలక్రితం నరేంద్రునికి ఒకవుత్తరం వ్రాశాను. ఇంతవరకు ఆయనదగ్గరనుంచి జవాబులేదు. వాళ్ళు ఎందుకు రాస్తుంటారో, ఒక్కసారిగా ఎందుకు రాయకుండా మానేస్తుం టారో నాకర్థంగావడంలేదు. నీవు 'సమాజపతి'కి 'కాశీనాథ్' యివ్వడం అంతమంచిపనిగాదు. అది 'బోఝు'లాంటిదే!

చిన్నతనంలో అభ్యాసంకోసం ఆ కథ వ్రాశాను. అచ్చు వేయడం అటుంచి దాన్ని యితరులకు చూపించడంకూడా వుచితంకాదు. దాన్ని అచ్చువేసి నా పేరుప్రతిష్ఠల్ని మట్టి పాలుచేయకండా వుండడమే మంచిది. ఒక్క 'బోఝ' ముద్రించారు. అంతేచాలు !

నేను 'యమున' పత్రికవిషయంలో ఆదరణ చూపించని వాణ్ణికాను! యథాశక్తిని సహాయంచేస్తూవుంటాను. కాని, చిన్నకథలు రాయడం నా కిప్పుడు యిష్టంలేదు. మీరే రాయండి. ఎలారాయాలో అదంతా వివరించి చెబుతాను. 'చరిత్రహీన్' ఎప్పుడు పూర్తవుతుందో చెప్పలేను. సగం అయింది. అది పూర్తయ్యాక దాన్ని 'సమాజపతి'కే పంపిస్తానని చెప్పలేను. ఒకవేళ నీవు కలకత్తాలోవున్నట్లయితే, నీకే పంపుతాను. ఈమధ్యలో నీవు 'కాశీనాథ్'ను 'సమాజపతి' ముద్రించకండా వుండేట్లుగా అతనికి వుత్తరం వ్రాయి. దాన్ని ప్రచురించినట్లయితే నేను సిగ్గుతో తలెత్తుకొని తిరగడానికి వీలుండదు. ఒకటి, రెండు కథలువ్రాసి పంపమని నీవు వ్రాశావు. ఒకవేళ రాయగలిగితే – ఎవరికి పంపమంటావు? నీకా? 'ఫణి'కా?

ఈ విషయాన్ని రహస్యంగా నీకే తెలియజేస్తున్నాను. 'గిరీన్' అప్పుడు చాలా చిన్నవాడు. అప్పుడు నేను పరివారంనుంచి బయటకు వచ్చేశాను. ఇన్ని సంవత్సరాలయ్యాక – అతనికి నేను జ్ఞాపకంకూడా వుండను. ఉపేన్! ఒక్కసంగతి వ్రాస్తున్నాను. ఒకనాడు అతనిపుస్తకం ఒక దాన్ని కొనాలనుకున్నాను. నే నాపుస్తకాన్ని కొంటే

అతను బాధపడతాడని నీవు కొనకండాచేశావు. ఆవిష యాన్ని మనసులో వుంచుకునే నేను దాన్ని కొనలేదు. అతనికి ఒకపుస్తకం పంపమనికూడా వుత్తరం వ్రాశాను. కానీ, అతను పంపలేదు. చిన్నతనంనుంచీ అతనిలో అనేక ప్రవృత్తులను పరీక్షగా చూస్తున్నాను. నేను వ్రాస్తున్నాను కాబట్టి, వాళ్ళుకూడా రాయడం మొదలుపెట్టారు. ఆ యింట్లో నేనే మొదటిసారిగా దానిమీద ధ్యానముంచాను. ఆతరువాత వాళ్ళు 'చేవ్రాత మాసపత్రిక'ను నడుపుతున్నారు. ఇంతవరకూ వాళ్ళు ఒక్క పత్రికనుకూడ నాకు చదవడానికి పంపించలేదు. బహుశా నాబోటిమూర్ఖుడు వాళ్ళపుస్తకాల్లోని విషయాలను అర్థంచేసుకోలేడని వాళ్ళు అనుకొనివుంటారు. అందుకోసం విచారింపవలసిన పనిలేదు. ప్రపంచంరీతి యిలాగే వుంటుందేమో! ప్రస్తుతం నాఆరోగ్యం బాగానేవుంది. స్ఫోటకంపోసికూడానయమైంది. ప్రస్తుతం చదవడం ఒకవిధంగా మానేశాను. అసంపూర్తిగా విడిచిపెట్టిన 'మహాశ్వేత' (తైలచిత్రం) మెల్ల మెల్లగాపూర్తి చేస్తున్నాను. నీవు వ్రాస్తున్న పెద్దనవలను కారణాంతరాలవల్లనైనా రాయడం మానుకోవద్దు. వకీలువృత్తి చేస్తున్నప్పటికీ రచనలు మానివేయనవసరంలేదు.

ఈదేశాన్ని వదిలి బహుశా నేను కలకత్తా రావడం సంభవించదేమో? ఇక్కడ నా ఆరోగ్యం సరిగా వుండకపోవచ్చు. ఉండకపోయినా అక్కడికి రావడం మంచిది కాదు. నా 'ఘాంటెన్‌కలం' నీచేతిలో చిరంజీవిగా ఉండుగాక! అది ఎంతో రాసింది. ఇంకా ఎంతో రాయగలదు.

ఈ నాటి కివే సంగతులు. ఒకవేళ 'చంద్రనాథ్' పంపడం జరిగితే, సురేంద్రుడు నిష్పుకుంటే - వీలున్నంత వరకూ సరిచేసి 'ఫణిబాబు'కు పంపుతాను. ఉత్తరానికి జవాబు వ్రాయి.

--- శరత్.

---

14 లోవర్ ఫజున్‌డాంగ్, దౌన్‌స్ట్రీట్,
రంగూన్, 26-4-1913.

శ్రీచరణములకు -

నీఉత్తరంచూసి నేనెంత ఆశ్చర్యపోయానో - అంతకు మించి వందరెట్లు బాధపడిపోయాను. 'నీవు ద్వేషిస్తున్నావు.' అని నిన్ను నేనుఅనగలనా-? నీవు నమ్మగలవా-? మనం కలకత్తాలో కలసివున్న రోజులు యీనాటికీ నామనస్సులో మెదులుతూనే వున్నవి. నేను చాలా విషయాలు మరచిపోవడం నిజమే! కానీ, యీ విషయాన్నిమాత్రం యింత తొందరగా మరచిపోలేను. ఎప్పటికీ మరచిపోలేనేమో! నీవు ఒక్కసారి సుదీర్ఘంగా ఆలోచించిచూసినట్లయితే, అన్నివిషయాలను ఒక్కసారి జ్ఞప్తికి తెచ్చుకున్నావంటే - 'నీవు నన్ను ద్వేషిస్తున్నావు' అనేమాట నా నోటివెంబడి వెలువడదని నీవు తెలుసుకోగలవు. ఉపేన్, నే నీవిషయాన్ని వూహించనైనా వూహించను. నీవు, నావిషయంలో ఏమని ఆలోచించుకున్నప్పటికీ - నీవు నా మంచి కోరేవాడివని, ఆత్మీయుడవని, దగ్గిరిబంధువునవీ, అనుకుంటూ

వున్నాను. మీలో మీకు పోట్లాటలు, తగాదాలు వస్తే రావచ్చు. అందుకని నేను మధ్యలో కలుగజేసుకుంటానా? 'నీవు నన్ను ద్వేషిస్తున్నావ' నే మాటను నేనన్నానని నీవు నమ్ముతున్నావా-? నమ్మే నీవు యిలా ఉత్తరం రాయడానికి సాహసిస్తావా? నేను చెడ్డవాడిని కావచ్చు. అయినా అంత అధముణ్నా-? నేను మనస్ఫూర్తిగా, తెలిసివుండి యిలాంటి విషయాలు వూహించికూడా వుండననేది యివాళ మొట్ట మొదటిసారిగా తెలియజేస్తున్నాను. నాకు చాలా బాధ కలిగించావు. నన్ను నీవు వ్యర్థంగా దుఃఖపెట్టాననే సంగతిని నేను చనిపోయాకైనా తెలుసుకొని విచారపడతావు. నన్ను నీవొక నీచునిక్రింద భావిస్తున్నావు కాబోలు! నీ వుత్తరంచదివాక నా కలాగే అనిపిస్తుంది. బహుశా, నేను నీచుణ్ని, మూర్ఖుణ్ని కానడంవల్లే, నావిషయంలో ... కలకత్తాలో మనం అంతదగ్గరగావున్న రోజులుకూడా మరచిపోయి, యీవిషయాన్ని నీవు నమ్మివుండవచ్చు. లేకుంటే, అలా రాసేవాడివి కాదు. నామీద ఒట్టు! ఉపేన్, యీ వుత్తరం నీకందగానే, నీకు అపోహలన్నీ తొలగిపోయాయని వెంటనే తెలియపరచమని ప్రార్థిస్తున్నాను. నామీద నీకు ద్వేషంవున్నందువల్లనే - ఆపుస్తకాలు అచ్చువేయడానికి తయారయ్యావనని - సురేంద్రకు కొద్దిరోజులక్రితమే వుత్తరం వ్రాశాను. అందుకు కారణమేమంటే, ఆ పుస్తకాలను అచ్చువేయవద్దని 'సమాజపతి'కికూడా వుత్తరం వ్రాశాను. కానీ, అందుకు జవాబు యివ్వకండానే - వాటి ముద్రణను సాగిస్తూనే వున్నారు. ఏది ఏమైనా యిప్పుడు లోగుట్టు

తెలిసిపోయింది. నువ్వుకూడా సమాజపతికి ఆమాటే చెప్పావు. ఇప్పుడింకా ఎక్కువగా ఆతనివిషయం తెలుసుకో గలిగాను. నీవు నామంచి కోరేవాడివని నాకు నమ్మకం లేకుంటే - యీనాడు నే నిలాంటి కథలు వ్రాయగలిగే వాడినికాను. నేను మానవహృదయాన్ని ఎరుగుదును. 'నేను శరత్‌ను నిజంగా ప్రేమిస్తున్నాను' అని నువ్వు సంకోచం లేకుండా భగవంతుని యెదుట చెప్పగలవు.

పోనీ, యీసంగతి వదిలిపెడదాము. కేవలం ఒక్క 'చంద్రనాథ్‌ని' పురస్కరించుకునే యింత హంగామా చేయడం దేనికి-? 'ఫణిపాలుడు' దాన్ని ఎలా ముద్రించ గలడో తెలియకండావున్నది. మీరంతా అన్నివిషయాలు తెలుసుకోకండా నాలుగువేపులా ఆలోచించకండా హఠాత్తుగా ప్రకటనలుచేసి మూర్ఖమైనపనిచేశారు. దాని ఫలితం అనుభవిస్తున్నారు. ఆ తప్పంతా మీదే కానీ, మరెవరిదీ కాదు. 'ఫణిపాలుని'కోసం నువ్వు కొంచం అడు గడుగునా యిబ్బందిలోపడడం కనిపిస్తూనేవుంది.

నే నిప్పుడు చాలా సంకటంలో పడిపోయాను. 'చంద్రనాథ్' నవలను వున్నదున్నట్లుగా ముద్రించడం నా కిష్టంలేదు కానీ, అది కొంతభాగం ముద్రించడం జరిగింది. మిగిలినభాగం సవరించడానికి నాకు పంపలేదు. అది పంపితే తిరిగి దాన్ని తనకు పంపనేమోనని 'సురేన్' భయపడు తున్నట్లున్నాడు. నారచనలను అత నెంతగానో ఆదరిస్తుం టాడు. బహుశా అతను అందుకనే వెనుకా - ముందాడు తున్నట్లుంది.

మరొకసంగతి, ఉపేన్! 'భారతవర్ష్'లో - అచ్చు వేసేందుకు 'చరిత్రహీన్'ను అడుగుతున్నారు. ఆవిషయంలో వారెంత పట్టుబట్టారో చెప్పలేకుండా వున్నాను. అతను నాకు చాలా పాతస్నేహితుడు. అతను అందరితో గర్వంగా తను 'చరిత్రహీన్'ను ప్రచురిస్తానని ఎంతో ఆశగా చెప్పుకుంటున్నాడు. ఈ ఆశతోనే ప్రచురణకోసం వచ్చిన 'జా..' మొదలైనవారి అయిదారు నవలల్నికూడా తిరిగి పంపించాడు. ఇదీ 'భారతవర్ష' సంపాదకుని కథ! ఇప్పుడు 'ద్విజబాబు' మొదలైన 'హరిదాసు, గురుదాసుని-' పుత్రులంతా అతన్ని ముందుగానే దబాయిస్తున్నారు. అటు 'యమున'లో 'చరిత్రహీన్'ను ప్రచురిస్తామని ప్రకటించారు. 'సమాజపతి' కూడా మాటిమాటికీ రిజిష్టరు ఉత్తరాలు వ్రాస్తున్నాడు. నా కేమిచేయాలో అర్థంకాకుండావుంది. ఇప్పుడిప్పుడే 'ప్రమథనాథుని' దగ్గరనుంచి సుదీర్ఘమైన జాబు వచ్చింది. దాన్ని తనకు పంపకుంటే, తను లోకులకు ముఖాన్నిచూపించలేననీ, చివరికి స్నేహితులందర్నీ దూరంచేసుకోవలసి వస్తుందనీ - వ్రాశాడు. ఈపరిస్థితుల్లో నే నేమిచేయాలో కొంచెం ఆలోచించి జాబు వ్రాయి. ఈ వ్యవహారం మొదటినుంచీ నీకు తెలుసుకాబట్టి నీసలహా నా కవసరం.

ఆరోగ్యమేమీ బావుండలేదు. పధ్నెనిమిది రోజులనుంచి జ్వరం వస్తూవుంది. ఒకవేళ అవసరమనుకుంటే 'సురేన్'కు చూపించు. మీరంతా ఒకరొకరితో ఎంతగా పోట్లాడుకుంటారో - అంతగా పోట్లాడుకోండి. కానీ,

నేను ఒకప్పుడు మీాయందరికీ వుపాధ్యాయుణ్ని! శిక్షకుణ్ని! ఎంతకాదన్నా పెద్దవాడినని గౌరవించండి.

సేవకుడు,

— శరత్.

---

14, పజుడాంగ్, డౌన్‌స్ట్రీట్,
రంగూను, 10-5-1913.

(ఫణిబాబూ! యీా ఉత్తరం చదువుకొని ఉపేంద్రునికి పంపు)

ప్రియమైన ఉపేంద్ర్,

ఇవాళ నీవుత్తరంతోపాటు ప్రమదుని వుత్తరంకూడా అందింది. మీాకు నాయందుకలిగిన అపోహ తొలగినందుకు నాకు కలిగిన సంతోషాన్ని వర్ణించడం పిచ్చిపనిగా వుంటుంది. నీహృదయంలో యిప్పుడు ఏవిధమైన క్లేశంగానీ, దుఃఖంగానీ లేదు. అందువల్ల అత్యంత సహజభావంతో, నా కర్తవ్యాన్ని నిర్ధారణ చేయగలిగావు. నన్ను నేను మూర్ఖుణ్నని చెప్పుకున్నది అబద్ధమా—? మీాయందరి ఎదుటా నేనొక పండితుణ్నని అనుకునేంత అహంభావం వుందా, నాకు? ఏవో కొన్నికథలు సృష్టించగలను. అయినా యిందులో పాండిత్యం ఎక్కడుంది? బి. ఎ; యం. ఎ, బి. యల్. మొదలైన డిగ్రీలను గౌరవిస్తానని వ్రాశాను. 'ప్రమథనాథుడు' నాకథలకు తన మిత్రబృందంలో చాలా ఆదరణ లభించినట్లు వ్రాశాడు. ద్విజేంద్రలాల్‌రాయ్ నన్నెందుకు పిల్లేవంతగా ప్రశంసించాడు. 'నారీక్‌మూల్య' అమూల్య

మైనది. ఇటువంటి కథలు రవిబాబుకూడా రాయలేదనీ, యిటువంటి వ్యాసం బెంగాలీభాషలో ఎక్కడా లేదనీ, ద్విజ బాబు వ్రాస్తున్నాడు. నిజానిజాలు భగవంతునికే తెలుసు. 'ఫణీబాబు' పత్రిక చాలా చిన్నది. కానీ, అలాంటి మంచి పత్రిక యింకొకటి లేదు. ఇలాగే కష్టించి ఫణిబాబు తన పత్రికను నడుపుతాడని ఆశిస్తున్నాను. ఇప్పుడు కాక పోయినా, ఎప్పటికైనా 'శ్రీ' వృద్ధితప్పకుండా సిద్ధిస్తుంది. అయినా ప్రయత్నం, పరిశ్రమా అవసరంకదా-? ఇక నా విషయం అంటావా-? నా కతను చిన్నతమ్ముని లాంటివాడు. అతని పత్రికనుంచి మిగిలినదే, యితర పత్రికలకు లభిస్తాయి! కానీ, ప్రస్తుతం నాకువస్తున్న వుత్తరాలసంఖ్య చూస్తుంటే - పదిచేతులున్నా పనిసాగనట్లే కనిపిస్తోంది. 'చరిత్రహీన్' అతనిపత్రికలో అచ్చుకాదని ఎవరన్నారు-? 'ప్రమథ బాబు'కు చదువుకునేందు కిచ్చాను. అతనే ముద్రిస్తానంటూ తిరుగుతూవుంటే - అందుకు నా అంగీకారం కావాలిగదా? కానీ, వా రలా కోరేవారు కాదు. బహుశా నా లిపిచూచి అతను భయపడివుంటాడు. 'సావిత్రి'ని కేవలం అతనొక పరిచారికగానే అర్థంచేసుకున్నట్లున్నాడు. కానీ, అతను కళ్ళు తెరచిచూచి కథ ఎలా ముగుస్తుందో, వూహించి వున్నట్లయితే - ఏ బొగ్గులోంచి ఎలాంటి రత్నాలూ, అమూల్యమైన వజ్రాలూ - వుత్పన్నమవుతాయో- తెలుసు కోగలిగితే యింత సునాయాసంగా దానిని వదిలిపెట్టేవాడు కాడు. చివరకు ఒక అమూల్యరత్నాన్ని పోగొట్టుకున్నానని పశ్చాత్తాపపడితీరుతాడు. ఉపసంహారం 'ఎలాఉంటుందీ'.-

అని నన్నడుగుతున్నాడు. నామీద ఎవరికి నమ్మకం లేదో - ఆ మొట్టమొదటి నవలను, మొదటిపత్రికలో ముద్రించేందుకు వెనుకా - ముందాడుతున్నాడంటే, ఏమీ ఆశ్చర్యపడవలసిన విషయం కాదు. కానీ, వాళ్ళే అంటున్నారు, 'చరిత్రహీన్‌లో చివరిభాగంలో మీరు చదివినంతవరకూ రవిబాబుగారి రచనలను (శైలి, కథాసృష్టి, విశేషణాల్లో...) మించిపోయింది.' కానీ, అంతిమాంశాన్ని నే నెక్కడ పాడు చేస్తానోనని అతని భయం. ఏ మనిషి - అన్నీ తెలిసి వుండే - మెస్‌లోని ఒకదాసీని తీసుకొచ్చి ప్రారంభంలోనే పరిచయం చేసిన - ఆ మనిషి చివరిదాకా తన రచనాపటుత్వాన్ని రక్షించుకోగలుగుతాడని - అతడు నమ్మలేకపోతున్నాడు. అంతమాత్రం తెలుసుకోకపోతే యింత గౌరవం పొందగలిగి వుండేవాణ్నా-? ఇంకొక సంగతి. 'భారతవర్ష'ను నా స్వంత పత్రికలాగే చూసుకొమ్మని ప్రమథబాబు కోరుతున్నాడు. నేనూ అలాగే చూసుకుంటున్నాను కూడా! యథాశక్తిగా సాయం చేస్తాననికూడా రాశాను. కానీ, ఎంతవరకు సాధ్యమవుతుందో మాత్రం చెప్పలేను. ఇంకొక సంగతి: అతడు వెలయిచ్చి రచనలను కొంటాడట! అటువంటప్పుడు అతనికేం తక్కువ వుంటుంది-? కానీ, వెలయిచ్చినంతమాత్రాన అందరి రచనలూ దొరకవు. నా విషయంలో యీ సంగతిని యిప్పటి కతను తెలుసుకునేవుంటాడు. 'చరిత్రహీనులు' నా చేతికి రాగానే 'ఫణి'కి పంపుతాను. నావద్దమాత్రం వుంచుకోను. అయినా 'ప్రమథబాబు' మాత్రం దానిని 'ఫణి'కి యివ్వరు. 'ఫణి'మీద అతనికి కోపం వున్నది. అంతే

కదూ? ఎందుకంటే మాసపత్రికా సంపాదకులు ఒకరినొకరు చూసి సహించరు. అది సహజం! ప్రమథబాబు కేవలం నా బాల్యస్నేహితుడే కాదు. నా ఆత్మీయమైన బంధువు కూడాను. నిజాయితీపరుడు! మంచివాడ. అతనంటే నాకు చాలా ప్రీతివుంది. అందువల్ల అతనిపట్టుదలకు తలవంచవలసి వస్తుందేమో – చెప్పలేను. ఈ విషయాన్ని గురించిన వివరాలు తరువాత తెలుపుతాను.

"మీరంతా 'యమున'ను అభివృద్ధికి తేగలరు" అని వ్రాశావు. 'మీరంతా–' అంటే ఎవరని? నువ్వుకూడా 'యమున' అభివృద్ధి కోరేవాడివే! దానికోసం నిస్వార్థంగా పాటుపడుతున్నావనే విషయం నా చెవిన పడింది. నీమీద చేసిన దుష్ప్రచారాలను కొన్నిటిని నేను నమ్మలేదు. ఏదో కొంత 'కూటనీతి' సాగుతోంది కాబోలు! కానీ, ఎవరిని ఎలా ప్రేమిస్తామో, వారి కలాగే సాయంచేయాలి. 'ఫణి'ని నీవుకూడా ప్రేమిస్తున్నావు కదా. కానీ, 'మీరంతా' అని నీవు వాడిన శబ్దానికి అర్థమేమిటో, నా కర్థంకావడంలేదు. ఈసారి విపులంగా వ్రాయి. 'పథకానిర్దేశ్', 'రామ్‌కీసుమతి'– విషయంలో కథావస్తువే బావుందని నా అభిప్రాయం. అయినా ఈ కథ కొంచెం కఠినమైనది. అంత బాగా అర్థం కానిది. నేనుకూడ అనేకులనుంచి అనేకమైన అభిప్రాయాలను విన్నాను. ఎవరైతే కథరాయగల సమర్థులో – వారు 'రామ్‌కీసుమతి'లాంటి కథలు వ్రాయనమ్చు. కానీ, 'పథకానిర్దేశ్' వ్రాయడంలో కొంచెం కష్టపడవలసి వుంటుందని తెలుసుకుంటారు. బహుశా, అలా రాయలేరు

సమాచారాలు తెలుపలేదు. తెలుపవద్దు. అందుకు నే నేమీ విచారించను. ప్రాధేయపడను. రెండు మూడు నెలల అనంతరం సాక్షాత్కరించకమానవు! అప్పుడే అన్నిసంగతులు తెలుస్తాయి.

ఈనెల 'యమున' అందింది. నీ 'లక్ష్మలాభం' చదివాను. ఈ విషయంలో నా అభిప్రాయాన్ని నమ్మతావో, నమ్మవో గానీ, నీమాటల్లోనే చెబుతాను. 'తండ్రి నోటంట కుమారుని ప్రశంసను విన్నందువల్ల లాభంలేదు.' యిలాంటి మధురమైన కథను నేను చాలాకాలంనుంచి చదవలేదని ఘంటాపదంగా చెప్పగలను. ఇది నీమిగిలిన కథలన్నిటికంటే మంచికథ. అనవసరమైన ఆడంబరంలేదు. ప్రజల్లోని దోషాలను ఎత్తిచూపడమూ ప్రపంచంలోని కష్టాలను చిత్రించడమూ – యిటువంటివేమీ లేవు. కేవలం ఒక అందమైన పూవులా నిర్మలంగావుంది. మధురాతిమధురంగావుంది. దీన్నే నేను కోరుతున్నాను. చదివాక ఆనందాతిరేకంతో కన్నులు చెమ్మగిల్లకపోతే అది కథకాదు. బాగా రాయగలిగావు. ఉపేన్, మనస్ఫూర్తిగా నా అభిప్రాయం ప్రకటిస్తున్నాను. మధ్యమధ్యలో యిలాంటి కథలే చదివేందుకు కావాలి. అవును! నన్ను సంతోషపెట్టడం చాలా కఠినమైన పని! అలాంటివస్తువు దొరికాక నాకు యింకేమీ అవసరంలేదు. నా యీ ప్రశంసవల్ల బహుశా నీకు కొంచం సంకోచం కలగవచ్చు. బహుశా అందరూ నాఅభిప్రాయంతో ఏకీభవించకపోవచ్చు. అయినా నన్నుమించిన మర్మజ్ఞుడు ఒక్క రవిబాబు మినహా యింకెవరూ లేరనే

చెప్పాలి. నేను గర్వంతో అంటున్నానని అనుకోవద్దు! అది నా ఆత్మ నిబ్బరమనుకో, గర్వమనుకో, ఏదైనా- అదే నా నిర్ణయం. అలాంటి కథ నే నీమధ్య చదవలేదు. నీవు వ్రాసిన మరో పెద్దకథ చాలా బావుందట. 'భారతవర్ష్'లో అచ్చుఅయినట్టు విన్నాను. 'భారతవర్ష్' యింకా అందలేదు. ఎలా వ్రాశావో తెలియదు. ఒకవేళ భావం, మాధుర్యం - యీ కథలానే వున్నట్లయితే - అదికూడా గొప్పరచనే అయివుండాలి.

అంతేగాక, నీవు వ్రాసే శైలి చాలా అందమైనది. నీ భాష, పాండిత్యం, భాషమీద నీకున్న అధికారంలాంటి దానిని నేనూ పొందినట్లయితే, బహుశా నా కథలు యింకా బావుండేవేమో-? అవును, నిన్న నాతో పోల్చుకోలేను. ఇందువల్ల బహుశా, నీకు అనుమానం కలగవచ్చు. కానీ, ఆనందం కలిగినప్పుడుమాత్రం నేను దాన్ని అణచిపెట్టి వుండలేను. ప్రస్తుతం ఎలా వున్నావు? నా ఆరోగ్యం బావుండలేదు. ఈ వర్షాకాలం దుఃఖదాయకంగానే వుంటుంది. పది, పన్నెండు రోజులనుంచీ జ్వరంతో బాధ పడి, రెండురోజులనుంచి కొంచెం కులాసాగావుంటున్నాను. నీకు నా ప్రియమైన శుభకాంక్షలు!

—శరత్.

—...—

(7)

## ప్రమథనాథ భట్టాచార్యునకు

డి. ఐ. జి. ఆఫీసు,
రంగూను, 26-3-12,

ప్రమథ్,

నీ ఉత్తరం అందినది. ఇవాళే జవాబుకూడా వ్రాస్తున్నాను. సాధారణంగా ఇలా జరగదు. నా స్వభావం తెలిసినవారియెదుట స్వీయవివరణ ఎక్కువ చెప్పుకోవడం అనవసరం.........

...నాగురించి తెలుసుకోవాలనుకుంటున్నావు! సరే. సంక్షిప్తంగా కొన్ని విషయాలు ఇవి......

1. పట్టణం వెలుపల నదిఒడ్డున ఒక చిన్న యింట్లో ఉన్నాను.

2. ఉద్యోగంచేస్తున్నాను. 90 రూపాయలు జీతం. 10 రూపాయల అలవెన్సు. ఒక చిన్నదుకాణంకూడా ఉంది. తినడానికి వుండడానికి సరిపోతుంది. మూలధనం సున్న.

3. మానసికరోగాలున్నాయి. ఏ క్షణమైనా...

4. చదవడమైతే చాలా జరిగింది. కాని వ్రాసినది మాత్రం పూజ్యం. గత పది సంవత్సరాల్లో శరీరశాస్త్రం, మానసికశాస్త్రం, కొంతచరిత్ర, శాస్త్రాలుకూడాచదివాను.

5. అగ్నిప్రమాదంవల్ల అంతా తగలడిపోయింట; పుస్తకాలయమంతాను. 'చరిత్రహీను'ల పాండులిపకూడా పోయింది. నాలుగైదువందల పేజీల స్త్రీచరిత్ర వ్రాశాను. అదికూడా కాలిపోయింది.

ఈ సంవత్సరం అచ్చువేయిద్దామని అనుకున్నాను. కాని నాద్వారా జరిగేయోగం ఉన్నట్లులేదు. అందుచేతనే అంతా 'స్వాహా' అయిపోయింది. మళ్ళా మొదలుపెడదామన్నా ఉత్సాహం పోయింది. 'చరిత్రహీనులు' 500 పేజీలు వ్రాశాను. పూర్తి కావచ్చింది. అంతా తగలడి పోయింది.........

...నీకు మరొకవిషయం చెప్పవలసిఉంది. మూడు సంవత్సరాల క్రిందట తొలిసారిగా హృద్రోగలక్షణాలు కనపడినప్పుడు చదవడం మానివేసి తైలచిత్రములు రచించడం ప్రారంభించాను. ఈ మూడు సంవత్సరాలలో ఎన్నో చిత్రాలు పూర్తిచేశాను. అవన్నీకూడా భస్మీభూతమై పోయాయి. చిత్రరచనా సామాగ్రిమాత్రం మిగిలింది.

ఇప్పుడు నే నేమిచెయ్యాలో కాస్త చెబితే కొంతకాలం నీ సలహాప్రకారమైనా నడుచుకుంటాను. నవలా రచనా? చరిత్ర రచనా? లేక చిత్రకళా? దేన్ని పునఃప్రారంభించను? కాస్త చెప్పు.

నీ స్నేహితుడు,
శరత్

—*—

రంగూన్,
4-4-1913

ప్రమథ్,

నీ మొదటి ఉత్తరానికి యింతవరకూ జవాబురాయలేదు. నీవు నన్ను ఎల్లప్పుడూ ఎందు కింత యిదిగా ప్రేమి

స్తుంటానోనని ఆలోచిస్తున్నాను. చాలా రోజులనుంచీ, నే నీ విషయాన్ని ఆలోచిస్తున్నాను. ప్రమథ్, అహంకారం చూపిస్తున్నాను. క్షమించగలవా? ఒకవేళ క్షమించగలిగినట్లయితే చెబుతాను. ఒక్క రవిబాబుతప్ప నాతో సమానంగా నవలలూ, కథలూ వ్రాయగలిగినవాళ్ళు ఎవరూలేరు. ఈ మాటను మనస్ఫూర్తిగా, నిజమని నీ మనస్సుకు తోచినప్పుడే-నవలలుగానీ, వ్యాసాలుగానీ, కథలుగానీ పంపించమని అడుగు! లేకపోతే అడగవద్దు.ఇదే నా గొప్ప ప్రార్థన! ఈ విషయంలో మొహమాటపడకూడదు. నాకు కావలసింది సత్యం......



రంగూను,
17-4-1913.

ప్రమథ్,

నీ ఉత్తరం నిన్న అందింది. ఇవాళ జవాబు యిస్తున్నాను. 'చరిత్రహీన్' అయినంతవరకూ, నీకు చదవడానికి పంపుదామని ఆలోచిస్తున్నాను. వచ్చే మెయిల్లో - ఈ వారంలోపలే పంపుతాను - ఇంకేమీ చెప్పలేను. చదివాక తిరిగి పంపు. అందుకు కారణమేమంటే - దీని రచనా, శైలీ నీవంటివాళ్ళకు ఏస్థితిలోకూడా బాగుండేట్లు తోచదు. నీకు నచ్చుతుందో, లేదో - సందేహంగానేవుంది. అందువల్ల దాన్ని ప్రచురించవద్దు. 'సమాజపతి మహాశయుడు' ఎంతో వినయంగా దీన్ని అడుగుతున్నాడు. ఎందుకంటే, అది అతనికి బాగా నచ్చిందట. ఇవన్నీ నా వ్యర్థమైన రచ

నలు! వీటిల్లోని ఉదాత్తమైన భావాలను ఎవరైతే కష్టపడి తెలుసుకుంటారో - వారికే యివి అమూల్యమైనవి! ఎవరికివి మంచివిగా తోస్తాయి? ఎవరికి నచ్చుతాయి? 'భారతవర్ష'లో ప్రచురించడానికి యిది యోగ్యమైనదని నీకుతోస్తే- దాన్ని ప్రచురించేందుకు నీకు అనుమతిస్తాను. అంతేగానీ, ఏదో నా మంచికోరి, నా హితవుకోరి, యీ నా వస్తువును ముద్రిస్తానంటే - అవసరంలేదు. సాహిత్యంలో ప్రత్యక్ష సత్యం కావాలి. ఇందులో మొహమాటం పనికిరాదు. అదీగాక, ద్విజబాబు (ద్విజేంద్రలాల్‌రాయ్) అభిప్రాయం ఎలావుంటుందో - చెప్పలేను. అందులో ఏ అంశమైనా మార్పుచేయడం అవసరమనుకుంటే - అలా మార్చడానికి వీలులేదు. దానిలో ఒక్క వాక్యాన్ని కూడా వదలిపెట్టనీయను. ఒక్క విషయం చెబుతాను. కేవలం శీర్షికను చదివి 'చరిత్రహీను'లైనట్లు భావించవద్దు. నేను నీతిశాస్త్ర విద్యార్థిని! నిజమైన విద్యార్థిని! నీతిశాస్త్రం నాకు తెలుసు. దానిలో యితరులకంటే తీసిపోనని నాకు తెలుసు. ఏది ఏమైనా చదివి మళ్ళీ పంపించు. నిర్భయంగా నీ అభిప్రాయం రాయి. నీ అభిప్రాయానికి విలువవుంది. కాని, అభిప్రాయం యిచ్చే ముందు నా గంభీరమైన వుద్దేశాన్ని జ్ఞాపకం వుంచుకో! ప్రచురణార్హమైన పుస్తకంగా కనిపిస్తే - నాకు వ్రాయి. మిగతా భాగంకూడా రాసి పంపుతాను. నాకు బాగా తెలుసు! కలంపట్టుకొని ఏది తోస్తే, అదే రాసేవాణ్ణి కాను. మొదటినుంచీ చివరిదాకా ఒక వుద్దేశంపెట్టుకొని రాస్తుంటాను. అందువల్ల సన్నివేశాల పరంపరలు మారవు.

వైశాఖ 'యమున' ఎలావుంది? కథాంశం అర్థమైందా? వెంటనే జాబు వ్రాయి.—

—శరత్.

—...—

రంగూన్,
24-5-1913.

ప్రమథ్,

రంగూన్ 'గజట్'లో ద్విజేంద్రలాల్ రాయ్ మరణ వార్త విని, నేను నిశ్చేష్టుణ్ణయిపోయాను. ఆయనను తక్కువగా ఎరిగివున్నానని కాదు. అవును, నీకున్న పరిచయం ఆయనతో నాకు లేకపోవచ్చు. కానీ ఎరిగివున్నంతవరకూ, నాకు బాగానే ఆయన్ని గురించి తెలుసు.

వారి గౌరవాన్ని రక్షించేందుకు నేనేమి చేయవలసి వున్నా–దాన్ని తప్పకండా చేస్తాను. ఆయన సాహిత్యపరుడు. వీరుడు! ఆయనకు నా విలువ తెలుసు. ఒకవేళ తెలుసుకో లేకపోయినా – వారినుంచు నేను సిగ్గుపడవలసినది లేదు. అందుకనే రాసి పంపించాలనుకున్నాను. ఇష్టంవుంటే వాకు ముద్రిస్తారు. లేకుంటే లేదు. ఇందులో లజ్జాభిమానాల ప్రసక్తి లేదు. కానీ, ఆ కాగితాలనుబట్టి నాకు విలువ కడ తారు. 'ముద్రించేందుకు వీలుకానిది' అనికూడా చెప్ప వ్చును. 'చింపి పారేయండి, లేదూ ఫైల్లో పడేయండి' ని చెప్పవచ్చు. అందువల్ల తమ్ముడూ, నన్ను క్షమించు. వు నాకు ఎలాంటి మిత్రుడవో, నాకు తెలుసు. ఈ విష యాన్ని ఒక్కనాడుకూడా మరచిపోలేను. నీవు నన్ను

అపార్థం చేసుకున్నా, నా మీద కోపగించుకున్నప్పటికీ—నా మనస్సులోని భావం అచంచలంగానే వుంటుంది. కానీ, యిది వేరే విషయం. ఇంకొక పత్రికకోసం—నా మర్యాదను పోగొట్టుకోవడం నా కిష్టంలేదు. నేను చిన్నపత్రికలకే వ్రాస్తాను. నా కదే చాలు! నా కక్కడ గౌరవం దొరుకుతుంది. శ్రద్ధాభక్తులు లభిస్తాయి. యింతకుమించిన ఏ వస్తువునూ నే నాశించను. ఇంకొక విషయం! 'చరిత్రహీన్' సంబంధంలో ... వ్రాశారు. 'బాబుకూడా సూచించారు. అది అవినీతితో నిండివున్నదనీ, పత్రికల్లో అచ్చుకావటానికి వీలుకానిదనీ' అన్నారు. బహుశా అలాగే కావచ్చు. నామీద లేనిపోని దోషారోపణచేయడానికి మీరు నా కేమీ శత్రువులు కారుగదా! నేనుకూడా 'మొదట్లో అందరూ యిలానే అనుకుంటారని' అనుకుంటున్నాను. నా పేరుకోసం నేను ప్రాకులాడటంలేదు. నా విషయంలో లోకులు యిష్టం వచ్చినట్లు ఆలోచించుకోవచ్చు. 'పోనీ దాని కేముంది? కాలమే నన్ను విచారణచేస్తుంది. మానవుడు సువిచారం, అవిచారం—రెండూ చేస్తుంటాడు. దీనికోసం చింతించడం పొరపాటు కాగలదు...నేను కేవలం పద్యాలుమాత్రం వ్రాయలేను మిగిలినదంతా వ్రాయగలను. సంపాదకుని ముందు నా రచనలను పరీక్షచేయించుకోలేను. అది నాకు అసాధ్యమైన పని. అవును, ఒక్క రవిబాబు దగ్గర తప్ప

—శరత్.

## ఫణీంద్రనాధ్ పాల్‌కు

డి. ఐ. జి. ఆఫీసు,

రంగూను, జనవరి 1913.

ఫణిబాబూ!

మీరంతా ఎలావున్నారు. ఉత్తరం రాయడం మరచిపోవద్దు. నాకు చేతనైనంతవరకూ చేస్తాను. ఉపేన్ ఎక్కడున్నాడు? భవానీపురం ఎప్పుడొస్తాడు? నాకు 'చంద్రనాథ్'ని ఎప్పుడు పంపుతాడు? నేనేమి చేయాలో మీరే చెప్పండి. చెప్పకుంటే నావల్ల ఎక్కువగా పని జరగదు. ఇక్కడకు వచ్చినప్పటినుంచీ, స్ఫోటకంపోసి, జ్వరపడి వున్నాను. లేకుంటే యీపాటికి ఏదో రాసివుండేవాణ్ని! అయినప్పటికీకూడా ఒకవుత్తరం వ్రాశాను. 'సౌరీన్'ను జ్ఞాపకంచేశానని చెప్పు.

— శరత్.

—*—

రంగూను.

మాఘం, 1923.

ప్రియ ఫణీంద్రబాబూ!

'రాముని బుద్ధిమంతతనం' ఆఖరి అధ్యాయాన్ని పంపుతున్నాను. దాన్నిగురించి కొద్దిగా మీతో మాట్లాడడం అవసరమనికూడా భావిస్తున్నాను. కథ కొంచెం పెద్దదయింది. బహుశా ఒకేపర్యాయం మొత్తం ముద్రించడం కష్టంకావచ్చు. కాని మొత్తం ఒకేసారి వేయగలిగితే

మట్టుకు బాగుంటుంది. కొంచెం చిన్నసైపులో ముద్రించడంవల్ల, నాలుగైదు పేజీలు పెంచితేనే పూర్తి అవుతుందనుకుంటాను. చిన్నకథను సీరియల్‌గా ప్రచురిస్తే బాగుండదేమో ననుకుంటాను. ముఖ్యంగా ఇప్పుడు మీ పత్రిక కొంచెం ప్రచారంకావాలి. చిన్నకథలువ్రాసే అలవాటు ప్రస్తుతం నాకు తప్పిపోయినప్పటికీ ఒకటి రెండు మాసాల అభ్యాసంతో బాగుపడుతుంది. నేను ప్రతినెల పది, పన్నెండు పేజీల చిన్నకథ ఒకటీ, వ్యాసమొకటీ పంపుతాను. ప్రస్తుతం కథకే ఎక్కువ విలువ యివ్వబడుతూంది కనుక కథ తప్పకుండా పంపుతాను.

వచ్చేసారికి కథ చిన్నదిగా వుండటానికి ప్రయత్నిస్తాను. ఇంకో విషయం. తమరు సమాజపతితో స్నేహంగా వుండండి. వారపత్రికలో మీ పత్రికనుగురించి ఏ కొద్ది విమర్శపడినా మేలే. ఈ పర్యాయం 'సాహిత్యం'లో నా పేరుతో చెత్తా - చెదారమంతా అచ్చయింది. ఇదంతా నేను వ్రాసినదేనా? నా కేమాత్రం గుర్తులేదు. ఒకవేళ నేనే వ్రాసినదాన్ని ప్రకటించవలసిన అవసరమేమున్నది? బాల్యంలో ఎంతో వ్రాస్తూంటాము. అదంతా అచ్చెయ్యాల్సిందేనా? తమరు 'భారం'ను ముద్రించి నేను సిగ్గుపడేటట్లుచేశారు. ఆవిధంగానే 'సమాజపతి' కూడా దాన్ని ప్రకటించి నేను సిగ్గుపడేటట్లుచేశారు. మీరు ఉపేన్‌కు ఒకవేళ ఉత్తరం వ్రాసేటట్లయితే నా సమ్మతిలేకుండా ఏదీ ముద్రించవద్దని గట్టిగా చెప్పండి. అవసరమైతే నేను కావలసినన్ని కథలు వ్రాయగలను. మీ పత్రికెంత? చాలా

చిన్నది. అలాంటి రెండు మూడింతల పత్రికనుకూడ నే నొక్కడనే నింపగలను. ఇదేకాక నా కింకొక వీలుకూడా ఉన్నది. కథలేకాకుండా అన్నివిషయాలమీద వ్యాసాలు వ్రాయగలను. తమకు అవసరముండేటట్లయితే వ్రాయండి. ఏవిషయమైనాసరే నేను సిద్ధంగా ఉన్నాను. 'రామునిబుద్ధిమంతతనం' ఒకేసారి పబ్లిష్‌చేస్తారా లేక దఫాలవారీగానా? నాకు తెలియజెయ్యండి. అలాగైతే చైత్రానికి ఇంకేమీ వ్రాయాల్సిన అవసరముండదు.

'చరిత్రహీనులు' ఇంచుమించు పూర్తి అయినట్లే. ఉదయంపూటతప్ప రాత్రిపూట నేను వ్రాయలేకపోతున్నాను. రాత్రిప్పు నేను పడుకొని చదువుకుంటున్నాను.

ఇంకొక విషయం. తమరు 'యమున'లో నవలకాని, కథకాని లేక వ్యాసాలుగాని ప్రచురించే ముందు నాకొక్కసారి చూపిస్తే బాగుంటుంది. చైత్రానికి మీరు ప్రత్యేకించిన విషయాలను ఒక నెల వున్నదనగానే ముందుగా-నాకు పంపినట్లయితే నేను వాటిని సరిచూస్తాను. పుష్యపు 'యమున' ఏమీ బాగుండలేదు. ఆఖరికథ బాగా కుదరలేదు. దీనివల్ల తమకు పోస్టుఖర్చులు తగులవచ్చు. కాని పత్రిక బాగుపడుతుంది. త్రిప్పిపంపే ఖర్చులు నేను పెట్టుకొంటాను. కాని వ్యాసాలు పంపినప్పుడు ముందుగా నేను చూడాలనిపిస్తుంది. నేను కేవలం కథలేకాకుండా అన్ని రకాలైనవి వ్రాయగల్గుదునని ముందే తెలియచేశాను. కాని పద్యాలు మట్టుకు వ్రాయలేను. తమరు సౌరీన్‌బాబు ద్వారా గాని, లేక ఉపేన్, సురేన్, గిరీన్‌లతో చెప్పిగాని

నిరుపమాదేవి పద్యాలు తెప్పించుకోవటానికి ఎందుకు ప్రయత్నించరు? ఆమె అన్న విభూతిని నిరూరుకూడ ఎరుగు దురనుకొంటాను. వారికి వ్రాసినట్లయితే నిరుపమాదేవి నుండి వ్యాసంగాని, పద్యంగాని తప్పకుండా లభిస్తుంది. చాలామందికంటె ఆమె వ్యాసాలు, కవిత్వమూ బాగుంటాయి.

నేను చేయగలిగినంత ఉపకారం తప్పకుండా చేస్తాను. నేను మాట యిచ్చినప్రకారం పనికూడాచేస్తాను. సాహిత్యం పేర అనేక నీచరచనలు చెలామణీ అవుతున్నా, ఈ వైపుకు వాటిగాలి సోకలేదు. ఇదేకాక ఇది నావృత్తికూడా కాదు. నేను ఎప్పటికీ దీనినే వృత్తిగా స్వీకరించదలచుకోలేదు.

నేను దగ్గర్లో వున్నట్లయితే తమకు కొంచెం వీలుగా ఉండేదనుకుంటాను. కాని నేను ఈదేశాన్ని ఏవిధంగానూ విడిచిపెట్టలేను. నేను చాలా ఆనందంగా ఉన్నాను. వ్యర్థంగా కష్టాల్లో ఇరుక్కోదలచలేదు. ఇరుక్కోను కూడాను. నావిషయం ఇంతవరకే.

వచ్చే సంవత్సరానికి తమరు పత్రికను వెలపెంచి పెద్దది చేయగలిగితే చేయండి. ప్రతి సంచికలోనూ చదువదగ్గ రచనలుండాలి. ఈ విషయం స్పష్టంచేయండి. ఇందువల్లే కథలను ఒకే సంచికలో ప్రచురించడం బాగుం టుందని చెబుతున్నాను. కొంచెం నష్టపడ్డప్పటికీ ప్రకటించి నట్లుంటుంది.

ఉపేన్ చాల పర్యాయాలు 'చంద్రనాథ్' పంపు తున్నానని వ్రాశాడేకాని ఇంతవరకూ రాలేదు. బహుశా

అతనికే లభ్యపడకపోవచ్చు. ఒకవేళ తమరు 'చంద్రనాథ్'ని ముద్రించదలచుకొన్నట్లయితే దాన్ని మరల నూతన ఫక్కీలో వ్రాస్తాను. అదెలాంటిదో భవానీపురపు సౌరీన్‌వల్ల విన్నాను. నాకు కొంచెంజ్ఞాపకంకూడా ఉన్నది. కనుక మరల క్రొత్తపోకడలతో వ్రాయడం కష్టమేమీకాదు. ఒకవేళ తమకు ఇలాంటి క్రొత్తరచనలు కావలసివున్నట్లయితే నాకు తెలియజెయ్యండి.

— శరచ్చంద్ర చటోపాధ్యాయ.

---

రంగూను.
12-2-1913.

ప్రియ ఫణిబాబూ!

ఇప్పుడే తమ ఉత్తరం అందింది. మొదటి విషయం 'వంగవాసి'లో అనుబంధరచనలు ప్రారంభించి వ్యర్థఖర్చులు చేయకండి. తమరేమీ గాబరాపడవద్దు. తమ పత్రికలో మంచి విషయాలుండేట్లయితే వెంటనే కాకపోయినా కొంతకాలానికైనా దానంతట అదే తెలుస్తుంది. ఎవ్వరూ ఆపలేరు. తమరేమీ భయపడనక్కరలేదు. అనుబంధరచనలద్వారా డబ్బు నష్టంచేసేకంటే ప్రచారం ద్వారా చందాదారుల్ని చేర్పించుకోవడం మంచిది.

రెండవవిషయం 'రాముని బుద్ధిమంతతనం' చిన్న సైపులో ఒకేపర్యాయం ముద్రించడం బాగుంటుంది. ఈ రకమైన చిన్న కథల్ని సీరియల్‌గా ప్రచురించడం బాగుండదు. ఏమైనా పని జరగకపోయిన దానినిగురించి చప్పం

చడం వృథా. నేను రెండురోజుల లోపలనే ఒక కథ పంపుతున్నాను. తమ జవాబువచ్చిన తర్వాతే పంపుతాను. 'రాముని బుద్ధిమంతతనం' కంటె ఇదే బాగున్నదని నా అభిప్రాయం. కాని దానిలాగే ఇదీ కొంచెం పెద్దదయింది. ఎంత ప్రయత్నించినా చిన్నది కాలేదు. మున్ముందు ప్రయత్నించిచూస్తాను.

మూడవవిషయం. 'చంద్రనాథ్'ని గురించి కొంత గంద్రగోళంలో ఉన్నది. కాబట్టే దానివల్ల లాభమేమీ లేదని చెబుతున్నాను. 'చరిత్రహీనులు' ప్రకటించవచ్చు. కాని దానికి పత్రికను కొంచెం పెంచవలసివుంటుంది. కాని ధర ఎంత ఉంటుందో, ఎప్పటినుండి పెంచుతారో వ్రాయండి. వెల పెంచకుండా పత్రికను పెద్దదిచేసి నష్టపడటం మంచిదికాదు.

నాలుగవ విషయం. సమాజపతితో మనస్పర్థలు పనికిరావని చెప్పాను. వారిని పొగడమని చెప్పలేదు. ఫణిబాబూ! మీ దుకాణంలోని సరుకు సరియైనదైతే నేడు గాకపోయినా నాల్గురోజుల తర్వాతనైనా గ్రాహకులు రానే వస్తారు. చెడ్డవస్తువులను పెట్టుకొని లక్ష ప్రయత్నాలు చేసినా దుకాణం నడవదు. రెండు మూడు రోజుల్లోనో లేక నెలలోకాని దివాలాతీయనేతీస్తుంది.

నా బాల్యంలో వ్రాసిన చెత్తా - చెదారం అంతా ముద్రించి నన్నెంత సిగ్గుపడేటట్లు చేస్తున్నారో, నా కెంత అన్యాయం జరుగుతున్నదో వ్యక్తం చేయలేకుండా వున్నాను. సమాజపతి ఉచితానుచితాలను తెలిసికోగలిగినవాడైయుంటే

కూడా ఈ రకమైనది ఎలా పబ్లిష్‌చేశారో ఆశ్చర్యంగా వున్నది.

ఐదవవిషయం. సారీన్‌బాబుతో మీ స్నేహం ఎలా ఉన్నది? ఆయన 'దీదీ'నిగూర్చి నా విమర్శన చూశారా! బహుశా కోపించి యుండవచ్చు. కాని నా దోషమేమున్నది? వ్రాసినవారే దానికి బాధ్యులు. ఇదేకాక వారు ఈ రచనల్ని చిన్నటైపులో ముద్రించారుకదా!

ఆరవవిషయం. నా క్రొత్తకథ (దానిని రెండుమూడు రోజులలోనే పంపుతాను) ఏ నెలలో పబ్లిష్‌చేస్తారు? చైత్రమాసంలో 'రాముని బుద్ధిమంతతనం' పూర్తిఅవుతుంది. ఇందువల్ల దానిని ఆ నెలలోకాక వైశాఖంలో ప్రచురించండి. ఏ నెలలో వేసినాసరే చిన్నటైపులో అయితే స్థలం తక్కువ పడుతుంది. అయినప్పటికీ కొనేవాళ్ళకు చదవడానికి ఎక్కువ లభ్యమవుతుంది.

ఏడవవిషయం. వైశాఖాన్నుండి పత్రిక సర్వాంగ సుందరంగా వుండాలి. బొమ్మలకు వ్యర్థంగా డబ్బు ఖర్చు చెయ్యకుండా, ఇంకేదైనా విధంగా ఆ డబ్బునే పత్రికకు వినియోగించితే బాగుంటుంది. కొనేవాళ్లు బొమ్మలుండాలంటారో లేదో నాకు తెలియదు. ఒకవేళ ఇదే ఫేషనైతే తప్పకుండా బొమ్మలు ముద్రించాల్సిందే.

తమకు వ్యాసాలుగాని, కథలుగాని ఎంచుటలో నాకు కూడ అవకాశం ఇచ్చేటట్లయితే బాగుంటుంది. నేనుకూడ చూస్తాను. ఏమనుకుంటారో అనిగాని, పేరునుబట్టిగాని పాపూ - బీపూ వేయడం మంచిదికాదు.

ఎనిమిదవవిషయం. శ్రీమతి నిరుపమాదేవి దయతో తన రచనల్ని తమకు పంపేటట్లయితే చాలా మంచిది. ఆమె కవితాశక్తి అపూర్వం. శ్రీమతి అనురూపాదేవి రచనలు పొందడం దుస్సాధ్యం. ఆమె 'భారతి'లో వ్రాస్తారు. తను పత్రికలో వ్రాస్తారో లేదో చెప్పజాలను. వ్రాసినా అంత సుముఖంగా వ్రాస్తారని తోచదు. వీరంతా గొప్ప రచయితలు. వీరికి బహుశా యమునవంటి చిన్న పత్రికలో వ్రాయడమే మనస్కరించకపోవచ్చు. కొంచెం ప్రయత్నించి చూడండి. వారి రచనలు లభించినా మంచిదే. లేకపోయినా మంచిదే. నాకు మూడు పేర్లున్నవి.

విమర్శ, వ్యాసాలు వగైరా - అనిలాదేవి.
కథానికలు - శరశ్చంద్ర చటోపాధ్యాయ.
పెద్దకథలు - అనుపమ.

అన్నివిషయాలూ ఒకేపేరుతో వేసేటట్లయితే వీళ్ళకు ఇతనొక్కడు తప్ప ఇంకెవరూలేరని ప్రజ లనుకొంటారు.

ఇచ్చట నాకొక మిత్రులున్నారు. వారిపేరు ప్రఫుల్ల లాహిడీ బి. ఎ. మంచి తత్వవేత్త. వ్యాసాలు చాలా బాగా వ్రాస్తారు. కాని పేరేమీలేదు. కారణ మేమంటే ఏ మాస పత్రికకూ రచయితకారు. తను 'యమున'లో వ్రాయమని వీరిని బలవంతపెట్టాను. వ్యాసం రాగానే పంపుతాను.

యమున సైజు చిన్నదవడంవల్ల చాలా ఇబ్బందిగా వున్నది. దీనికి ఎక్కువ శ్రమ అక్కర్లేదు. వెలకూడ తక్కువే. అకస్మాత్తుగా వెల పెంచడంవల్ల ఫలితమెలా వుంటుందో చెప్పలేను. ఇది సంభవం కాకపోయినట్లయితే

ఎక్కువ ఖర్చుతో నష్టపడడంకంటె సైజు ధర పెంచవలసిన అవసరం ఋజువుచేసుకొనుటకు కొద్దిరోజుల తర్వాత ఆశ్వయుజమాసంనుండి కొనేవాళ్ళ అభిప్రాయాలు సేకరించండి. తమరు స్వయంగా చాల అశ్రద్ధ మనుష్యులు. ఈ విధంగావుంటే పని జరగదు. మీరు యింకొక పనేదీ చెయ్యకూడదని నిర్ణయించుకొన్నప్పుడు దీన్నే మరికొంచెం శ్రద్ధగా చూడాలి. లౌకికం అనేదాన్నికూడ అవహేళన చెయ్యవద్దు. 'ప్రవాసి'లాంటి ఒకప్పటి చిన్నపత్రికలు ఇప్పుడెంతో అభివృద్ధిచెందాయి. తమరు నన్ను పురుష రచయితల్ని గురించి విమర్శ వ్రాయమని వ్రాశారు. కాని నావద్ద బెంగాలీపుస్తకాలేమీ లేవు. మాసపత్రికలు ఒక్కటి కూడ కొనడంలేదు. విమర్శ వ్రాయడానికి నాకు ఎక్కడ ఏం దొరుకుతుంది? వ్రాసినందువల్ల ప్రజలదృష్టి తప్పకుండా ఇటు మళ్ళుతుంది. ఒకచర్చ ప్రారంభం కావడానికి అవకాశంఉన్నదన్న విషయం నాకు తెలుసు. ఇలా జరిగినా విచారించవలసిన అగత్యమేమీలేదు. ఒకవేళ నా విమర్శలో ఏదైనా తప్పు వున్నదని ఎవరైనా ఋజువుచేయగలిగినట్లయితే (ఋజువు చేయగల్గడం కష్టం) అదీ మంచిదే.

ఈ సందర్భంలోనే ఇంకొక్కవిషయం చెప్పాలి. ఇప్పుడు నేను చదవడం, వ్రాయడం మందగించింది. ఉదయం (Synthotic Philosophy) బెంగాలీలో ఒక పరిశీలన (గుణదోషాల్ని గురించికాదు) వ్యాసం, ఇంకా ఐరోపాలోని హెర్బర్టు మిత్రులు, శత్రువులైన వేదాంతుల రచనలమీద ఒక సీరియల్ వ్యాసావళి - వ్రాద్దామా అనిపిస్తూంటుంది.

మనదేశపు పత్రికల్లో కేవలం ఇక్కడి సాంఖ్య, వేదాంత, ద్వైతాద్వైతాలను గురించికాక ఇంకేవిధమైన విమర్శలూ ఉండవు. ఇందువల్లే మధ్యమధ్యలో నాకిలా అనిపిస్తుంటుంది. ఏంచెయ్యాను చెప్పండి? ఒకవేళ తమపత్రికలో ఇట్టివాటికి స్థానం లేకపోతే (స్థానం ఉండటం అసంభవం) ఈ రకమైన విమర్శలు ప్రచురించే పత్రిక ఇంకేదైనా వున్నదేమో తెలుపగలరా?

తమరు నాకు ఆపకుండా ఉత్తరాలు వ్రాస్తూ వుండండి. వ్రాయకపోతే నాకేమీ బాగా వుండదు. ఇది కూడ ఒకపనే అనుకోండి. రచనలు రిజిష్టర్ పోష్టులోనే పంపుతాను. ఖర్చు తమ రెందుకు భరించాలి? తమ వద్ద నుండి ఖర్చులు తీసుకోవల్సిన దుస్థితిలో లేను. ఇంకెప్పుడూ ఇలా వ్రాయకండి.

తమరు సిరిసంపదలతో తులతూగాలని నేను ఆశీర్వదిస్తున్నాను. అదే నాకు పారితోషికం.

'చంద్రనాథ్' ఇప్పుడిక అడగకండి. ఒకవేళ అవసరమయ్యేటట్లయితే నేనే మళ్ళా వ్రాస్తాను. అది మొదటిదే మెరుగనిపించేటట్లుగా మాత్రం వుండదు.

నా మూడురకాల పేర్లనుగురించి తమ అభిప్రాయమేమిటి? దీనివల్ల పీలుగా వుంటుందని నా ఉద్దేశ్యం. ఒకే పేరుతో ఎన్నో వ్రాయడం బాగుండదు. ఏమంటారు?

ఉపేంద్రు డేమంటాడు? అతడు ఉత్తరంనైరా వ్రాసేటట్లు లేడు. అత డుండటంవల్ల చాల వీలుగా వుండేది. లేకపోయినందువల్ల ఎంతో ఇబ్బంది కలుగుతున్నది. అతనికి

మీరంటే అమిత ఇష్టం. అతనితో పనిచేయించేటట్లయితే ఏ మాత్రం విసుగుచెందడు.

ఏది ఎలాజరిగినాసరే గాబరా పడవద్దు. చింతించవద్దు. నేను తమను విడిచిపెట్టి ఎక్కడికైనా వెళ్తాననిగాని ఏ ప్రలోభంవల్లనైనా పోతాననిగాని ఎప్పుడూ భావించవద్దు...నాదంతా దోషాలతోనే నిండిలేదు.

ఇతర పత్రికలవాళ్ళు నన్ను బలవంతపెడతారని నన్ను హెచ్చరిస్తూ ఇదివరకు తమరు నాకు ఉత్తరాలు వ్రాసేవారు. అలానే జరగనివ్వండి. దానధర్మాలు ఇంటి నుండే ప్రారంభమౌతాయన్నది నిజమేగదా! త్వరగా జవాబివ్వండి. నా ఆశీర్వాదాలు స్వీకరించండి.

శరశ్చంద్ర చటోపాధ్యాయ.

---

చైత్రం 1913

ఫణిబాబూ!

నీవు పంపిన వ్యాసాలు తిరిగి పంపుతున్నాను. రెండు వ్యాసాలూ చెడ్డవిగాలేవు. 'ప్రింట్' చేయవచ్చు. 'కళ్ళ' మీద నీవువ్రాసిన వ్యాసం చాలా బావుంది.

'చంద్రనాథ్' విషయంలో పెద్ద గందరగోళం లేచింది. అది పూర్తిగా నా చేతుల్లోకి రాలేదు. దానికోసం వ్యర్థంగా ప్రయత్నించవద్దు. అయినా కొంతకొంత తిరగ వ్రాసి పంపుతున్నాను. సాహిత్యరచనలను వున్నదున్నట్లుగా ప్రచురించడం నాకిష్టంలేదు. చాలా తప్పులున్నాయి.

వాటిని సవరించి ముద్రించుకుంటే బాగానే వుంటుంది. లేకుంటే ఎప్పటికీ ప్రచురించనవసరంలేదు. 'కాశీనాథ్' విష యంలో నే నెంతో సిగ్గుపడుతున్నాను. నాకు యిష్టమైన మిత్రులద్వారా యిటువంటి కించపాటు సంభవించడం బావుండలేదు. చూస్తే అందరూ నా శ్రేయస్సు కోరేవారే! కానీ, నా అభిప్రాయం పదహారణాలవంతు మారిపోయింది. 'చంద్రనాథ్'ని అట్టే పెట్టేసుకున్నారు. 'చరిత్రహీన్' ను జ్యేష్ఠమాసంలో ప్రచురణ ప్రారంభిస్తారుట! 'చంద్రనాథ్' వైశాఖమాసంలోనే ప్రచురిస్తారుట. (అంతకన్నా గత్యం తరం లేదు. యింకా మిగిలిన భాగాన్ని వీలున్నంతవరకూ నేను సరిచేసి పంపించవలసివుంటుంది. వైశాఖంలో ఎంత ప్రచురిస్తారో చూసుకొని మిగిలినభాగం నాకు చేరినా, చేరకపోయినా కొంచెంకొంచెంగా తిరగ వ్రాస్తాను. వైశాఖంలో 'చంద్రనాథ్ని' ఆరంభించకుంటే – 'చరిత్ర హీన్' ప్రారంభిస్తారు.

చరిత్రహీన్విషయంలో నేను చాలా వుత్తరాలను అందుకుంటున్నాను. కొంతమంది డబ్బుఆశను చూపిస్తు న్నారు. కొంతమంది గౌరవాన్ని ఆశగా చూపిస్తున్నారు. కొంతమంది రెండూ లభిస్తాయని చెబుతున్నారు. కొందరు స్నేహపూర్వకంగా అర్థిస్తున్నారు. నాకు ఏమీ అవసరం లేదు. నీకు శుభం కలిగేరీతిగా చేస్తానని మాట యిచ్చాను. ఆమాటమాత్రం తప్పను.

దయయుంచి ఈక్రింది అడ్రసుకు ఫాల్గుణ, చైత్ర

వైశాఖమాసపత్రికలను పంపించు. 'బి. ప్రమథనాథభట్టాచార్య, 19, యుగల్ కిశోర్ దాస్ లేన్, కలకత్తా;

వీరంతా అంటే గురుదాసుబాబు కొడుకులు తమ కొత్తపత్రికలో నారచనలకోసం విశేషంగా ప్రయత్నంచేస్తున్నారు. అవును, నాకు ప్రమదుడు ప్రియమిత్రుడు. అది నాస్వవిషయం. ఏది ఏమైనా ఫాల్గుణ, చైత్ర 'యమున' వారికి పంపించు. వారు – అతని మిత్రులూ నా'కాశీనాథుని' విషయంలో కొంత రహస్య సమాలోచనలను చేస్తున్నట్లు విన్నాను. ఒక్కసంగతి, 'యమున'పత్రికను వదిలి యిక ఏ పత్రికకూ నియమానుసారంగా వ్రాయను. దీనివల్ల కూడా ఒకపని జరుగుతుంది. నా రచనలను అవహేళనచేసే ధైర్యం అతనికిలేదు. నేను మూర్ఖుణ్ని కాదనే సంగతి 'ప్రమదుని'కి తెలుసు.

'నిరుపమ'ను నీ 'దళం'లోకి లాక్కునేందుకు ప్రయత్నించు! ఆమె చాలా రాస్తుంది. పత్రికల్లో ఆమెకు మంచిపేరుకూడా వుంది. నారచనలకన్నా – ఆమె రచనలు బాగావుంటాయని నా నమ్మిక! ఈమధ్యలో 'మానసి'పత్రిక సంపాదకుడు శ్రీయుత 'షకీరుబాబు' కలసినట్లయితే – అతని వుత్తరం అందిందని చెప్పు. త్వరలోనే జాబు వ్రాస్తాను. నాకు జ్వరంగా వుంటోందనీ, అందుకనే వుత్తరం రాయలేక పోయాననీ, తొందరగా రాస్తాననీ చెప్పు.

మీరు ఒకసంగతిని చెప్పగలరా? ఇంకెంతకాలం 'సాహిత్య'పత్రికలో నాకు శ్రద్ధాభక్తు లుంటాయి? అందరూ బహుశా కాశీనాథ్‌తోనే ఉత్కృష్టమైన నవల

వ్రాయగల ఓప్పు లేకపోయిందని అనుకుంటున్నాను. అందువల్ల నా పేరు పోతుంది. ఉపేన్‌కి బహుశ యీ విషయంలో జాగ్రత్తకూడా లేనట్లుంది. అయినప్పటికీకూడా అతను నా ఆంతరంగిక శ్రేయస్సుకోసం అలా చేశాడు. అందుకు ఏదో ఒకవిధంగా సహించాను. ఇక రెండో వుపాయంలేదు. అయినా అతనివద్ద అటువంటికథలు యింకా వున్నాయా? ఒకవేళ వుంటే చిక్కుల్లోపడి పోతాను. నీతో యింకొకసంగతి చెబుతున్నాను. ఆనాడు 'గిరీన్'ఉత్తరం అందింది. 'చంద్రనాథ్' విషయంలో వారందరితో ఉపేంద్రకు వాగ్వివాదం జరిగింది. వారు నీకు విరుద్ధంగాలేరు. అందువల్ల యీ సంఘటనలవల్ల - కాశీనాథుని 'సాహిత్య'లో ప్రకటించినందువల్ల - వారు 'చంద్రనాథుని' యివ్వడానికి తయారుగాలేరు. వారు నా రచనలంటే పడిచస్తారు. దాన్ని పోగొట్టుకుంటామేమోనని, యితరపత్రికలవాళ్ళచేతుల్లో పడిపోతుందేమోనని, సురేంద్రుడు కొద్దికొద్దిగా 'నకలు'వ్రాసి పంపేందుకు-వప్పుకున్నాడు. ఒకవేళ వైశాఖంలో 'చంద్రనాథ్' ప్రచురణ అయితే - నాకు వుత్తరం ద్వారానో, తంతి ద్వారానో, అవుననో, కాదనో-వ్రాసి పంపు. అప్పుడు నేను 'నరేంద్రుని' యింకొకసారి వినయంగా అడిగిచూస్తాను. అంతకన్నా వేరే వుపాయంలేదు. యిచ్చే తీరాలి. ఒకవేళ ముద్రించకుంటే, మరీమంచిదే! అప్పుడు 'చరిత్రహీన్' ముద్రిస్తారు.

నాకు కథలూ, వ్యాసాలే పంపించు. మిగిలినదంతా

నీవే సరిచూడు. నాకు చూపించకండా కథలు వున్నదున్నట్లుగా ప్రచురించడం మంచిదికాదని నా అభిప్రాయం.

తొందరతొందరగా వుత్తరం వ్రాస్తున్నాను. (పనితొందరలో) అందుకని విషయాలన్నీ లోతుగా ఆలోచించలేకపోతున్నాను. కానీ, వ్రాసిందిమాత్రం సరిగ్గావుందని తెలుసుకుంటున్నాను. 'ద్విజబాబు'ను సంపాదకునిగా ఏర్పరచి అట్టహాసంగా 'హరిబాబు' పత్రికను వెలువరించబోతున్నాడు. మంచిదే! వాళ్ళు డబ్బిస్తారు. అందువల్ల రచనలుకూడా బాగా అందుతాయి. అంతేగాక, గొప్పవారికే సహాయం చేసేందుకు అంతా తయారవుతారు. యిది ప్రపంచపురీతి! దీనికోసం ఆలోచించి విచారించవలసిన అవసరంలేదు.

జ్యేష్ఠమాసానికి పంపవలసిన రచనలు వైశాఖ మొదటివారంలో పంపుతాను. కేవలం 'చంద్రనాథ్' విషయంలోనే విచారంగావుంది. అది ఎలాంటి కథో, ఎలాంటిశైలో – మొదలైనవి తెలుసుకోకండా ముద్రించడం వుచితంకాదు. అదే నాభయం; ఏమైనా యీ విషయంలో మీసూచన అందుతుందని ఆశిస్తున్నాను. ఆరోగ్యం సరిగా లేదు. రాత్రి జ్వరంవచ్చింది. పెద్దవాడిని కదూ? మంచిదే! మీ ఆరోగ్యం ఎలావుంది? జ్వరం తగ్గిపోయింది. మొదలైనవి...

తమస్నేహపాత్రుడు,
— శరత్.

—...—

14 లోవర్ ఫజున్‌డాంగ్, డౌన్ స్ట్రీట్,
రంగూన్, 9-5-1913.

ప్రియమైన ఫణిబాబూ!

నీ ఉత్తరం అందింది. విశేషించి మీరు పంపిన 'ప్రవాసి', 'మానసి', "భారతి", "సాహిత్య" మొదలైన పత్రికలందినవి. వీలున్నంతవరకూ "చంద్రనాథ్"ని మార్పు చేశాను. భవిష్యత్తులోకూడా అలాగే చేస్తాననుకుంటు న్నాను. కథలలోకెల్లా "చంద్రనాథ్" చాలా మధురమైన కథ. కానీ, మధురం జాస్తిగానే వుంది. చిన్నతనంలో యిటువంటిరచనలు స్వాభావికంగా వ్రాస్తూవుంటాము కాబట్టి, అలా తయారవుతూవుంటయ్. ఏమైనా యిప్పుడు చేతికి అందిందికాబట్టి దీనిని మంచినవలగా తయారు చేయడం వుచితం. దానినల్ల ఎంతలేదన్నా – అది రెండింత లుగా పెరిగేటట్టు ఉన్నది. ప్రతినెలా యిరవై పుటలను దానికి ప్రత్యేకించినట్లయితే – మూడుమాసాలలో అది పూర్తికానడం, సందేహంగానే వుంది. ఈ కథలలోని విశేషమేమిటంటే, ఏవిధమైన అవినీతితోనూ యీకథలకు సంబంధంలేదు. అందరూ చదవవచ్చు. "చరిత్రహీన్" నవల కథాసృష్టి చాలా బాగావుంటుంది. కానీ, ఆ కథలాంటిది కాదిది! "చరిత్రహీన్"కోసం ప్రమదనాథుడు పోట్లాడుతూనే వున్నాడు. ఈ పోట్లాటతో చివరకు మా చిన్ననాటిస్నేహానికి ఎక్కడ దెబ్బ తగులుతుందోనని భయంగావుంది. ఆభయం తోనే "చరిత్రహీన్"ను చదవడానికి అతనికి పంపించాను. కానీ, అతనిమనస్సులోని వుద్దేశమేమిటో తెలియదు.

అయినా, నా వుద్దేశ్యం నేను స్పష్టంగా వ్రాసేవున్నాను. దానికి యింతవరకూ జవాబురాలేదు. నేను వయస్సుమీరిన వాడిని. ఈ వయస్సులో ఏదిచేసినా, నేను వృథాగా మాత్రం చేయను. మీరు నా విషయంలో వ్యర్థంగా ఎందుకు బాధపడతారు? "యమున" బాగోగులగురించే నేను ఎక్కువగా ఆలోచిస్తున్నాను. ఆతరువాతనే ఏదైనా. "చరిత్రహీనులు" సగంమాత్రమే రాసివుంది. ఏమవుతుందో అదికూడా తెలియదు. ఎప్పుడు పూర్తవుతుందో కూడా చెప్పలేను. ఈ సంవత్సరంలోనే "చంద్రనాథ్‌ని" బాగా తయారుచేసి యిందులోనే ప్రచురించాలి. ఈ ప్రయత్నమే అన్నిటికన్నా ముఖ్యమైనది. ఆతరువాత వచ్చే సంవత్సరం "యమున" ఆకారంకూడా పెద్దదిగా చేయాలి. ఈసంవత్సరం చందాదారు లెంతమంది వున్నారు? గత సంవత్సరంకంటె ఎక్కువా? తక్కువా? ఒకవేళ నేను యితరపత్రికలకు వ్రాసి గొప్పపేరు సంపాదించుకున్నప్పటికీ – అది "యమున"కు వుపకారమే జరుగుతుందిగానీ, అపకారంమాత్రం జరుగదు. కానీ, జబ్బువలన రాయలేక పోతున్నాను. ఇక రాయలేనుకూడా! తొందరపడినందు వల్ల లాభంలేదు. ఫణిబాబూ! శాంత స్వభావంతో, భవిష్యత్తుపై విశ్వాసంతో ముందుకు నడవాలి. నేను నీపని లోనే నిమగ్నమైవుంటాను. కానీ, నా శక్తి చాలా తక్కువై పోయింది. పరిశ్రమ చేయలేకండా వున్నాను. ప్రస్తుతం ఒక విమర్శన వ్రాస్తూవున్నాను. రెండు మూడు రోజుల్లో పూర్తవుతుంది. ఋతేంద్రఠాకూరుకు విరుద్ధంగా (కొంచెం

కటువుగా తయారుకావచ్చు) రాయడం జరుగుతూంది. ఫాల్గుణమాసపత్రికలో ఆయన "ఖోంద్" జాతి సంబంధంలో ఆయన ఒకవ్యాసం వ్రాశాడు. అది మొదటినుంచీ చివరవరకూ తప్పులతడికెగా వుంది. పురాతత్త్వవిషయాల్లో (పేరు సంపాయించేందుకు) అసందర్భంగా వ్రాయకూడదని చెప్పడమే నా వ్యాసం ముఖ్యోద్దేశం. "యమున"కు ఖుతేంద్రతాకూరుకు వున్న లావాదేవిలు నాకు తెలియవు. ఉచితమనుకుంటే అచ్చువేయి. లేకుంటే "సాహిత్య"కు యివ్వు. "నిరుపమాదేవి" రచనలు ఏమైనా అందాయా? లేదా? నారచనలకంటె ముందు ఆమెరచనలను సంపాదించడం మంచిది. అవును, ఒకవేళ నేను లేనప్పుడు నా భారం సౌరీన్‌బాబు తీసుకున్నట్లయితే - మంచిదే అవుతుంది. బహుశా నిరుపమకూడా చాలాభాగం నిర్వహించగలదు. సురేన్, గిరీన్, ఉపేన్‌లుకూడా రాయగలరు. కానీ, వారంతా వ్యాసాలు రాయగలరో, లేదో నాకు తెలియదు. వ్యాసం రాయాలంటే మనిషి కొంచెం చదువుకొని వుండాలి. ఎందుకంటే దీనిలో మనస్సుకు బలం దొరకుతుంది. కథలూ మొదలైనవి వాళ్ళు రాసేట్లయితే, నేను కేవలం వ్యాసాల్లోనే మునిగిపోతాను. కథలను అంతగా రాయలేకపోతున్నాను కూడా. రాయడం అంత మంచిది కాదనిపిస్తుంది. పెద్దవాడినైపోయాను. ఇప్పుడు కొంచెం విమర్శనాత్మకమైన రచనలు చేయడం అలవాటవుతోంది. కథను బలవంతంగా రాయవలసివస్తోంది. బలవంతంచే చేసేపని అంతగా రాణించదు. ప్రమదుని ఆఖరి

వుత్తరం దీనితోపాటు పంపుతాను. నా పేరు "అనిలాదేవి" అని ఎవరికీ తెలియకూడదు. ఆ పేరు నాదేనని ప్రమథుడు డి. యల్. రామ్‌తో చెప్పాడు. అతనికి కఠినంగా వుత్తరం వ్రాయి. నీపత్రికను, నా పత్రికలానే భావించుకుంటాను. దానికి బాధ కలుగచేసేపనిని దేన్నీ చేయను. కేవలం ప్రమ థునివిషయంలోనే నాకు కొంచెం బాధగావుంది. అతడు పరిచయస్థుడేకాదు, స్నేహితుడుకూడా. పైగా నాకు పరమ బంధువు. అందువల్ల కొంచెం ఆలోచిస్తున్నాను. లేకుంటే యింకేముంది? ప్రమథునివుత్తరంద్వారా నువ్వు చాలా సంగతులు తెలుసుకుంటావు. ప్రస్తుతం నాకు నూటరెండు న్నర డిగ్రీల జ్వరంవుంది. రంగూన్‌లో వున్నందువల్లనే కాదు. అనేక కారణాలవల్ల నాకు జ్వరంవస్తోంది. బహుశా హృద్రోగానికి సంబంధించినది కావచ్చు. ఈదేశంలో సాధారణంగా ఆరోగ్యం బాగానే వుంటుంది. కానీ, ఈ వాతావరణం నాకు సరిపడడంలేదు. మొదలైన...

మీ,

--- శరత్.

---

28-3-1913.

ప్రియ ఫణిబాబూ!

ఇప్పుడిప్పుడే మీ రిజిష్టరుపార్సెలు అందినది. ఒక వేళ రిజిష్టరు చేసినప్పుడు యింటిఅడ్రసుకు ఎందుకు పంపుతావు? ఆఫీసుఅడ్రసుకు పంపడం మంచిదికదా? ఎందు

కంటే, టపావాడు యింటికి వెళ్ళినప్పుడు, నేను ఆఫీసులో వుంటాను. ఒకవేళ రిజిష్టరుచేయకుండా పంపితే - యింటి అడ్రసుకే పంపుతూవుండు. వ్యాసాలను తొందరగానే చూసి పంపుతాను. వైశాఖమాసపుసంచికలో చాలా హడావిడిగా తయారయ్యేట్టువుంది. ఏమైనా సరే, యీ నెల సంచికను యీ విధంగా ప్రచురించండి. (1) పథనిర్దేశ్, (2) నారీర్ మూల్య, యిక మిగిలినవి వ్యాసాలన్నీ. 'చంద్రనాథ్' మాత్రం ప్రచురించకండి. ఎందుకంటే అది ప్రచురణార్హంగా తయారయినప్పుడు, క్రమక్రమంగా దాన్ని ప్రచురించవచ్చును. జ్యేష్టమాసంనుండి 'చరిత్రహీన్'ను గానీ, 'చంద్రనాథ్'ని గానీ, ప్రారంభించి క్రమక్రమంగా ప్రచురిద్దాం. సురేన్, గిరీన్‌లకు ఏమని జవాబుచెబుతానో చూస్తాను వైశాఖమాసపుసంచిక అంత అందంగా తయారయ్యేట్టుగా కనిపించడంలేదు. అవును! మీరే నన్ను మొదట అడిగారు. అందులో సందేహంలేదు. నేను బ్రతికివున్నంత వరకూ మీరు ఎక్కువగా కష్టపడనక్కరలేదు. కానీ నా ఆరోగ్యం బావుండలేదు. అంతేకాక కథలు వ్రాద్దామనే బుద్ధిపుట్టడంలేదు. అయినప్పటికీ రాస్తుంటాను. మీ కోసమే రాస్తాను. నిజంగా యీమధ్య కథలువ్రాసి పంపమని చాలామందిదగ్గరనుంచి వుత్తరాలు వస్తున్నాయి. కానీ, నేను నిరుపాయుణ్ణైపోయాను. అన్నికథలు వ్రాసేందుకు కూచుంటే, నా చదువుకూ, నా స్వంతరచనలకూ అంతరాయం ఏర్పడుతోంది. నేను రోజుకు రెండుగంటలకంటే ఎక్కువగా రాయలేను. పది పన్నెండు గంటలు

చదువుకుంటాను. ఇది నా అలవాటు. ఏది ఏమైనా యీ వైశాఖ సంచిక బయటకు వస్తుంది. ఆతర్వాత నెల విషయం తర్వాత చూసుకోవచ్చును. ముందు నీ చందాదారుల అభిరుచులేమిటో, కనుక్కొని ఆవిధంగా పని చేయవలసి వుంటుంది. మీ అమ్మగారు నా క్షేమసమాచారాలు అడగడం నా అదృష్టమనుకుంటాను. నేను బాగానే వున్నానని ఆమెతో చెప్పు. అంతా కులాసాగా వున్నారని నేనాశిస్తాను. వైశాఖమాససంచిక అంత బావుండకపోతే - పత్రికలో ప్రతిమాసం నాకథ వుంటుందని ప్రకటనచేయి! నా అడ్రసు ఎందుకు అందరికీ చెబుతుంటావ్? నాకు చాలామంది గొప్పగొప్ప పత్రికలకు వ్రాయమని సలహా లిస్తున్నారు. పెద్దపత్రికలకువ్రాస్తే పేరువస్తుందట. నీపత్రిక చిన్నది. ఎంత మంది చదువుతారు? అవును! నేను దీన్ని వప్పుకుంటాను. లాభనష్టాలు ఆలోచించినట్లయితే వారిమాటే నిజం. సాధారణంగా అందరూ అలాగే చేస్తుంటారు. కానీ, నాలో కొంత ఆత్మసంభ్రమంకూడా వున్నది. కొంత ఆత్మ నిబ్బరంకూడా వున్నది! అందువల్ల అందరికీ లాభమని తోచిన మార్గమే, నాకూ లాభమని అనుకున్నాను. అదే నాకు ఏకమాత్ర అవలంబనకాదు. ఒకవేళ నేను ప్రయత్నించి చిన్న పత్రికలను పెద్దవిగా చేసినట్లయితే, దానిలోనే లాభముంటుందనుకుంటాను. అంతేగాక, నీకు చాలాధైర్యం చెప్పివున్నాను. ఇప్పుడు నీచునిలా దాన్ని నుహోకరకంగా చేయను. నాలో అనేకదోషాలు వుండడం నిజమే! అయినా, నేను పదహారణాలా దోషాలతో నిండివుండలేదు. అన్న

మాటమీద నిలబడడానికే ప్రయత్నిస్తాను. మీరుమాత్రం విచారపడవద్దు. నా యీ ఉత్తరం ఎవరికీ చూపించవద్దు. ఒకవేళ వైశాఖంలో నీ చందాదారులసంఖ్య తక్కువ అవకుండా, ఎక్కువఅయితే - యిక ముందుకూడా యింకా ఎక్కువ అవుతారనే ఆశిస్తాను. 'పథనిర్దేశ్'ను పూర్తిగా ఒక సంచికలోనే ప్రచురించు. 'సీరియల్'గా ప్రచురించవద్దు. ఇంకొక సంగతి. స్త్రీలనుగురించి వ్రాసిన వ్యాసాలలో అచ్చుతప్పులు చాలా దొర్లాయ్. ఒకచోట 'అనురూప'కు బదులుగా 'ఆమోదిని' అనే పేరు ముద్రితమైంది. 'భూమకే సంఘ్, భూమికా' - మొదలైనవి 'అనురూపా'వి కానీ, ఆమోదినివి కావు. 'నిరుపమ'ను సంతోషపరిచి ఆమె రచనలను ఎక్కువగా సంపాయించడానికి ప్రయత్నించు. ఆమె బాగా రాస్తుంది. ఆమె నా చిన్నచెల్లెల్లాంటిది. ఆమె నా శిష్యురాలుకూడా!

—శరత్.



ఏప్రియల్, 1931.

ప్రియ ఫణిబాబూ!

నీవు నాకొక పని చేసిపెట్టవలసింది. ప్రస్తుతం నడుస్తున్న మాసపత్రికలవిషయమై ఒకవిధంగా నాకేమీ తెలియదు. అందువల్ల విమర్శనలు రాయలేకపోతున్నాను. నేనంత ఘటికుడనైన విమర్శకుణ్ణికాను. అందువల్ల యీవేపు కొంచెం ప్రయత్నిస్తాను. 'యమున'కోసం రాస్తాను.

అందువల్ల రెండుమూడు మాసపత్రికలను వి. పి. ద్వారా పంపించేందుకు ప్రయత్నించు. నేను విడిపించుకుంటాను. 'ప్రవాసి', 'సాహిత్య' 'మానసి', 'భారతి'-పత్రికలను పంపవలసింది. రచనలు పంపి, పత్రికలను వుచితంగా తీసుకోవడం నాకిష్టంలేదు. అయినా అన్ని రచనలను ఎక్కడనుండి తేగలను ? అవును, ఒకటి రెండు పత్రికలను నాకు వూరికినే పంపిస్తూవున్నారు. అలా పంపించవలసిన అవసరంకూడా లేదు. వాళ్లు అలా వూరికే పత్రికలు పంపడం - దానికి బదులుగా వారికి నేనేమీ యివ్వలేకపోవడం చూస్తుంటే సిగ్గుగావుంది. నోరువిప్పి దీన్ని సూచించడానికికూడా సిగ్గుపడుతున్నాను. ఈ విషయాలన్నీ ఆలోచించే, నీకు వ్రాస్తున్నాను. నా అడ్రసు, 24 లోవర్ ఫజున్‌డాంగ్ స్ట్రీట్; అయితే మా క్లబ్బుకుకూడా పత్రికలు వస్తాయి. కానీ, వాటిని సంపాయించడం కష్టంగా వుంటుంది. మిమ్మల్ని మధ్యమధ్యలో యిలా కోరుతూ, కష్టపెడుతున్నాను. నా స్వభావమే అంత. మరొకవిధంగా అనుకోవద్దు. వయస్సులో నువ్వు నా కంటే, చిన్నవాడివి. నిన్ను నా చిన్నతమ్ముడనుకుంటాను. అందుకే నీచేత చాకిరీ చేయించుకుంటున్నాను. మరుటపాలో ఉత్తరమూ, రచనలనూ పంపుతాను.

—శరత్.

—o—

14. లోయర్ ఫజున్ డాంగ్ స్ట్రీట్,
రంగూన్, వైశాఖము 1320 (1921)

ప్రియ ఫణిబాబూ!

గత పోష్టుద్వారా 'చంద్రనాథ్' కొంతభాగం పంపాను. ఈసారి టపాలో యింకొంత పంపుతాను. చాలా బాధగా వుంది. జ్యేష్టమాసపు 'యమున' సంచిక కోసం విశేషంగా యాతనపడుతున్నాను. తలనొప్పి జాస్తిగావుంది. ఏపనీ చేయలేకపోతున్నాను. అక్షరాలను చూసేందుకుకూడా కష్టంగా వుంటోంది. గ్రంథపఠనం, పనిపాటలు, అన్నీ ఆపివేశాను. సౌరీన్ బాబుకు నా ఆఖరి స్నేహాశ్శీసులు చెప్పు. ఈ నెల ఎలాగో నెట్టివేయండి. నాకు ఆరోగ్యం చిక్కిందంటే – ఆషాఢమాసాన్ని గురించి విచారించవలసిన పనిలేదు. నేను సౌరీన్‌కు వుత్తరం వ్రాయలేకపోయాను. అతను నాకు వ్రాసినదాన్ని చదువుకొని నిజంగా సంతోషించాను. నన్ను అక్కడికి రమ్మని రాశాడు. చూస్తాను. ఎవరికి అలాంటి మిత్రులుంటారో–అతను నిజంగా అదృష్టవంతుడే! 'చరిత్రహీన్' సగంమాత్రమే పూర్తి అయింది. దాన్ని చదవడానికి ప్రమదునికి పంపాను. మాటి మాటికీ అతను వుత్తరాలు వ్రాస్తుండడం మూలాన దాన్ని కాదనలేకపోయాను. దాన్ని తిరిగిపంపించాక, మిగిలిన భాగం రాస్తాను. కథ ఈ నెల రాయలేను. ఎందుకంటే వ్యవధిలేదు. ఒక విమర్శ రాద్దామని కూచ్చున్నాను. కానీ, పూర్తి చేయలేకపోయాను. పూర్తి అయినట్లయితే, నీకు యిరవై ఆరో తారీఖున దాన్ని పంపుతాను. అందువల్ల

అది నీకు ఈ నెలకు అందదు. అందుకు చాలా విచారంగా వుంది. ఎంత ప్రయత్నంచేసినా రాయలేకపోయాను. ఎవరైనా రాసేవాళ్లు వున్నట్లయితే - చెప్పేవాడినే. అలాంటి వాళ్లు ఎవరూ దొరకడం లేదు. వైశాఖమాసపు 'యమున' బాగావుంది. సౌరీన్ కథ, వ్యాసమూ రెండూ బావున్నాయి.

— శరత్.

—o—

రంగూన్,

**14-9-1913.**

ప్రియవరా!

మీ అమ్మగారు నా విషయంలో అడుగుతున్నారంటే, అది నా అదృష్టమే! నేను చాలా ఆరోగ్యంగా వున్నట్లు - వారితో చెప్పు. నా విషయంలో నన్ను గురించి కనుక్కొనేవాళ్ళు ప్రపంచంలో ఎవరూలేరు. అందువల్ల ఎవరైనా నా విషయంలో మంచి, చెడలు తెలుసుకొనే వ్వుడు విని - నా హృదయం కృతజ్ఞతతో నిండిపోతుంది. నాబోటి హతభాగ్యుడు ప్రపంచంలో చాలా తక్కువగా వుంటారు...ఉపకారం చేస్తున్నాను....యశం, గౌరవం, శీలం, స్వార్థత్యాగం చేస్తున్నాను... యిత్యాది పెద్దపెద్ద భావాలు నా హృదయంలోకి ఎప్పుడూ రావు. ఒకప్పుడు లేవుకూడా! ఈనాడుకూడా లేవు. ఇది అంత పెద్దవిషయం కూడాకాదు. ఒక వేళ కీర్తే కావాలనుకున్నట్లయితే, దాని కోసం బహుశా ముందుగానే ప్రయత్నించివుండేవాణ్ని.

ఇంతకాలం మెదలకుండా వుండేవాణ్ని కాదు....ఇంకొక్క సంగతి. 'శతద్వారీచండీ' పాఠకునిగా తయారుకావడం నాకు సిగ్గుగా వుంటుంది. ఒక పత్రికలో నియమితంగా వ్రాస్తున్నాను. అదేచాలు! ఎవరికి నా రచనలు శావుంటాయో, వారే వాటిని చదువుతారని నా అభిప్రాయం. అంతేగాక, హోమియోమాత్రల్లాగా యిందులోకొంత, అందులోకొంత, అశ్రద్ధతోకొంత అటూ, ఇటూతీసి, కొంత తర్జుమాచేసి - కొంత యితరులనుండి దొంగిలిస్తూ ... యిలాంటి క్షుద్రమైన పనులు నాకు చిన్నప్పటినుండీలేవు. అంత విస్తారంగా రాయడానికి మొదలుపెడితే గ్రంథపఠనం కుంటుపడుతుంది. నేను చచ్చిపోయేవరకూ గ్రంథపఠనాన్ని వదలలేను. నేను చిన్నకథలు వ్రాద్దామనుకుంటే - అది ఎలాగో పెద్దదై పోతూవుంటుంది. అదే చాలా కష్టమైన విషయం. ఇంకొక సంగతి. నేను ఏదో ఉద్దేశంపెట్టుకొని కథలు వ్రాస్తూ వుంటాను. దాన్ని స్పష్టపరచందే, వదిలి పెట్టను. 'బిందోకా లల్లా' మీకు నచ్చదనుకుంటాను. బహుశా ముద్రించడానికి వెనకా ముందాడుతారనుకుంటాను. అందువల్ల మొహమాటాన్నిబట్టి నీకు యిష్టంలేకపోయినా-దాన్ని ఎక్కడ ప్రచురించి వూరుకుంటారోనని నేను మొదటినుంచీ నిన్ను హెచ్చరిస్తూనేవున్నాను. అంటే, విశ్వాసం వుండాలన్నమాట. ఒకవేళ నీకు నచ్చివుంటే, ప్రచురించడం మంచిపనే అవుతుంది. దీనివల్ల ప్యాకులేమైనా అనుకోనియ్, 'నారీర్ మూల్యా'ను, ఈమారు పూర్తిచేసి యింకొక దాన్ని మొదలుపెడతాను. 'నారీర్ మూల్యా'కు మంచి

విఖ్యాతి వచ్చింది. నేను అటువంటివే, పధ్నాలుగు 'మూల్యాలు' రాద్దామని నిర్ణయించుకున్నాను. ఈమారు 'ప్రేమకా మూల్య', 'భగవాన్‌కా మూల్య' రాస్తాను. ఆ తరువాత క్రమక్రమంగా 'ధర్మకామూల్య', 'సమాజకా మూల్య', 'సత్యకామూల్య', 'వేదాంతకా మూల్య' రాస్తాను. 'చరిత్రహీ-న్' పధ్నాలుగు, పదిహేను అధ్యాయాలు వ్రాశాను. మిగిలినదాన్ని చిత్తుగా వ్రాసి వున్నాను. దాన్ని సాఫు వ్రాయవలసివుంది. దీని ఆఖరి కొన్నిఅధ్యాయాలు యదార్థంగా 'గ్రాండ్'గా రాద్దామనుకుంటున్నాను. ప్రజలు ఏమైనా అననీ! చివరకు వారే తమ అభిప్రాయాన్ని మార్చుకుంటారు. నేను బడాయిలు చెప్పకోను. నా సత్తా నాకు తెలుసు.నిజంగా చివరిభాగంమాత్రం చాలా బావుంటుంది. నైతికంగానీ, అనైతికంగానీ, ఎవరు ఏది అనుకున్నా - యిదికూడా ఒక రచనే అనుకునేట్లుగా చేస్తాను. ఇందులో నీకు అపకీర్తి వస్తుందనే భయమెందుకు? అపకీర్తివస్తే నాకే వస్తుంది. అంతేకానీ, నేను 'గీత'కు 'టీకా' వ్రాస్తున్నానని ఎవరంటారు ? దీనిపేరు 'చరిత్రహీన్' - పాఠకులకు మొదటనే దాన్ని సూచించాను. ఇది 'సునీతి సంచారిణి' సభలకోసం కాదు. స్కూళ్ళ పాఠ్య పుస్తకాలకోసంకూడా కాదు. ఒకవేళ వారు టాల్‌స్టాయ్ రిజరెక్షన్ చదివితే 'చరిత్రహీన్' విషయంలో ఏమీ చెప్పలేరు. అంతేగాక కళలోనూ, మనోవైజ్ఞానికదృష్ట్యా మహత్తరమైన పుస్తకంలోకూడా దుశ్చరిత్ర అవతరించేవుంటుంది. అయితే 'కృష్ణకాంతుని వీలునామా'లో లేదా? అంతా

డబ్బేకాదు. దేశసేవకూడా చేసే అవసరంకూడా వుంది. అయిదారుగురికి చదువుచెప్పి అక్షరాస్యులుగా చేయగలిగినట్లయితే, ప్రపంచంలో జరిగే అత్యాచారాలకు విరుద్ధంగా ఖండనచేయగలిగినట్లయితే, అంతకన్నా ఆనందించవలసిన విషయం యింకేముంటుంది? ఈనాడు అటువంటి క్షుద్ర వ్యక్తినిగురించి ప్రజలు వినిపించుకోరు. కానీ, ఒకనాడు తప్పకుండా వినిపించుకుంటారు ... ఈ సంకల్పంతోనే నేను ఒకనాడు 'సాహిత్య సభ' అంటూ ఒకటి స్థాపించాను. అయినా ఈనాడు ఆ సభ లేదు. ఆ శక్తికూడా నాలో లేదు.

— శరత్.

(యుగాంతర్-వ, మాఘం, 1938).

---

రంగూన్,
10—10—1913.

ప్రియవరా!

నీవుపంపిన 'బడదీదీ'అందింది. అది నా చిన్నతనంలో వ్రాసిన రచన. ముద్రించకండావుంటేనే బావుంటుంది. అంత చెడ్డ రచనకాదు. ప్రస్తుతం మాసపత్రికల్లో అచ్చు అవుతున్న చిన్న కథల్లో పదిహేనుఅణాలవంతు విమర్శనలే వుండవు. అవి కథలూకావు. సాహిత్యమూకాదు, కేవలం సిరాఖర్చు, కాగితాలఖర్చు మాత్రమే! పాఠకులమీద అత్యాచారం యిది. ఈమారు...లో అచ్చుఅయిన కథలన్నిటిలో ఒక్కటికూడా బావుండలేదు. చాలావరకు చదవతగినవికావు. వాటిలోతత్త్వం లేదు. భావంలేదు. కేవలం

శబ్దాడంబరాలు, సంఘటనల సన్నివేశాలూ, బలవంతమైన Pathos- అంతే!

ముసలివేశ్యను తీసుకొని అలంకారాలుచేసి ప్రజలను మురిపింపజేసే ప్రయత్నాలను చూస్తుంటే - మనస్సులో ఒక వితృష్ణ, సిగ్గు, కరుణ కలుగుతూవుంటుంది. ఇలాంటి రచయితలంతా చేస్తున్నప్రయత్నాలు చూస్తూవుంటే - అలాంటికథలమీద అసంతృప్తి కలుగుతూవుంటుంది. మతికూడా పోతుంది. ప్రస్తుతం చిన్నకథలు చాలా దుర్దశలో వున్నయ్!

ఒకటి, రెండు విషయాలు 'చరిత్రహీన్' విషయంలో చెబుతాను. దీనివిషయంలో ఎవరు ఏమంటున్నారో నాకు వ్రాయండి. ఆ పుస్తకంవిషయంలో వ్యక్తమవుతున్న భిన్న భిన్నఅభిప్రాయాలను సరిగ్గా తెలుసుకునే వీలులేకండా వుంది. అవినీతి (Immoral) అని ప్రజలంటున్నారు. కానీ, ఆంగ్లేయసాహిత్యంలో ఏకొంచెం వాస్తవిక నవలల్లోనైనా, వుత్తమరచనలని చెప్పబడేవాటిల్లోనూ అనైతిక సంఘటనలు కనుపిస్తూనేవుంటయ్. అయినప్పటికీ - సాహిత్యపరుల అభిప్రాయాలు నాకు తెలుపుతూవుండు.

—శరత్.

(యుగాంతర్. 3, మాఘం - 1938)

---

## శ్రీ హేమేంద్రకుమార్ రాయ్‌కి

14, లోయర్ ఫజున్‌డాంగ్‌స్ట్రీట్,
రంగూను, 20–3–14

ప్రియ హేమేంద్రబాబూ,

ఈమధ్య చాలారోజులు రంగూనులో లేను. తిరిగి రాగానే మీ ఉత్తరం చూచాను. యింతకుముందే దానికి సమాధానం యిచ్చివుంటే బాగుండేది. కాని అప్పుడు నా ఆరోగ్యం బొత్తిగా బాగుండక ఒకదానికి మరొకటి వ్రాస్తానేమోననే భయంతో వ్రాయలేదు. మరేమీ అనుకోకండి. అనారోగ్యంవల్ల సాధారణంగా మామూలు మర్యాదలనుకూడా పాటించడం నాకు కష్టమైపోతోంది. అయితే నేను ముసలివాణ్ణి కనుక క్షమార్హుడను.

'చరిత్రహీన్' వచ్చేసంవత్సరం మధ్యలో పూర్తి కావచ్చు. పూర్తిఅయ్యేవరకు సామాన్యపాఠకులు దాన్ని గురించి ఏమనుకుంటారోనని ఆలోచించలేను. నా రచనల యెడల మీ శ్రద్ధ చూచి నేను చాలా సంతోషిస్తున్నాను. చాలామంది శ్రద్ధగా చూస్తుంటారు కాని, నారచనలు అతి సామాన్యమైనవి. వాటిల్లో ప్రత్యేకత ఏముందికనుక ? కాని ఆలోచించేదే వ్రాస్తూవుండాలనిమాత్రం జాగ్రత్త వహిస్తాను. వీళ్ళేమంటున్నారు, వాళ్ళేమంటున్నారు అని నేనెప్పుడూ చూడను. బహుశా అందుచేతనే కొన్నిచోట్ల పాఠకులకు నా రచన బాగుంటుంది. – మరికొన్నిచోట్ల రుచించదు. అయినప్పటికీ వారు రచయితలనుపోల్చి అవమానించాలని అనుకోరు. మీరచనలో ఒకప్రత్యేకతవుంది.

నాకు భాగానచ్చింది. కొన్నాళ్ళక్రిందట మీ సహకారాన్ని పొందడానికి ప్రయత్నించమని నేను ఫణికి వ్రాశాను. బెంగాలీభాష నాకు బాగా రాదేమో. నాకువచ్చిన శబ్దాలు చాలాతక్కువ. అందుచేతనే నా రచన సరళంగా వుంటుంది. కఠినంగా వ్రాయాలంటే అసంభవమౌతుంది. నా తెలివి తక్కువతనంకూడా నాకు వుపయోగపడింది. సరే. 'భారత వర్ష'లో హరిద్వారం మొదలైన యాత్రావిషయాలు వ్రాసిన 'హేమేంద్రనాథరాయ్' మీరేనా? ఇది తెలుపండి.

తీరికవున్నప్పుడల్లా విశేషాలు వ్రాస్తూ వుండండి. మీ వుత్తరం ఎక్కడపెట్టేనో గుర్తులేదు. అందుచేతనే ఈ వుత్తరం ఫణిఅడ్రసుకు పంపుతున్నాను. అన్నిసంగతులూ ఈవుత్తరంలో వ్రాయలేకపోయాను. చాలా బలహీనంగా వుంది. ఇవాళ మరి యింతవరకే. ముందువుత్తరంలో యితర విషయాలు వ్రాస్తాను. మీకు చాలాసంగతులు చెప్పాలనుకుంటున్నాను.

ఫణిని, యమునను కాస్త కనిపెట్టివుండండి. మీరు వారిని కనిపెట్టివుంటే నాకు సగంభారం తగ్గుతుంది. హృదయపూర్వకంగా చెబుతున్నాను. పైపైమాటలు చెప్పేఅలవాటు నాకు లేదు. మీ సహకారాన్ని అపేక్షిస్తూ.

—శరశ్చంద్ర చటోపాధ్యాయ

—...—



శ్రీ హరిదాసు చటోపాధ్యాయకు

రంగూను,
15-11-1914.

ప్రియవరా,

'శ్రీకాంత కా భ్రమణ కహానీ' నిజంగా ముద్రించేందుకు యోగ్యమైనదని నే ననుకోలేదు. ఇప్పుడుకూడా అనుకోవడంలేదు. అయినా ఎవరో ఒకరు ముద్రిస్తారనే అనుకున్నాను. విశేషించి దాని ప్రారంభంలోనే వున్న శ్లేషను పురస్కరించుకొని, దానికి మీ పత్రికలో స్థానం వుంటుందనే సంగతి నాకు తెలుసు. కానీ, అటువంటి అభ్యంతరం యింకొకపత్రికలో వుండదుగదా! అందుకనే మీకు దాన్ని పంపించాను. ఒకవేళ మీరు వ్రాయమంటే మిగిలిపోయినదాన్ని వ్రాస్తాను. ఇంకా చాలా విషయాలు వున్నయ్. అవి నావ్యక్తిగతమైనవి. శ్లేషవిద్రూపము యింతవరకే. చివరివరకూ అంతా నిజమే వ్రాశాను. నా పేరు ఏ స్థితిలోకూడా బయటకు రాకూడదు ... 'అతనెవరు?' అవును. శ్రీకాంతుని ఆత్మకథతో కొంత సంబంధమువుండవచ్చు. అంతేకాక అది పరిభ్రమణకథ. అయినా అందులో నేను, నేనుకాదు! 'ఫలానిమనిషితో, మనిషిని కలుసుకున్నాను. ఫలానివారితో అట్టేపెట్టుకున్నాను.' అని అనుకునేందుకు వీలులేదు ... 'రవిబాబు' తన ఆత్మకథ వ్రాసుకున్నాడు. కానీ తనుమాత్రం ఎవరికీ కనిపించకుండా, వుంచుకోగలిగాడు. రచన చేతగానివాళ్లు - అంటే, తమ రచనలలోని తేడాలను తాము గమనించలేని వాళ్ళు-ఎంత గొప్ప

వారైనా, తమ దీర్ఘమైనరచనలు ప్రచురితమయ్యాక తప్ప కుండా నిరాశపడతారు. అన్ని సంగతులూ కథలవుతాయని వీరి నమ్మిక. దేన్ని చూస్తారో, దేన్నివింటారో, ఏది జరుగుతుందో, ఏది తెలుసుకోగలుగుతారో - దాన్నంతటినీ చూపించేందుకు, వినిపించేందుకు ప్రయత్నిస్తుంటారు. చిత్రం గీయడం చేతకానివాడు, కుంచె చేత్తోపట్టుకుని చూసినదల్లా గీయడానికి ప్రయత్నిస్తాడు. కానీ, దీర్ఘానుభవంతో చివరకు అసలువిషయం అదికాదని తెలుసుకుంటాడు. ఎన్నో గొప్పవస్తువుల్ని వదలిపెట్టుకోవలసివుంటుంది. ఎంతెంతో చెప్పాలనుకున్న ఆశని అణచిపెట్టుకోవలసివస్తుంది. అప్పుడే నిజంచెప్పడం, గీయడం సాధ్యపడుతుంది. అప్పుడు చిత్రం (బొమ్మ) గీయగలం. చెప్పడంకన్నా, గీయడంకన్నా - చెప్పకుండావుండడం, గీయకుండా వుండడమనేది చాలా కష్టమైనది. దానికి ఎంతో ఆత్మసంయమం కావాల్సివుంటుంది. లోభాన్ని అణచుకోవల్సివుంటుంది. అప్పుడే నిజంచెప్పడం, చిత్రించడం వీలుపడుతుంది. అరె! మీకేదో లెక్చరిస్తున్నట్టున్నాను. క్షమించండి. ఇవన్నీ, నాకన్నా మీకే ఎక్కువ తెలుసు. ఏమైనా 'శ్రీకాంత'చదివి ప్రజలు ఏవిధంగా 'ఛీ! ఛీ!' అనుకుంటారో దయయుంచి నాకు వ్రాయండి. అంతవరకూ 'శ్రీకాంత'ను ఒక్క పంక్తికూడా వ్రాయను. నేను మళ్ళీ యింకొకకథ వ్రాస్తున్నాను. అంటే పూర్తిచేద్దామనే వుద్దేశంతోనే రాస్తున్నాను. బాగానేవుంటుంది. 'కామెడీ'యే కానీ, 'ట్రాజెడీ' కాదు. ఎంత తొందరగా పూర్తి చేయగలనో చూస్తాను. ఈ కథ 'భావాన్ని' 'గోరా

పరేశ్ బాబు'వద్ద పుచ్చుకున్నాను. అంటే యిది అనుకరణ మన్నమాట. అయినా దీన్ని పట్టుకోలేను. ఇది సహజ పరిస్థితులకు సంబంధించిన కథ. అందంగానే తయారవుతుందని నాకు వుత్సాహంగావుంది. కానీ, దేనితర్వాత, ఏది, ఏమవుతుందో చెప్పలేము......

—శరత్.

---

రంగూను,
7-12-1915.

ప్రియవరా,

కొత్తకథను సరిగ్గా సమయానికే పంపగలనని ఆశిస్తున్నాను. ఒకవేళ పంపలేకపోతే, ఒక చిన్నకథను పంపుతాను: కారణం మీకు అసంపూర్తికథను పంపలేను గదా! దాన్ని పూర్తిచేయగలనంటూ - మిమ్మల్ని ప్రింట్‌చేయమని చెప్పలేను. కానీ, 'చంద్రకాంత కీ కహానీ' స్వతంత్రమైనది. మీరు అభయమిస్తే దీని సంబంధంలో ఒక విషయం చెబుతాను సంపాదకమహాశయులంతా దయతలచి దాన్ని నిర్లక్ష్యంతో చూడరని భావిస్తాను. ఎంత లేదన్నా యిప్పుడు ప్రచురితమైయున్నవాటికంటె, తక్కువది కానేకాదు. అనేక సామాజికచరిత్రలు దీని భవిష్యత్తు గర్భంలో దాగివున్నాయి. నా ప్రయత్నాలు కష్టపడి బయటికి తెస్తున్నవస్తువు - ఎంతలేదన్నా మిత్రుల ఆదరణను సంపాదించగలదనే ఆశిస్తున్నాను. అవును, ప్రారంభం బాగా

లేదు. యదార్థంగా మంచినవలకు ప్రారంభం ఖరాబవడం సహజమే. ఇది నా వాదన. ఈమాఱు ప్రచురిస్తారా? చేతి వ్రాత అచ్చునపడితే చూడాలన్న ఆశతో పంపించాను. ఈ విషయం భూమికలో వ్రాస్తానుకూడా! తమ,

—శరత్.

—...—

54 / 36 వామ్ స్ట్రీట్,
రంగూను, 22-2-1916.

ప్రియవరా,

చాలారోజులనుండి మీ దగ్గరనుంచి ఉత్తరంలేదు. అంతా బాగా వుంటారని ఆశిస్తాను. నేనీమాఱు తలకిందులై పోయాను. ఎంతోదూరంనుంచి ప్రమదబాబు గాలిసోకి-నేనే మైపోతున్నానో - నాకే అర్థంకావడంలేదు. ఈమాఱు ఆరోగ్యం చెడిపోయింది. ఇది బర్మా జబ్బని విన్నాను. అందువల్ల యీ రెండింటిలో ఏదో ఒకటి అనివార్యమై కూచున్నాయి. నాకేమీ తెలియదు. అంతా భగవంతునికే తెలుసు. బహుశా బ్రతుకంతా ఏమైనా ఈమాఱు జీవి తాంతం అవిటివాడినైపోతానేమోనని భయంగా వుంది... మానసికసంచలనం కారణంగా ఏపని చేయడానికీ యిష్టం వుండడంలేదు. జలధర్ దాదాకు 'సమాజధర్మకామూల్య' చదివేందుకు యివ్వు. దీనికి Fair copy తయారుచేసి వుంచాను. మిగిలినభాగం fair చేసి ఆ తరువాత పంపు తాను. ఆ తర్వాత వ్రాయవలసిందంతా - యితరదేశాల

సాంఘిక వ్యవస్థలకూ - మనదేశ సాంఘిక వ్యవస్థలకూగల భేదం మాత్రమే! అందుకని అటు ఏవిధమైన వ్యక్తిగత విమర్శన వుంటుందనే భయం ఏర్పడనక్కరలేదు. ఈ వ్యాసాన్ని 'భారతవర్ష'లో ప్రచురించేందుకు అతని కిష్టం వుందో లేదో తెలియదు. ఒకవేళ లేకుంటే దాన్ని మీరు తిరిగిపంపండి. నేను పూర్తిగా వ్రాసి ఒక పుస్తకంగా తయారుచేసి వుంచుతాను. భవిష్యత్తులో దీని వ్యక్తిగతఅంశాన్ని ఎత్తివేసి ముద్రించేందుకు ప్రయత్నిస్తాను. నిజంగా సమాజతత్వంతోనే చాలాకాలం గడిపివేశాను. ఎన్నోవిషయాలు వ్రాయాలని మనస్సు వువిళ్లూరుతోంది. కానీ, యీ విషయాన్ని కొంచెం భద్రభావంతో ఎలా చెప్పను? దాన్ని కూడా నిశ్చయంగా చెప్పలేకపోతున్నాను.

జలధర్ దాదాకు, మీకు చాలా ఆశలు చూపించాను. కానీ, కథలువ్రాసేందుకు మానసికస్థిరత్వం కావాలి. ఒకవేళ నాఅదృష్టం చిరకాలానికి హతభాగ్యమైపోతే - దీన్ని సరిగ్గా తెలుసుకోగలనేమో? అప్పుడుమాత్రమే ఈ మహాదుఃఖాన్ని మెల్లమెల్లగా సహించగలను. అప్పుడు నేను అవిటివాణ్ణిగా వుండడమే భగవంతుని ఆశీర్వాదమనుకుంటాను. నా శరీరం కట్టెలాంటిది. ఇంత కఠినమైనజబ్బు ఎప్పుడైనా వస్తుందనేదికూడా ఆలోచించివుండలేదు. ఈ జ్వరం అనివార్యమైనట్లయితే - అది అవసరమైనదే ననుకుంటాను. చిన్నతనంలో భగవంతుణ్ణి ఎంతో ప్రేమించాను. మధ్యలో బహుశా సంపూర్ణంగా మరచిపోయాను.

తిరిగి అంతిమకాలంలో ఆయన వచ్చి నాకు దర్శనం యివ్వ గోరుతున్నట్లయితే చాలామంచిదే కదా! —శరత్

———

రంగూను,

మార్చి, 1916.

కల్యాణీయ,

నీఉత్తరం అందింది. కానీ, ప్రస్తుతం వారానికి ఒకే ఓడ బయలుదేరుతున్న కారణంగా జవాబుయివ్వడం ఆలస్యమవుతున్నది. నా జబ్బువిషయం విని మీరువ్రాసిన అంశాలు, మీ సహృదయాన్ని తెలుపుతున్నాయి. కానీ, నాకుమాత్రం ఆశలేదు. మీరు చిరంజీవులుగా వుండాలని కోరుతున్నాను. భగవంతుడు మీకు దుఃఖాలు కలుగజేయకండా వుండుగాక. నేను చాలా బాధపడుతున్నాను. ఇది బాగవుతుందనే ఆశలేదు. శరీరాన్ని, అంగాల్ని యథాతథంగావుంచే - భగవంతుడు నన్ను అవిటివాణ్ణిగా చేస్తే అదేమంచిది. అప్పుడప్పుడు నా నడక తగ్గిపోయినట్లుంటుంది. అందుకనే ఈ రెండుకాళ్ళను బంధించి, కేవలం చేతులతోనే పనిచేయమని భగవంతుడు విధించిన 'శిక్ష' అనుకుంటాను. కానీ, పైగా యింకొకదోషంకూడ వుంది. క్రమక్రమంగా జీర్ణశక్తికూడా తగ్గిపోతున్నది.అందుకని ఏదో ఒక ఆరోగ్యమైన ప్రదేశంలోవుండి-నయంచేసుకోవాలి. మీరు నాకిస్తానన్నదే చాలు. ఈ సంవత్సరంలో నేను చనిపోను. అలాంటప్పుడు నేను మీ ఋణం తీర్చుకోగలను. అయినా

కృతజ్ఞతా ఋణంమాత్రం తీర్చుకోలేను ...నేను ఒక సంవత్సరం సెలవుపెట్టి వస్తాను. ఏ ఓడకు టిక్కెట్టుదొరికితే - ఆ ఓడకు బయలుదేరేందుకు నిశ్చయించుకున్నాను. మీరు నాకు మూడువందలరూపాయలు పంపితే, నేను సునాయాసంగా రాగలను. ఈ దిక్కూ దివాణంలేని ప్రదేశాన్నివదిలి మీదగ్గరకువస్తే-కొన్ని ఆర్థిక యిబ్బందులైనా తగ్గిపోతాయి. ఈ సంవత్సరంలో అదే ప్రయత్నంచేస్తాను. నేను కొంత వరకు బాగానే వున్నాను. వాపు కొంచెం తగ్గింది. కవిరాజుగారి తైలం మర్దనచేసి చూస్తాను. ఏమైనా నయమవుతుందేమో - వచ్చే పౌర్ణంలోపల తెలిసిపోతుంది. నాకోట్ల కొలది ఆశీర్వాదాలు పుచ్చుకోండి. ఇలాంటి ఆశీర్వాదాలను మీకు బహుశా చాలా తక్కువనుండే యిచ్చివుంటారు. సెలవుపెడితే ఆఫీసునుంచి ఏమైనా ముట్టేదీ, ముట్టనిదీ తెలియదు. ఇక్కడి నియమాలన్నీ పెద్దదొరగారి యిష్టంమీద ఆధారపడి వుంటాయి. మీరు నాకు యివ్వదలచుకున్నదే, నాకు యదార్థంగా చాలు.

---శరత్.

(మార్చి - 1916-?)

...నిన్న మీరు పంపిన మూడువందల రూపాయలందినవి. పదకొండు ఏప్రియల్‌కు ముందుగా ఏస్థితిలో కూడా టిక్కెట్టు దొరకనట్టుంది.

---o---

266, శివాలయం,
బెనారస్‌సిటీ, 8-4-1920.

పరమకళ్యాణీయ,

నీ ఉత్తరం అందింది. ఇక్కడ ఎండలు చాలా ఎక్కువగా వున్నవి. ఒక్కక్షణంకూడా ప్రాణాలు నిలిచేట్లు లేవు. కాలభైరవుకు రక్షించేట్టులేదు. చైత్రమాసంలో ఎటూ కదలడానికి వీలుండదు. ఆయన ఒక వ్రతాన్ని పాలిస్తున్నట్లున్నాడు. ఇది చాలా చెడ్డప్రదేశం! ఒక్కపంక్తిని కూడా రాయలేకున్నాను. గడచిన నాలుగైదురోజులనుంచీ తలపట్టుకొని రెండుమూడుగంటలు మెదలకండా కూర్చుని లేచిపోతున్నాను. అయినా యిక్కడ వున్నంతకాలం ఏమీ రాయలేనేమోననిపిస్తోంది. మిగిలినదంతా నాలో సమాప్తమై పోయిందేమో ఎవరికి తెలుసు? ఒకగమ్మత్తయిన విషయముంది. ఇక్కడ భృగుసింహుడనే పెద్దపేరుగల పండితుడున్నాడు. అతను నా జాతకచక్రంచూచి చాలా గాబరాపడ్డాడు. నేనూ గాబరాపడిపోయాను. నా అతీత జీవనాన్ని (ఇంతవరకూ ఎవరికీ తెలియని జీవితం) అక్షరశః రంగా వున్నదున్నట్లుగా చెబుతుంటే సిగ్గుతో తలవంచుకున్నాను. భవిష్యత్తులో యింకా భీషణంగా వుంటుంది. ఆయన మాటిమాటికి – 'యీ జాతకం ఎవరో మహాయోగులకు, లేకపోతే రాజతుల్యుడైన వ్యక్తికీ వుండవలసినది' అని అంటున్నాడు. అతనికి చాలా పేరు ప్రతిష్ఠలున్నయ్. ఆస్తికూడా బాగానేవుంది. ఇంకా చాలామంది కూర్చునే వున్నారు. పండితుడు నా జాతకచక్రం పరిశీలిస్తూనే

వున్నాడు. పారితోషికంమాత్రం ఏమీ పుచ్చుకోలేదు. 'ఈ జాతకం ఎవరిది? ఎక్కడ వున్నాడు?' అని మాట మాటికీ అడిగాడు. ధర్మస్థానంలో బృహస్పతి అంతగా బలవంతుడై వున్న జాతకం తనెక్కడా యింతకుముందు చూడలేదట. సరేనయ్యా! ఒకవేళ యిదే నిజమైతే నాబోటి నాస్తికుని విషయంలో ఎంత వ్యత్యాసంగా వుందో చూశావా? ఇది గొప్పపరిహాసంగా లేదూ? నా ఆయుర్దాయం నలభై ఎనిమిది, మహాఎక్కువైతే యాభైఏడు వుంటుందట. ఆయన సంభ్రమంలోపడి నా మృత్యువునుమాత్రం చెప్పలేదు. ఉచ్చారణకూడా చేయలేకపోయాడు. 'ఇతను ఒకవేళ నలభైఎనిమిదిలో మోక్షం పొందకపోతే, ఆతరువాత ప్రపంచాన్ని త్యజించి ఏభైయారులో శరీరత్యాగం చేస్తాడని' అంటున్నాడు. అసలు గొప్పవిషయ మేమిటంటే, ఇది నిజంకాదు. ఆ సంగతి నాకు బాగా తెలుసు. కానీ, అతీతాన్ని యీవిధంగా అక్షరక్షరం నిజంగా ఎలా చెబుతారోననే విషయాన్ని అప్పటినుంచీ ఎడతెగకండా ఆలోచిస్తున్నాను. ఏమో ఎవరికి తెలుసు? ఇలా ఆలోచిస్తూ, ఆలోచిస్తూనే వృద్ధాప్యంలో ఆ వంశెల్లో కలుస్తానేమో!

— శరత్ దా.

ఇకనుంచి మీరంతా స్వీకరిస్తూవుండాలి. అయినా శాపంయిచ్చి భస్మీపటలం చేసేవాడిని కాదు. ఇక్కడ యింకొక పేరుప్రతిష్ఠలుగల ధనికుడున్నాడు. అతనిపేరు సుధీర్ బాదుడీ! ఆయన లెక్కలువేసి చూసి, నేను చాలా ధార్మికవ్యక్తినని చెప్పాడు. ఈ సత్యాన్ని ఆయనకూడా

ఆవిష్కరించాడు. చూస్తుంటే వీళ్ళంతా నన్ను తీసుకెళ్ళి ఆదళంలో కలిపేస్తారేమోనని భయంగావుంది.

—శరత్

('ఖేయా' భాద్రపద - ఆశ్వయుజమాసం - 1936

—...—

సామతాబేడ్, పాణితాస్ పోష్టు
(హౌరాజిల్లా) ఆషాఢమాసం 1934

కళ్యాణీయ,

గతరాత్రి నాకు జ్వరం వచ్చింది. ఎనిమిదిరోజులైనా తగ్గలేదు. మీరు 'దత్త'ను ప్రదర్శించుకునేందుకు అధికారాన్ని అడిగారు. నా అధికారాన్నిచ్చేందుకు వప్పుకున్నాను. కానీ, భవిష్యత్తులో విధి అనుకూలత లేకనే నేను 'విజయ'నాటకాన్ని యింతవరకూ పూర్తిచేయలేదు. మీరు దాన్ని యితరులతో రాయిస్తామంటున్నారు. అయితే అతను నాకంటే తొందరగా రాయగలడా? అతనికి చాలా అడ్డంకులుంటాయి. మధ్యలో రచయిత స్వయంగా లేకపోతే నవలను నాటకరూపంలో రాయడం కష్టం. అన్ని అంశాలు అతికేట్లు రాయగలడో లేదో నాకనుమానమే! నేను రాసింది కాబట్టి నాకా బాధవుండదు. అంతేగాక 'విజయ' అనే పేరుతో యింకొకనాటకం రాసి అచ్చువేయించాలని చూస్తున్నాను. ఇతరులతో రాయించేట్లయితే, నే నాపని చేయలేను. దాన్ని సినిమా స్క్రిప్టుగాచేసే వుద్దేశం నాకు లేదు.

మొదటిఅంకాన్ని చదివేందుకు 'ప్రబోధగుహ' తీసుకొని వెళ్ళాడు. దాన్ని యింతవరకూ యివ్వలేదు. నాదగ్గరున్న చిత్తును తిరిగి ఆధారంచేసుకొని, ప్రదర్శనా యోగ్యంగా రాద్దామని ప్రారంభించాను. ఇంతలో విఘ్నం వచ్చిపడింది.

ఆలస్యమైతే మీకే బాధగా వుంటుంది. (అంటే 'విజయ' విషయంలో) వ్యర్థంగా నటులకు జీతం యిస్తూ వుండాలి. ఈ పరిస్థితిల్లో ఏమిచేయాలో నా కర్థం కావడం లేదు. కానీ, ఒకరకంగా పుస్తకం పూర్తిగా తయారయి నట్లే. అయినా అక్కడక్కడా కొన్నిచోట్ల కొంత ఎక్కువ రాసి 'కాపీ' తయారుచేయడం మిగిలివుంది. ఒకవేళ యీ మధ్యలో నా ఆరోగ్యం బాగుపడితే, దాన్ని పూర్తిచేసి మీకు పంపుతాను. కొద్దిరోజులక్రితమే మీ రీ నిర్ణయాన్ని తెలిపివున్నట్లయితే బావుండేది.

పునశ్చరణ... మొదటిభాగాన్ని మీకు చూసేందుకు పంపిస్తున్నాను. దాన్నిచూసి మిగిలినభాగాన్ని మీకు రాయగలిగితే నాకు తెలియపరచండి.

—శరత్.

—...—

(13)

## మణిలాల్ గంగోపాధ్యాయకు

రంగూను,
7-1-1914.

ప్రియ మణిబాబూ!

మీ ఉత్తరానికి జవాబు యివ్వడానికి చాలా ఆలస్యమైంది. ఈ ఆలస్యానికి నేను సిగ్గుపడుతున్నాను. మీ రేమీ మరొకవిధంగా అనుకోకండి. మీ రచనను విమర్శించినందుకు మీ రేమీ విచారించలేదని విని నేను సంతోషంతో వూపిరి పీల్చుకున్నాను. ఇతరుల తప్పులను చూపించడమే, నా పాండిత్యంలోని గొప్పతనమేమోనని అప్పుడప్పుడూ ఆలోచిస్తూవుంటాను. కానీ, యితరులు ఏమనుకుంటారోననే ఆలోచనేవుండదు. సరే, యీ విషయాలను వదలిపెట్టండి. ఇప్పుడు కొంత తేలికైనట్లుంది. ఆ తరువాతకూడా మీపుస్తకాన్ని తిరిగి ఇంకొకసారి ఆసాంతం చదివిచూశాను. నిజానికి చాలా బావుందనిపించింది. ఈసారి కొంత ఎక్కువగా తెలుసుకున్నాను. ఈ రచన యితరులకు నాలా ఎందుకు బావుండలేదో - అదికూడా తెలుసుకోగలిగాను. యదార్థంగా మీరచన tone కవికిమల్లేవుంది. నిరాకారభావ (Abstract)కవిత్వం ఎవరికి బావుండదో-వాళ్ళకు మీరచన బావుండదు. ఈ విషయాన్ని నిశ్చితరూపంలో చెప్పగలను. వాస్తవికసంఘటనలుండి సరళమైనదీ, ప్రాపంచిక భావాలుగల కవిత్వాన్నీ, కథలనూ, చదవడానికి చాలా మంది యిష్టపడతారని తెలుసుకోగలిగాను. ఎందుకంటే అవి తేలికగా అర్థమవుతాయి. అర్థంచేసుకోవడంకూడా

చాలా తేలికే! ఇక్కడ యింకొకసంగతిని చెబుతాను. చాలారోజులక్రిందట 'వసుమతి' పత్రికలో మీ 'బిందు'ను విమర్శిస్తూ వ్రాశారు. 'హిందూవిధవ రాత్రిపూట పరాయి యింటికి వెళ్ళడం ఎంతగా రాణిస్తుంది?' అంటూ విమర్శించారు. (నా స్నేహితు డొకడు యీ విమర్శనను నాదృష్టికి తెచ్చాడు. నేనుమాత్రం స్వయంగా ఆ వాక్యాలను చదవలేదు.) ఈ విషయాన్ని తెలుసుకొని ఆ విమర్శకుణ్ని ఖండిస్తూ నే నొక ప్రతివాదనచేయాలనుకున్నాను. చాలా కఠినంగా రాద్దామనుకున్నాను. 'రచయిత అభిప్రాయంలో ఏలోపమూ లేదు. కేవలం నువ్వే మూర్ఖుడివి. అందువల్ల నీకు దోషాలుకనిపించాయి' అంటూ ఈ విధంగా రాద్దామనుకున్నాను. 'బిందు' ఏమి అపరాధం చేసిందో నా కర్థంగావడంలేదు. ఆమె ఒక నిసహాయ అభాగ్య స్నేహితుణ్ని చూడ్డానికి రాత్రిపూట కొంచెం చాటుగా వెళ్ళింది. ఒకవేళ అవసరమైతే నోట్లో ఒక నీటిబొట్టు వదలడానికో, లేక ఇలాంటిసహాయమే ఏదో చేయడానికో వెళ్ళివుంటుంది. అంతేకదూ? దీనితో మహాభారతం అశుద్ధమైపోయింది. మనస్సులో కొంచం స్నేహంకూడా వుంటే వుండవచ్చు. ఎందుకంటే, ఆమె అతని చిన్ననాటి స్నేహితురాలు. అయితే యీ దోషం ఒక పెద్దదోషమా? ఇదేమన్నా అసభ్యతా? కారణం - ఆమె విధవకాబట్టేకదా? ఒక హిందూవిధవ ఎదుట ఒకవేళ ఎవరైనా చచ్చిపోతూవుంటే, ఆమె చేయి చాచి వ్రేళ్ళతో స్పృశించినంతలో-అతను బతికినట్లయితే, ఆమాత్రం చేయకూడదా? ఎందుకంటే, ఆమె విధవ

కావడం వల్లేకదూ? చనిపోయే మనిషి పరపురుషుడవడం వల్ల నేకదూ? ఇదేనా హిందూవిధవ ఆదర్శం?

ఇలాంటి సంకుచితమైన మనస్సుతో లోకులు యితరుల తప్పులను వ్రేలుపెట్టి చూపిస్తూ - ఆ విమర్శనలు చదివి - 'ఆమాట నిజమే, బాగారాశావు' అని అంటారు.

ఈ విమర్శన ఎలావుందో నేను సరిగ్గా చెప్పలేను. నాస్నేహితునివల్ల విన్నది విన్నట్టుగా వ్రాశాను. ఆ విమర్శనను నువు చూసేవుంటావు.

జపమూ, తపమూ, హిందూధర్మమూ, సన్యాసమూ - యిటువంటి గొప్పగొప్ప పదాలు లేనట్లయితే, కథలుగానీ, వుపన్యాసాలుగానీ ఎంతమాత్రమూ బావుండవని కొంతమంది పాఠకులు భావిస్తూవుంటారు.

ఒకవేళ మీరు ఒక విధవకు వివాహమైందని రాస్తే, మీరు ఎక్కడికి వెళతారో తెలుసా? 'కొట్టండి, చంపండి' అంటూ మీమీదికి అంగలూ దాడిచేస్తారు. వాళ్ళంతా శుష్కమైన నిందారోపణలుచేయడంలో మంచి నేర్పుగలిగి వుంటారు. ఇదే వాళ్ళకున్న బలం! అంటే వాళ్ళు ఛీత్కారం చేస్తూ శరీరబలాన్ని వుపయోగించి విజయం పొందాలని ప్రయత్నిస్తారు. దాన్ని సాధిస్తారుకూడా!

రోజురోజుకూ మనసాహిత్యమంతా ఒకే మూసలో పోతపోసినట్లుగా తయారవుతోంది. రోజురోజుకీ సంకుచిత భావాలు పెరిగిపోతున్నాయి. (అందుకనే అప్పుడప్పుడూ విశృంఖలంగా రాద్దామనిపిస్తూవుంటుంది. కోపంవచ్చి ఎప్పుడో ఒకప్పుడు అలా వున్నది వున్నట్టుగా రాస్తానేమో

కూడా!) కొన్నాళ్ళక్రితం మా అక్కయ్య పేరుతో నారీర్ మూల్య శీర్షికతో ఒకవ్యాసం రాశాను. అక్కయ్య ఒక వుత్తరం వ్రాసింది. దాన్ని నేను పెంచి రాశాను. అందుకు నా సంబంధీకులు, నా మిత్రులు ఎంత కోపాన్ని ప్రకటించారో చెప్పలేను. కొందరు, నేను 'మ్లేచ్ఛభావాలు గలవాణ్ణనీ, హిందువును కాననీ' కూడా అన్నారు. హిందూధర్మాన్ని నే నెప్పుడూ కాదనలేదు. కానీ, దీని అనూధారమీద ఆక్రమణచేశాను. ఎంతోమంది విమర్శనలను (భయంకరమైన ప్రతివాదనలు) గుప్పిస్తామని భయపెట్టారు. అయినా యింతవరకూ ఎవరూ ఏమీ చేయలేదు. ఆసమయంలో నా మామగారొకరు – 'నేను మనస్సులో బ్రాహ్మణుడననీ – బయటకు హిందువుననీ' వ్రాశాడు. అందువల్ల నా మెడలో తులసీమాల లున్నాయి. సంధ్యవార్చుకోనిదే, పరాయివాళ్ళ చేతినీళ్ళుకూడా త్రాగను. (తప్పుగా భావించవద్దు మణిబాబూ! మీకు ఈవిషయాలను చెప్పడం అన్యాయం) నేను వాస్తవంగా ఎవరినో, అదే మీకురాస్తున్నాను. ఇన్నివిషయాలు నాలో వున్నప్పటికీ– ఆయన నన్ను నిందించాడు. 'నేను బయట అందర్నీ మోసపుచ్చుతున్నానని' కూడా దబాయించాడు. యింకా ఏమేమిరాశాడో, అదంతా ఎలా చెప్పను? ఆతరువాత జ్వరంవచ్చింది. లేకుంటే 'దేవతాకా మూల్య' 'హిందూ శాస్త్రకామూల్య' – అనే శీర్షికలతో వ్యాసాలు వ్రాయడం మొదలెడదామనుకున్నాను. సరే, యీ విషయాలను వదలివేయండి. ఈ విషయాలతోనే వుత్తరాన్ని నింపేశాను.

మీ రెలావున్నారు? ఆరోగ్యం బాగుందా? కొత్తగా ఏమన్నా రాశారా? అవునుగానీ, మీరేమిరాసినా చివరలో అధీరు (Impatient) లైపోయి ముగించకండి. బహుశా యిక్కడే మీరు తప్పుచేస్తూ వుంటారు

మీ,

శరత్ చంద్రచటోపాధ్యాయ.

ఇంకోవిన్నపం! యీ వుత్తరంలో ఏమివ్రాసినా తప్పుగా భావించవద్దు. ఏమైనా తప్పులున్నప్పటికీకూడా చెడుగా అనుకోకండి.

పునశ్చరణ :- మీభాషలోని ఒకటి రెండు చిన్నా, పెద్దలోపాలను పట్టుకొని విమర్శకులు గందరగోళంచేస్తున్నట్లు తెలిసింది. నేను స్వయంగా మీకుమల్లే (ఆ తప్పులను) వ్రాయలేను. కానీ, దోషిఅని నేను అనను. మీరు అన్నీ తెలిసివుండే, అదేభాషనీ, అదే గుణితాన్నీ రాస్తున్నారు. మంచిపనే! ఏది మంచిదనుకుంటామో, దాన్ని యితరులు విమర్శించారని వదలివేయకూడదు. అయినా మీరు మార్చుకోవడం, అవసరమనుకుంటే - తప్పకండా మార్చుకోండి.

—శరత్.

———

## శ్రీ సుధీరచంద్ర సర్కారుకు

ప్రియ సుధీర్,

నిన్న రాత్రి మీ ఉత్తరం అందినది. ఆలస్యమవుతున్నందుకు చాలా బాధగా వుంటుందని నాకు తెలియక పోలేదు. అయినా చాలావరకు క్రొత్తపద్ధతిలో వ్రాయవలసి వస్తున్నది. ఒకటి రెండు నెలలు ఆలస్యమైతేనే చాలామంచిది. ప్రారంభంలో యింత బాగా మొదలైనదాన్ని, చివరకు కురూపంగా తయారుచేస్తానేమోనని భయంగా వుంది.

అయినా ప్రచురణను ఆపకండి. ఈసారి టపాలో చాలాభాగం పంపిస్తాను. మళ్లీ రాయడానికి భయపడుతున్నాను. ఇదివరకు ఒకసారి చెప్పినదాన్నే, తిరిగి చెప్పలేను. ప్రచురించినంతవరకూ, దానికాపీలు నాకు అందలేదు. ఎంతప్రచురణఅయిందో, అంతవరకూ రిజిష్టరుచేసి పంపినట్లయితే, నాకు పద్యాలుగువంతుల పని తగ్గిపోతుంది. మొదటినుంచీ పంపాలి సుమా! తొందరగా రాసినట్లయితే పదిహేనురోజుల్లో అయిపోతుంది. అయినా అంతతొందర పడితే బావుంటుందా? ఎంత ఆలస్యమైనా మాఘమాసం లోపల ముద్రణఅయిపోగలదు. నాచేతుల స్థితికూడా పూర్వంలాగే వుంది. బహుశా యిప్పుడిక బాగుపడవేమో! ఫాల్గుణమాసంలో రావాలనే కోరికవున్నది. నా స్నేహపూర్వక ఆశీర్వాదాలు స్వీకరించు -

—శరత్.

('ఆనంద బజారు పత్రిక, 8 మాఘం-1344).

14, మార్చి 1916.

ప్రియ సుధీర్,

...బహుశా నేను అవిటివాణ్ణై పోయానని వినే వుంటావు. తిరిగి లేచి తిరుగగలనని చెప్పలేను. వ్రాయడం, చదువుకోవడం - యిదివరకులానే చేస్తున్నాను. కానీ, మనస్సుమాత్రం బావుండడం లేదు. ఏపనిచేద్దామన్నా మనస్సు బావుండడంలేదు. మనస్సును లగ్నంచేద్దామన్నా-అది లగ్నంకావడంలేదు. కేవలం ముందు వ్రాసినవాట్లో సగం రెండోవంతు, మూడోవంతు పూర్తిచేసిన రచనలు చాలావున్నవి. వాటిని ఏదోవిధంగా జోడించి ఒకరూపం లోకి తీసుకొస్తాను. 'చరిత్రహీన్' విషయంలో అలా చేయదలచుకోలేదు. అందుకనే యిన్ని రోజులనుంచీ, రెండూ, మూడు అధ్యాయాలు పంపుతున్నాను. లేకుంటే నువువచ్చి నాదగ్గర కూర్చుంటే పనిఅయిపోతుంది. నేను ఆయుర్వేదచికిత్సకోసం కలకత్తా వస్తున్నాను. ఒకసంవత్సరం అక్కడవుంటాను. ఏప్రిల్ పదకొండవతేదీన బయలు దేరుతాను. ఎందుకంటే, యీలోపుగా టిక్కెట్టు దొరకదు. ప్రస్తుతం వారానికొకటీ, పదిహేనురోజుల కొకటీ-చొప్పున ఓడ బయలుదేరుతుంది... సరే, రావాలని యిష్టంవుంటే రానచ్చును. ఐనా టిక్కెట్టు దొరుకుతుందా?

('ఆనందబజారు పత్రిక' 8. మాఘం. 1344)

—శరత్.

54/36 వామ్‌స్ట్రీట్.
రంగూను, 10–3–1916.

పరమకళ్యాణీయ,

నేను వృద్ధుణ్ని కావడంవల్ల ఆశీర్వదిస్తున్నాను. నాకు పరిచయస్థుడివి కాకపోయినా, నువు వుత్తరం వ్రాసే వంటే, దీన్ని పరమ సౌభాగ్యమనకండా, దుష్టత్వమనే నీచప్రవృత్తిగలవాణ్ని కాదు.

అయినా, నీ వుత్తరానికి జవాబు చాలా ఆలస్యంగా యిస్తున్నాను. యిందుకు మొదటికారణం – పది పన్నెండు రోజుల కొకసారి పోస్టు వెళుతూంది. రెండోది–నేను చాలా సుస్తీమనిషిని!

అవును, ఈ వయస్సులో నాకు వంట్లో సుస్తీగా వుంటుందని విచారించడం, మంచిదికాదేమో! అయినా యీ ప్రాణాలమీదవున్న మాయ ఒకవిధంగా వదలిపోదుగదా? అందువల్ల మధ్యమధ్యలో నలభైసంవత్సరాలు దాటాక యిటువంటి శారీరకబాధలు రావడం మంచిదేనని అనుకుంటూవుంటాను. నామనస్సులో విచారమనేది లేదు. కానీ, పోనీయండి యీ విషయాలను...

'గ్రామీణసమాజం' మీకు అసహ్యం కలిగించలేదనీ, బాగా నచ్చిందనీ విని సంతోషించాను. నా బాల్యాన్ని, యౌవనాన్ని చాలంభాగం గ్రామాల్లో గడిపాను. గ్రామాలనే ఎక్కువగా ప్రేమిస్తున్నాను. అందుకని ఎంతో దూరానవున్న నాకు రెండుమూడు విషయాలు గుర్తుకువచ్చినవి. అవే వ్రాశాను. ముసలితనంలో జ్ఞాపకశక్తి

వుండదు అయినప్పటికీ కూడా ఆ మిగిలినదానితోనే నా వీరత్వాన్ని చూపించగలిగాను. ఒకవేళ గ్రామప్రజలు తమ తమ మనస్సుల్లోని నిజమైనవిషయాలను చెప్పడానికి ప్రయత్నిస్తే, అవి మనకు అప్పుడప్పుడు ఒకవిధంగా పనికి వస్తాయి. కలకత్తాలాంటి యితరపట్టణాల ప్రజల నాగరికతా విశేషాలకన్నా, వారి వాస్తవిక పరిస్థితులు మంచి కల్పనా వస్తువులవుతాయి.

ఆ తరువాత ప్రతీకారవుపాయం వస్తుంది. ఉపాయ మేముంది? దీన్ని పరామర్శించేటప్పు నాలో వుంది. అది ఎంతో గొప్పశక్తితో, గొప్ప అభిజ్ఞతతో కూడినపని. అది నాలోవున్నట్టు నా నోటితో చెప్పుకోవడం దుష్టత్వంకాదా?

అయినప్పటికీ మనస్సులోని భావాల తరంగాలను మధ్యమధ్యలో చెప్పాను. 'కేవలం జ్ఞానవిస్తారంతోనే ప్రతీకారంచేయవలసివుంటుంది. ఎవరు ప్రతీకారంచేయదలచుకుంటారో-వారు గ్రామం విడిచి, ఏ దేశానికో పోయి మనుషులుగా తయారవ్వాలి. కానీ, గ్రామంలో వుంటూ, గ్రామంలోని మంచి, చెడ్డ మనుషులందరినీ కలుసుకొని పనిచేయవలసివుంటుంది. ఇది చాలా అవసరమైనది. ఇలా నాలుగైదు సూచనలుచేశాను.

'విశ్వేశ్వరి'మాటలు బహుశా మీకు అంతగా నచ్చవట్టుంది. ఒకవేళ మీరు కొంచెం ధైర్యంగా పరిశీలించి చూసినట్లయితే మొదటిదృష్టికిరాని కొన్ని అంశాలు, రెండవ సారి దృష్టికిరావచ్చు. ఆ విషయాలు ఒకవేళ దృష్టికివచ్చి

నప్పటికీ, పాటన్నిటికీ వాస్తవికమూల్యం వుంటుందనేది నిజం కాకపోవచ్చు. దాన్ని యింకొకసారి చదివి కాలాన్ని నష్టపరచుకోవడమే కావచ్చు. అది మీ యిష్టాయిష్టాల మీాద ఆధారపడి వున్నది.

ఒకొక్కటే అన్నివిషయాలు జరిగినయ్! కానీ, నా గురుత్వానికి సంబంధించినవిషయం వ్రాస్తున్నాను. నాకు పద్దెనిమిదోసంవత్సరం దాటకముందు గురుత్వాం వహించే శక్తి నాలోవుంది. నేను అప్పుడు ఎవరికి గురువుగా వున్నానో, వారు నన్ను యిప్పుడు దాటిపోయి పై అంతస్థులో వున్నారు. వారిపేర్లు వింటే మీరు ఆశ్చర్యంలో మునిగిపోతారు. నేను ఒకానొక సమయంలో వారి రచనలను చదివి తప్పులు కొట్టివేసి, మంచిచెడ్డలు సూచించి, ముందుమార్గం చూపించాను కూడా!

ఆ తరువాత నా విజ్ఞానం వృద్ధవుతున్నకొద్దీ యీ గురుత్వంలోని ఓర్పు నశిస్తోంది. ఇప్పుడది ఏ మాత్రం కూడా లేకుండాపోయింది. నేను మీకు ఏ విషయమైనా నేర్పాలనే భావం నాకు కలలోకూడా లేదు. ఈ ఉత్తరం మీకు అందేసమయానికి నేను రంగూను వదలి ఓడ ఎక్కుతాను. ఈ దేశాన్ని వదలితే ఆరోగ్యం కొంచం బాగుపడుతుందేమోనని ఆశ కలుగుతోంది. మీరొకసారి యీ ముసలివాని ఆశీర్వాదాలు పుచ్చుకోండి.

—శరత్

('ప్రవాహ' ఆశ్వయుజ - 1345)

—

## శ్రీ మురళీధరవసుకు

5436 వామ్‌స్ట్రీట్.

రంగూను. 7-4-1916.

పరమకళ్యాణీయ,

చాలాకాలమయ్యాక మీ ఉత్తరానికి జవాబు వ్రాయాలని కూచున్నాను. మీరు నానుంచి జవాబువస్తుందనే ఆశను, చాలాకాలంక్రిందటే వదలిపెట్టి వుంటారు.

నేను చాలా సోమరిమనిషిని. ఇది నాస్వభావమైపోయినట్లుంది. అయినా నేను పెద్దజబ్బులో పడిపోయాను. ఇక యీ దేశంలో వుండలేననికూడా అనుకుంటున్నాను. గాలి మార్పుకోసం యింకొకచోటికి వెళ్ళవలసివస్తుంది. ఈ ఉత్తరం మీచేతికి అందేప్పటికి నేను యిక్కడ వుండను. ఒకవేళ మీరు దయతో దీనికి జవాబు వ్రాయదలచుకుంటే, నా యీ ప్రస్తుత అడ్రసు నెలా తెలుసుకున్నారో, ఆవిధంగానే నా కొత్త అడ్రసుకూడా తెలుసుకోగలరు. అయినా మీ కా అవసరం యిక వుండదనుకుంటాను.

కానీ, యీ విషయాల్ని అలావుంచండి. నా రచన మీకు బాగావుంటే, అదే నా పరిశ్రమకు తగిన బహుమానం. ఈ విషయాన్ని మీరు నాకు సూచించి సంతోషపరిచారు. అందుకు మీకు నా ధన్యవాదాలు. మీకు ఆశీస్సులు పంపుతున్నాను. మీకు యిహలోకసుఖం చేకూరుగాక. భగవంతుడు మిమ్మల్ని రక్షించాలని ప్రార్థిస్తున్నాను.

శ్రీ శరత్ చంద్ర చటోపాధ్యాయ.

## ప్రమద చౌధరికి

6, నీలకమలకుండులేన్
బాజీశివపూర్. 16-6-1916.

సవినయ నివేదనము,

మీవుత్తరం వస్తుందని నేను ఎప్పుడూ ఆశించలేదు. ఇవాళ 'మంటూ'వద్దనుంచికూడా ఒకవుత్తరం వచ్చింది.

నేను యీ దేశంవచ్చి సుమారు అయిదు నెలలయి పోయింది. వచ్చినప్పటినుంచీ మిమ్మల్ని కలుసుకుందామని ప్రయత్నించాను. కానీ, కలుసుకోనడం యింతవరకూ పడ లేదు. ఏదారంటవస్తే, మీ యిల్లు చేసుతానో, నాకు తెలియదు. అంతేగాక, సమయంగాని సమయంలో వచ్చి మీ కాలాన్ని నష్టపరుస్తానేమోనని సంకోచించాను. ఇప్పుడు స్వయంగా పిలిచారు గాబట్టి తప్పకండా వస్తాను. రేపు బుధవారం మీ ఆఫీసుకురానడానికి ప్రయత్నిస్తాను. లేకుంటే శనివారం మీ బాలీగంజ్ లోని యింటికి వస్తాను. మీరచనలను నేను ఎక్కువగా ప్రేమిస్తాను గాబట్టే మి మ్మల్ని నిందస్తూవుంటే నన్ను నిందిస్తున్నట్లుగా వుంటుంది. ఇరుపక్షాల రచనలను నేను ధ్యానంగా చదువుతుంటాను. వారి క్రోధానికి కారణమేమిటో నాకు అంతుపట్టకుండా వుంది. మీరుకూడా ఏమని అర్థంచేసుకుంటున్నారో - నాకు తెలియటంలేదు. ఈ వాదోపవాదాలు వుచ్ఛస్థాయికి చెంది వున్నాయి. అందులో సందేహం లేదు. కానీ, ఏ రూప ములో అవి ప్రచురించబడుతున్నాయో, అదిమాత్రం తెలి యదు. నాది మందబుద్ధి. అందుచేత ప్రతి చిన్నవిషయాన్ని

గట్టిగా తెలుసుకోవాలని అనుకుంటాను. మిమ్మల్ని కలుసుకోవాలనే కారణంకూడా యిదే. మిమ్మల్ని కలుసుకున్నాక విశేషాలన్నీ ఒకరూపకంగా తెలుసుకోగలననే నమ్మకమున్నది. శ్రీయుత యాదవేశ్వర పండిత మహాశయుణ్ణి ఒక రోజున యిదే ప్రశ్న వేశాను. వారు నాకు తెలియజెప్పారు. మణిలాల్‌నుకూడా అడిగాను. ఆయనకూడా చెప్పారు. ఈమాట మీ సంతు.

శ్రీయుత క్షీరోద్‌బాబు (నాట్యకారుడు) ఒకనాడు నాతో 'నేను బెంగాలీసాహిత్యంలో ఒక రత్నంలాంటి వాణ్ణ'ని అన్నాడు. కారణమేమంటే, నేను వ్రాసే భాష చాలా మంచిదట. కానీ, 'సబుజ్‌పత్ర'లో వారు భాషను మట్టిపాలుచేశారు. వారిభాష భాషే కావట్లుంది.

నా భాషకు 'సబుజ్‌పత్రిక' భాషకు తారతమ్యం ఎక్కడుందో నేనావిషయాన్ని స్పష్టంగా చెప్పలేకపోతున్నాను. దీన్ని మీవల్ల తెలుసుకోవాలనుకున్నాను. నా రచనలను మీరు చదివారో, లేదో తెలియదు. ఒకవేళ చదివివుంటేమాత్రం మంచిదే! పండిత మహాశయులు ఆనాడు 'బంగాలీభాష సంస్కృతపరిపుష్టం కావాలని' అన్నారు. సంస్కృతంలో ఎంత శ్రద్ధవుండాలో వారికి స్వయంగా తెలియదు. మీకుకూడా తెలియదనుకుంటాను. దీని పర్యవసానం ఎంతవరకు మీదగ్గర పరిష్కారం అవుతుందో చూస్తాను.

—శరశ్చంద్ర చటోపాధ్యాయ.

———

6, నీలకమల కుండులేన్,
బాజీశివపూర్ 6-3-1916.

సవినయ నివేదనము,

నిన్న మీరు నాకొక పుస్తకం పంపించారు. పుస్తకాలు చదవడం యిప్పుడు నాకొక అలవాటైపోయింది. అది రానురాను చెడ్డఅలవాటుగా మారిపోయింది. ఈ పుస్తకం చదువుతానో, లేదో కానీ, దాన్ని పుచ్చుకోవడం మాత్రం భద్రంగానే పుచ్చుకున్నాను. ఈ విషయంలో కొంతగర్వం ధ్వనించవచ్చు. అయినా యిది నిజమైనదే. అందువల్ల యీ పుస్తకాన్ని చాలాకాలమయ్యాక పొంది, మీకు ధన్యవాదాలర్పిస్తున్నాను. ఒకసారి దీనికి ధన్యవాదాలర్పిస్తున్నాను. రెండోసారి వుత్తరం చివర ధన్యవాదాలర్పిస్తాను.

నిన్నరాత్రే పుస్తకం ముగించాను. కథలు చదవడంలోని ఆనందం యీపుస్తకం చదివాకనే పొందానని చెప్పవచ్చు. దీన్నెక్కువగా ప్రశంసించడమూ, యిందులోని గుణగణాలను కొంత విమర్శించడమూ జరుగుతుంది. దీన్ని సమాలోచనచేయమని మీ మిత్రులు కోరుతున్నారని నిన్న మీయింటివద్ద విన్నాను. అందువల్ల ఈ పని నేను చేయను. వాళ్ళుమాత్ర మేంచేస్తారు? శివుణ్ణి చేయబోయి కోతిని చేస్తారేమో! అది వారికే తెలుసు. కానీ,ఈరచనలో ఎంత ప్రౌఢత్వముందో, ఎంత సూక్ష్మాతిసూక్ష్మమైన పనితనముందో, దీని నిజసౌందర్యం ఎక్కడవుందో, మధురరసం ఎక్కడవుందో - యివన్నీ వ్రాయడం ఎంత కష్టమో,

యివన్నీ స్వయంగా రాయగల జబ్బువున్న వాళ్ళకే తెలుస్తుంది. యిలాంటి కుశలరచనలను చదివే జబ్బు దేశంలో కొంతమందికి వున్నదనే విషయం చెప్పనక్కరలేదు. సరే, యీసంగతిని వదిలేయండి. వాస్తవం ఏమంటే, రవిబాబు రచనలు చదివినతర్వాత ఎంత ప్రయత్నించినా, నేను అటువంటి రచనలను వ్రాయలేనని నాకు తోచింది. నిన్న మీకథలు చదివినతర్వాత ఎంత ప్రయత్నించినప్పటికీకూడా యిలాంటి రచనలు రాయలేననిపించింది. ఈ విషయాన్ని సూచించేందుకే ఈ వుత్తరం వ్రాస్తున్నాను.

నిన్నసాయంకాలం - అంటే మీ యింటినుంచి బయలుదేరివస్తూ 'భారతవర్ష' కార్యాలయానికి వెళ్ళాను. అక్కడే 'సోమనాథ్‌కీకహానీ' - చదివాను. జలధర్ బాబు మొదలైనవాళ్ళంతా దాన్నిగురించి వాదులాడుకుంటున్నారు. నేను యీ రచనను తప్పకండా రచయితలుకూడా చదవాలనే అభిప్రాయానికి వచ్చాను. దీనిలోని నిర్మల రచనాశైలీ, సహజ సౌందర్యమైన కథా సంవిధానమూ, రసపరిపాలనా, మనోభావాల చిత్రీకరణ-సహజంగా వ్యక్తమయ్యాయి. దానిలో స్వయంగా రచయితలకు అర్థమయ్యే వస్తుసముదాయం చాలావుంది. కానీ, సాధారణ జనులు సరిగా అర్థంచేసుకోలేరు. సాధారణులు కేవలం చదివి ఆనందిస్తారు. గ్రంథకారులకు వుపయోగిస్తుంది కూడా! ఇక్కడ మీకు ఒకవిన్నపం విన్నవిస్తున్నాను. ఇంతగొప్పగా పొగడుతున్నాననీ, ఇందులో ఏదో ప్రత్యేకత వుందని - మీరు భావించవద్దు. ఎందుకంటే 'చార్యాకణి'ని పురస్క-

రించుకొని మీకు చాలామంది ప్రశంసలను అందించి వుండవచ్చు. అదంతా మీకు స్వయంగా అనుభవమైనదే. నేనయినట్లయితే, ఎంతలేదన్నా దాన్నే అనుభవించే వాడిని. ఎందుకంటే – ఈ పుస్తకం సాధారణ పాఠకులకు మాత్రంకాదని నేను నిశ్చయించుకొన్నాను. సాధారణ ప్రజలకు అర్థంకాదుకూడా!

ఆనాడు పుస్తకప్రసంగంలో ఒకపండితుడు– 'మీరు రవిబాబు కవిత్వంలోని అర్థాలు బోధించగలరుగదా!' అన్నాడు పుస్తకాన్ని ప్రశంసిస్తూనే. 'కాదు, కాదు, నేను అర్థం వివరించలేను. మీరు వేదాంతంలో పెద్ద పండితులై నప్పటికీ, కావ్యాలు అర్థంచేసుకోవడంలో పండితులుకారు. అంతేగాక, అన్నిరకాలైన కవిత్వాలను అర్థాన్ని అందరూ తెలుసుకోవాలనే శపథం యివ్వలేము. రవిబాబుగారి 'శ్రేష్ఠభిక్ష'ను చదివి గురుదాసుబాబు 'అలాంటి అశ్లీల మైన కవిత్వాన్ని తాను ఎప్పుడూ చదవలేదని చెప్పాడు.' అందువల్ల యీవిషయం ఒక్క గురుదాసునోటంట వచ్చింది కాబట్టి నవ్వుకోవాలా? నవ్వుకోకపోతే, గొప్ప అపరాధం అవుతుందా? అదేమీ కాదు.

ఇంగ్లీషులో ఒక సామెత వున్నది. Art to hide Art కళను దాచేందుకే కళ. దీనిఅర్థం తెలియనివాళ్ళకు వాస్తవికమైన సౌందర్యాలలో సౌందర్యమే కనిపించదు. మార్వాడీలు యిల్లు కట్టిస్తారు. డబ్బుఖర్చుపెట్టి దానికి రకరకాలైన నగిషీలు చెక్కిస్తారు.

పాఠకుల మేధస్సూ, సంస్కృతీ Intelgence and culture ఒకదరికి రానంతవరకూ, వారు యీ పుస్తకాన్ని అర్థంచేసుకోలేరు. ఇది నేను అనాలని అనేమాట కాదు. ఒకవేళ యింకెప్పుడైనా కలిసినప్పుడు దీనివిషయం మాట్లాడుకుందాం. మీకు ధన్యవాదాలర్పించి, యీనాటికి సెలవుతీసుకుంటున్నాను. పుస్తకంమీద నాకున్న మంచి అభిప్రాయానికి మీవద్ద విలువలేకపోవచ్చు.

— శ్రీ శరత్ చంద్ర చటోపాధ్యాయ.

ఈనాడిప్పుడే మీ పుత్తరం అందింది. మీకు వ్రాసిన వుత్తరం ఆనాడే పంపలేకపోయాను. ఆతరువాత హఠాత్తుగా మీరేమనుకుంటారోనని ఇవాళ దాన్ని పంపుతున్నాను. ఎప్పుడో ఒకనాడు మీయింటికి వస్తాను.

— శరత్.

---

6, నీలకమలకుండులేన్,
బాజీశివపురం, 11-10-1916

సవిషయ నివేదనము,

నీ ఉత్తరంవచ్చి ఎన్నాళ్ళోఅయినా దానికి జవాబు యివ్వడం ఆలస్యమైనందుకు ఎంతగానో సిగ్గుపడుతున్నాను. మీయింటికి రాలేకపోయినందుకు మనస్సులో క్లేశంగానే వుంది. ఎల్లుండి – అంటే బుధవారంనాడు మీరు యింటి దగ్గరవుంటే, ఆసాయంకాలం వస్తాను. కానీ, గొప్ప వారింటికి రావాలంటే, నా మనస్సెందుకో సంకోచంతో

భిన్నమైపోతూవుంటుంది. మరి, అది నా స్వభావమేమో నాకు తెలియదు. అందువల్ల నేను రాలేకపోతూవుంటాను.

ఈ సంకోచాన్నుంచి నేను తప్పుకుంటే ఎల్లుండి తప్పకండా మీవద్దకు వస్తాను. ఒకవేళ రాలేకపోతే అందుకు కారణం మీకు చెప్పవలసిన అవసరం వుండదను కుంటాను. సరే, యీ విషయాలన్నీ పోనీయండి.

మీ పుస్తకాన్ని విమర్శించినవారు పత్రికాధిపతుల్ని సంతోషపెట్టలేకపోయారు. అంటే, అది ఎక్కువగా దోషారోపణలతో నిండివుండడమే కాదనుకుంటాను. మన పత్రికాధిపతులముందు పేరు బరువు కనిపించకుంటే - ఏ సంపాదకుడుకూడా తన బుద్ధితీక్షణతను పరీక్షించలేడు. నా విమర్శన అసలే శాపుండదు. ఎందుకంటే ఈ విషయంలో నాకు శక్తితక్కువ. అయినా క్రింద పేరు రాస్తేమాత్రం ఏపత్రికలోనైనా స్థానం లభించితీరుతుంది. అందువల్ల వచ్చే నెలలో విమర్శిద్దామా, వద్దా? అని ఆలోచిస్తున్నాను. 'భారతవర్షకు'గానీ, 'ప్రవాసి'కిగానీ పంపుదామనుకుం టాను. కానీ, అది ఉత్కృష్టకళాఖండముగా లేదనిపించ వచ్చు. భారతీయకళ నాలో వుండకపోవచ్చు. అదే నా భయంకూడా! కానీ, మీకు నావిమర్శ ఆహ్లాదం కలిగించక పోవచ్చు. అయినప్పటికీ మీకు అభయమయిస్తేమాత్రం విమర్శిస్తాను.

మీ 'బడేబాబూక్.' 'బహోదిన్'-ను శ్రీయుత పాంచ్‌కడీబాబు 'మున్షీయాన్' అని అన్నారు. వారిమాట ఏమంత తక్కువదికాదు. కానీ, అది నాకు నచ్చలేదు.

అయినా ఈవిషయంలో మీవిమర్శనలు వేరుగావుండవచ్చు. నాఅభిప్రాయం మీకు స్పష్టంగా అర్థంఅవుతూవుండవచ్చు. నేను అలా అంటాననేకాదు. పదునైన వ్యంగ్య బాణాలతో మనిషిలో ఏవో కొన్ని మర్కటప్రవృత్తులు కల్పించి పాఠకులను ఎదురుగా నవ్వించడంలో మీకు పారం గతులేనని నాకు తెలుసు. కానీ, మనుషులను మనుష్య రూపంలోనే చూపించేప్రజ్ఞ మీలో అధికంగావుందని నేను తెలుసుకున్నాను. గంభీరప్రకృతిగలవాళ్ళు సర్వసాధార ణంగా తనుకష్టాల్ని చెప్పుకుంటున్నప్పుడు ఒకరకమైనస్థితి ఏర్పడి హఠాత్తుగా అది మరెవరిదో కష్టాలగాథ చెబు తున్నట్లుగా వుంటుంది. అంటే దీనితో తనకేమీ సంబంధం లేనట్లుగా చెబుతూవుంటారు మీరుకూడా అచ్చం అలానే చెబుతారు. ఎంత వెదికిచూదినా 'ఖాతరోక్తి' కనబడనే కనబడదు. కానీ, జీవితంలోజరిగే ట్రాజెడీలు పాఠకుల మనస్సుమీద దెబ్బకొడుతూవుంటాయ్! మీరచనలలోని యీ సహజశాంతమైన శైలి నన్నెంతగానో ముగ్ధుణ్ని చేస్తుంది. అందుకనే ఆనాడు 'చార్యారి'కథలను సరిగ్గాఅర్థం చేసుకునేందుకు పాఠకుల శిక్షా, సంస్కృతీ ఒకస్థాయికి చేరి వుండాలని నేను అన్నాను. లేకుంటే దీని సౌందర్యమంతా వారిముందు నిరర్థకమైపోతుంది.

కానీ మర్కటంగా చిత్రిస్తున్నసమయంలో రచ యిత ఎక్కువగా ఔదాసీన్యం వహించడం ఏవిధంగానూ సంభవించదు బహుశా యిందుకే 'బడాదిన్' అంతగా

నాకు బాగుండలేదు. దీనిలోని పరిహాసం నాకు సరిగ్గా బోధ పడలేదు.

అయినా నేనే సరిగ్గా అర్థంచేసుకోలేకపోయా నేమో! బహుశా అంతేకావచ్చు. అందువల్ల నాకు బాగా వుండడం, లేకపోవడంలో, పెద్ద విలువేమీ లేదు. మొదటి నుంచీ చివరవరకు అనధికారచర్చ చేశానేమోననిపిస్తుంది. ఒకవేళ అలా జరిగినట్లయితే క్షమించండి. ఈ అనధికార చర్చను నేను సవినయంగా చేయలేదు. ఎందుకంటే, నేను చదవడం, వ్రాయడం నేర్చుకోలేదు. ఆంగ్లంలో గొప్ప పాండిత్యం లేకపోవడంవల్ల రచనలలోని మంచి చెడులు విచారించేఓర్పు లేకపోవచ్చు. ఈ ఓర్పుకూడా శిక్షా, సాపేక్షవల్లనే సిద్ధిస్తుంది. గొప్పగొప్పవారి గొప్పవిమర్శ నలు ఎవరైతే చదవరో - వారు సాధారణ తెలివితోనే అర్థంచేసుకోలేరని కాదు. కానీ, ఏవస్తువు వారికి ప్రత్యక్ష అనుభవానికి బయటవుంటుందో, వారిఆంతర్యంలో ఒకక్షణం కూడా అవే ప్రవేశించలేకపోవచ్చు. బయట తలుపు మూసి వున్న సంగతి చూస్తూవుండికూడా అర్థం చేసుకోలేరు. ఆ తలుపు మూసివున్న సంగతినికూడా మరచిపోతూ వుంటారు. అందుకని అన్నివిషయాలకు ఒకేరకమైన విమర్శ నలేనని అనుకుంటారు. అందుకనే బెంగాలీభాషలో విమర్శనాపుస్తకాలు లేవనీ, విమర్శనా పద్ధతులు తెలుసు కునే బలంకూడా వారికే లేదనీ ఆంగ్లేయులు అంటూ వుంటారు. క్రమబద్ధంగా ఎక్కడైనా నేర్చుకుందామనే ఆలోచనకూడా వీరికి వుండదు.

నాకు నేర్చుకోవాలనే వున్నది. అందుకనే నే నింత రాయగలిగాను. నే నీవిషయాలను విద్వాంసుల నోటివెంట విన్నాను. అందువల్ల నాకు నచ్చడం, నచ్చకపోవడంలో విలువ ఏమీ వుండదు. నేనూ ఏదో ఒక విమర్శన రాసి పంపదలచుకున్నాను. అలా రాసిపంపితే తప్పకండా ప్రచురిస్తారు. అందుకని మీ అనుమతికూడా పొందవలసిన అవసరం వుండదు. అయినా మీ రచనలమీద నాకున్న శ్రద్ధనుబట్టి యిలా కొంతవరకు నా అనౌచిత్యాన్ని వెల్లడి చేసి, మీ అభిప్రాయాన్ని తెలుసుకోవాలనుకుంటున్నాను. ఒకవేళ మీకు ఆపదలేకుంటే ఈ విషయంతోనే యిక ముగించివేస్తాను. నా దసరా శ్రద్ధాంజలులు స్వీకరించండి.

— శ్రీ శరత్ చంద్ర చటోపాధ్యాయ.

—...—

## శ్రీ హరిదాసు శాస్త్రికి

దాజీశివపురం.

28-3-1925.

కల్యాణీయ,

మీ వుత్తరం చదువుకున్నాను. ఈమారు కాశీలో వున్న అంతమందిలోనూ మీరు ఒక్కరే నాకు ఆత్మీయుల్లా వున్నారు. అయినా మీ విషయంలో నాకేమీ తెలియదు. మీ ఉత్తరాన్ని చదవడంలో కొంతకాలం నష్టమైనమాట యదార్థమే! అయితే కాలం, కేవలం ప్రహరాలతోను, దండనలతోనూ ఫల విఫలాలతోనే కూడి వుంటుందా? అందులో ఇంకేమీ వుండదా? నాదృష్టిలో మీరువ్రాసిన ఈపెద్దవుత్తరం నేను చదువుకోవడంలో, ఆలోచించడంలో, దాన్ని చదివాక అందులో సమయాన్ని నష్టపరచలేదను కున్నాను.... ఆడవాళ్ళకు యిరవైరెండు మొదలుకొని ముప్ఫై అయిదేళ్ళమధ్య సంకటజనకంగా వుంటుంది. ఎందుకంటే యిరవై రెండు, యిరవైమూడు తర్వాత స్త్రీలకు నిజమైన ప్రేమ అంకురిస్తుంది. అప్పుడు కేవలం ఆధ్యాత్మికప్రేమతోనే యిందులోని క్షుధ యీనవత్తూ అంత రిక్తంకాదు. కానీ, యిదంతా ఒక పక్షంవారి వాదన. యిది శరీరపక్షం. కానీ, యింకొక పక్షంకూడావుంది. అదే చాలాకాలంవరకు మీమాంస విహీనమైన సమస్య! కానీ, ప్రపంచంలో సాధారణంగా అలాజరగదు. అయినా నలుగు రైదుగురవ్యక్తుల అదృష్టంలో అలా జరిగివుంటే, వారి లాంటి అదృష్టశాలురు మరెవరూ వుండరు. అంతకంటే అభాగ్యులుకూడా వుండరు. వారి దురదృష్టంమీదనే కావ్యజగత్తులోని మాధుర్యమంతా సంకుచితమై వుంటుంది.

... సమాజంలో ఎవరెవరికి గౌరవస్థానం యివ్వ లేమో, వారిని కేవలం ప్రేమద్వారానే సుఖింపచేయలేము. మర్యాదహీనమైన ప్రేమభారం శిథిలమైపోగానే అప్పుడదాక దుర్విషయమైపోతుంది.... అంతేగాక, కేవలం మనవిషయమే కాదు. భావిసంతానం సంగతి అన్నిటికన్నా గొప్పది. వారి భుజస్కంధాలమీదనే మరొకరిభారం తీసుకొచ్చే సామర్థ్యం గొప్ప ప్రేమలోకూడా వుండదు. ఒక్కసంగతి. ప్రేమించేశక్తి పురుషులకన్నా, స్త్రీలకే అధికంగా వుంటుంది. వారు దేన్నీ లెక్కచేయరు. పురుషుడు ఎక్కడైతే, భయంతో విహ్వలుడై పోతాడో - స్త్రీ అక్కడే స్పష్టంగా ఉచ్చస్వరంతో వుద్ఘోషించడానికి సంకోచించదు.... సంఘంలోని, అనాచార, అత్యాచారాలను ప్రతిఘటించేవాడే, దుఃఖాలను అనుభవించవలసివుంటుంది.

—శరత్

---

1925.

...నిజమైన ప్రేమకోసం ప్రపంచంలో దుఃఖాలే ఎక్కువగా అనుభవించవలసివుంటుంది. ఎవరాపనిచేయలేరో సంఘంలోని వారి అసందర్భపు అన్యాయాలకు ప్రతీకారమనేది వుండదు. సమాజానికి విరుద్ధంగా నడవడం, ధర్మానికి విరుద్ధంగా నడవడం - ఈ రెండు ఒకే వస్తువుకాదు. ఈ సంగతిని చాలా మంది మరచిపోతూవుంటారు.

—శరత్.

('సహనా' వైశాఖం - 1925)

## శ్రీ అక్షయచంద్ర సర్కారుకు

ప్రియవరా,

మన నవలలను నాటకాలుగా మార్చి వాటిని ప్రదర్శించాలంటే, పాటించవలసిన నియమాలు – ఆ నాటకాలు ముద్రించకూడదు. ఏ వ్యాపారి, థియేటరువాళ్ళైనా సరే, ఆర్జనోపార్జన చేసుకోనీయకూడదు. ఒకవేళ యిలా కాకుంటే 'ఏదో షోకుగా అభినయిస్తాం!' అంటే టిక్కెట్లు అమ్ముకోవడానికి నాకేమీ అయిష్టతవుండదు. నా 'దత్త' నవలను యింకెవరో నాటకంగా రాశారుట. దాన్ని నేను చూశాను. స్వయంగా నేనే కొంత మార్చివ్రాసి 'విజయ' అనేపేరుతో స్టార్ థియేటరువారికి యిద్దామని ఆలోచించాను. నా నవలలో వున్న దోషమేమిటంటే, వాటిని నాటకాలుగా మార్చాలనుకుంటే వాటిలో, అనేక స్థానాల్లో మళ్ళీ కొత్తగా రాయవలసివస్తుంది.

అది ఇంకెవరైనా అయితే, అటువంటి మార్పులు చేయలేరు. కేవలం పుస్తకాల్లోవున్నమాటల్నే అటూ, ఇటూతిప్పి నిలబెట్టిచూపిస్తారు. అలా తయారుచేసిన నాటకాలు నాకు నచ్చవు.

—మీ శరత్ బాబు.

('వసుమతి' మాఘం – 1344)

—౦—

(16)

# శ్రీ దిలీప్ కుమార్ రాయ్ కి

సామతాపేడ్. ఫణిత్రాస్‌పోష్టు.
హౌరాజిల్లా, 13 ఫాల్గుణం, 1927.

పరమ కళ్యాణవరేషు,

మంటూ! నీ ఉత్తరం అందాక నేనెంత సంతోషం పొందానో చెప్పడంకష్టం. మీకు నామీద శ్రద్ధవున్నది. ప్రేమవున్నది. దీన్నికూడా తెలుసుకోలేకపోతే, ప్రపంచంలో యింకేమి తెలుసుకోగలను.

నీకు వీడ్కోలిచ్చిన సందర్భంలో ఎవరెవరు ఏమేమి సందేశాలిచ్చారో- అదంతా విన్నాను. నీవు విదేశయాత్ర వెళుతున్నావు. కానీ, కొంచెం తొందరగా తిరిగిరావాలి. నీవు దగ్గర లేకపోతే, నాకు చాలా బాధగావుంటుంది.

'మరేన్', పరన్ ఆఖరి (మూడవ) భాగం నాకు ఎంత నచ్చిందో - దాన్ని వివరించి చెప్పలేను. నిజమైన వ్యథ దుఃఖాన్ని అనుభవించి ప్రపంచ ప్రజలంతా ఎలా ఒకరొకరితో ఐక్యమవుతుంటారో, అలాగే నీపుస్తకం చివరిభాగంలో చాలా సహజభావంతో చిత్రించావు. అందువల్ల నీవు బహుశా వ్యక్తిగత దుఃఖజీవితాన్ని బాగా వ్రాయగలవు. కానీ, కొంత అనుభవాన్నికూడా పొందవలసివుంటుంది. మీ నాన్నగారిని నే నెరుగను. కానీ, చాలా మంచి ఆయన, 'మానవుల గాథలను సానుభూతితో అర్థం చేసుకోగల నేనుంటారు'అని చెప్పగా విన్నాను. బహుశా అదే నీకు పట్టుబడిందేమో! ఈ వస్తువుకు హృదయంలో రాత్రింబవళ్ళు లాలనచేసి పరిపూర్ణమైన మానవునిగా

తయూరుకావలసి వుంది. అప్పుడే మంచి చేకూరుతుంది. నా వుత్తరాలు కావాలనుకుంటే అచ్చువేయించు. అందుకు నా అనుమతినిస్తున్నాను. నీవంటే నాకు ఎంతో ప్రేమ వుంది. ఈ నాటిదేకాదు. చాలాకాలంనుంచీ వున్నది. నీ స్నేహితులతోవచ్చి నా యింట్లో అల్లరిచేసి పూరీలు తిని పోయిన రోజునుంచికూడా, నేను నిన్ను ప్రేమిస్తూనే వున్నాను.

నిన్ను మనస్ఫూర్తిగా దీవిస్తున్నాను. ఈ జీవితంలో నీవు 'సఫలజీవి'వవుతావు. ఇవే నా హృదయపూర్వక ఆశీస్సులు.

ఆశీర్వాదకుడు,

—శ్రీ శరత్ చంద్రచటోపాధ్యాయ.

---

ఆషాఢం, 1335.

మంటూ,

......వ్యాసాలు చదివాను. పిల్లవాడు వ్రాసినవి కావటంవల్ల ఇంకా వాటి మంచిచెడ్డలు విచారించేసితి రాలేదు... పిన్నవయస్సులో కథలు వ్రాయడం మంచిది. పాటలూ – పద్యాలు వ్రాయడం మరీమంచిది. అంతేగాని విమర్శలు వ్రాయబూనడం చాలా అన్యాయం! ... ఇంత త్వరగపడి వ్రాయడాన్ని కొంచెం ఆపించు. వ్రాయడంలో తొందరపాటు పండితునికి తగునుగాని, రచయితకు తగదు ...అమ్మాయి రచనలు చదివితే బుద్ధిమంతురాలుగా కని

పిస్తోంది. కాని జీవితంలో వయస్సుతోపాటు లభించేది అనుభవము. కేవలం పుస్తకాలు చదివే దాన్ని పొందలేరు. అది పొందగలిగేవరకూ దానివిలువా తెలీదు. అయితే మరొకవిషయంకూడా జ్ఞాపకముంచుకోవాలి. అనుభవము, దూరదర్శిత్వము శక్తిని ఇచ్చేవేకాక, శక్తిని హరించేవి కూడాను. కాబట్టి చిన్నవయస్సులోనే కొన్నిపనులు పూర్తిచేసుకోవాలి. వాటిలో కథలువ్రాయడం ఒకటి. చిన్నతనంలో వ్రాయగలిగినదానికి మించి ఎక్కువగా పెద్దవారై వయస్సువచ్చిన తర్వాత వ్రాయగల్గడం నే నెక్కడా చూడలేదు. వయస్సు పెరుగుతున్నకొద్దీ మనలో పెరిగే గాంభీర్యము, సంకోచము మనకి చాలా అడ్డుపడ తాయి. మనిషిలో రచయితేకాక విమర్శకుడుకూడా ఉంటాడు. వయస్సుతోపాటు విమర్శకుడు ఎదుగుతాడు. అందుచేత వయస్సు ముదురుతున్నకొద్దీ రచయిత ఏమైనా వ్రాద్దామనుకుంటే అడుగడుగునా విమర్శకుడు అతని చెయ్యి పట్టుకుంటాడు. అప్పుడు రచన విద్య-విజ్ఞానం దృష్ట్యా ఎంత గొప్పదైనా రసదృష్ట్యాచూస్తేమాత్రం వెనుకబడుతుంది. కాబట్టి యౌవనావస్థదాటి రసస్పృష్టి చేద్దామనుకునేవారు పొర బడుతున్నారన్నినా అభిప్రాయం. వ్యక్తికి ఒక వయస్సు దాటిన తర్వాత కావ్యాలు, నవలలు వ్రాయడం శోభించదు. అవకా శాన్ని అందుకోవడమే కర్తవ్యం. వ్యక్తికి సుఖాన్ని కలిగించే సమయం వృద్ధాప్యం. అందులో ఆనందం ఉన్నదని నటన చేయడం వ్యర్థం. —శరత్.

('స్వదేశబజార్' శరత్ సంచిక, 13 ఆశ్వయుజం 1335)

22 భాద్రపదం 1333.

మంటూ...

"సాధారణప్రజలను మనం విస్మరిస్తున్నాము. అందుచేత వసంతోత్సవసభలో ఆవరణబయటివారికి ఎండు మెతుకులు, పులుసు, మజ్జిగనీళ్ళుపోసి, గొప్పవారనబడే వారికొరకు మిఠాయిలు పిండివంటలు దాచి ఉంచుతున్నాము." అనే పూజ్య రవిబాబు వాక్యాన్ని ఉదహరించావు. విషయం వినడానికి బాగుంది. అంతేకాక అది వ్రాసినవారి ఉదారస్వభావం, విశాలత్వం గోచరిస్తున్నాయి. కాని వాస్తవంగా ఆలోచిస్తే ఇంత తప్పుడు విషయం మరొకటుండదు. విద్య, నాగరికత, సంస్కృతి వీటికి 'మిఠాయి'లే కావాలి. మంటూ! నిజంగా నాగరికుడైన సుకుమార సున్నిత హృదయంగల మనిషికి ఎండు మెతుకులు తినిపిస్తే కడుపునొప్పివచ్చి బాధపడడూ? ఇంక సాధారణ ప్రజలంటావా? రాత్రికిరాత్రి వాళ్ళకి పిండివంటకాలెలా తెచ్చిపెడతావు? అంతేకాక ఇవాళ వారు ఎండు మెతుకుల మీదే బ్రతుకుతూ పెరుగుతున్నారనే సత్యాన్ని కాదనగలవా? ఒక్క ఉదాహరణ. నలుగురైదుగురు మామూలు ప్రజలు నీవంటివానిని ఆశ్రయించి రైల్లో ఆకస్మాత్తుగా రెండవతరగతిలో ప్రయాణించడం ప్రారంభించారనుకో. మూడు - నాలుగుగంటలు ఆగిన తర్వాత ఆపెట్టె చూస్తే ఎలాగుంటుంది. మట్టి బుట్టలనుంచి బటానీలు, వేరుశనగ కాయలపొట్టు,నీళ్ళు ఒకటేమిటి గలీజుగా ఉంటుంది. ఆ దృశ్యాన్ని ఒకసారి చూచినవాడు మళ్ళా మరువగలడా?

ఇంతకీ అసలు ఉన్నతసౌధంలో కూర్చొని పంచభక్ష్య పరమాన్నాలు తినడానికి ఒక యోగ్యత ఉంటుంది. దాన్ని ఆర్జించవలసియుంటుంది. ఈ విషయాన్ని నువ్వుకూడా కాదనవు. దీన్ని ప్రపంచంలో పెద్దపెద్ద తాత్వికులందరూ అంగీకరించారు. లేకపోతే లోపలికి ద్వారం తెరచి ఉంచబడిందని, బయటఉన్న జనమంతా లోపల ప్రవేశిస్తే మనం బ్రతకగలమా? అందుచేత ఇలాంటి ప్రమాదకరమైన అతి ఉదారత నెప్పుడూ ప్రదర్శించకు...

—♦—

(‘అనామీ’ చూడండి)

—...—

4 ఫాల్గుణం, 1339.

మంటూ,

నీ క్రొత్తపత్రిక ‘ఓరియంట్’ నాకు పంపు సుమా. నీ వ్యాసాలు అచ్చైతే వాటిని చదవడానికి నేనెంతో కుతూహలపడుతున్నాను. సాహిత్యరంగంలో నువ్వు నాకు చాలా ఋణపడిఉన్నట్లు వ్రాశావు. దేంట్లో అయినా కాకపోయినా సంయమంగురించిమాత్రం నావద్ద నేర్చుకున్నావు. ఋణపడడం సంగతి నాకు తెలీదు కాని వ్రాయడం మాత్రమే కష్టంకాదు, వ్రాయకుండా ఉండడం కూడా కష్టమని నీకు నేను ఇంతకుముందు చాలాసార్లు చెప్పాను. అంటే మనలోని ప్రతిశ్వాస, ఉద్రేకంకూడా వ్యర్థంగా పోకుండా, పాఠకులను పూర్తిగా సంతృప్తిపరచలేని సందర్భాలనువదిలి, వ్రాయకుండా వదిలిన వాటిలోనూ

తమభావ, బుద్ధి వికాసమునకు పాఠకులకు వీలుఏర్పరచాలి. నీ రచన వారికి సౌంజ్ఞ చేస్తుంది, దురాన్నుంచి చూపుతుంది. అంతేగాని భారమంతా మొయ్యోదుగదా. (శ్రీ)... ...గారు తన ఒక పుస్తకంలో మరణించిన పిల్లవాడి తల్లి దండ్రుల పక్షంనుంచి ఎంత అధికంగా అశ్రుధారలు ప్రవహింపజేశాడంటే, చివరకు పాఠకుడు చూస్తూ ఉండిపోయాడే గాని తాను కంట తడిపెట్టేఅవకాశం పొందలేకపోయాడు. రచనలో వ్యవధి లేకపోవడం సాహిత్యగౌరవాన్ని నష్టపరుస్తుది. హాస్యరసికులైన... బాబు బాగా వ్రాస్తారు. బాగా వ్రాయలేకపోవడం వారికి తెలియదు. వాస్తవంగా ఆయన గొప్పరచయితే. కాని వ్రాయకుండా ఉండడం అనే సౌంజ్ఞని ఆయన సరిగా గుర్తించలేకపోయారు. వారి పుస్తకాల్లో నీకీ విషయం కనపడలేదూ? అలాంటిసమయం లేకపోవడమే ...రచనల్లో కనబడుతుంది. పిల్లవాడు బాగా వ్రాస్తాడు. విదేశాలు వెళ్ళివచ్చాడు. కాని ఆ వెళ్ళిరావడమే క్షణకాలమైనా మరువలేడు. విదేశవిషయాలవల్ల అతని రచనల్లో అరుచికరమైన సందర్భాలు హెచ్చై పాఠకుని మనస్సు కష్టపడుతుంది. నా మేనమామసంగతి ఒకటి గుర్తుకువస్తోంది. ఒకసారి వైష్ణవోత్సవాలకు శ్రీ ఘామ్‌ఖేతురీ వెళ్ళాము. ఖేతురీ ప్రసాదంతింటే శూలనెప్పి తగ్గుతుందని మామయ్య నమ్మకం. స్టీమరులోంచి గంగానదినడ్డున అడుగుపెడుతూనే ఆయన 'ఆఁ!' అన్నారు. భయార్తమైన ముఖంతో ఒకకాలు ఎత్తి ఉంచారు.

ఏం జరిగింది?

మరొక పెద్ద విపత్తులో పడిపోయాను.

భక్తిలో లోపముంటే ఎక్కడైనా శూలనప్పి తగ్గదేమోనని ఆయనభయం. నీ 'దోలా' వ్యవహారంకూడా విదేశీయం. ఒకరోజున చాలా అధ్యాయాలు చదివాను. అందులో వ్యర్థమైన భక్తి విహ్వాలత్వం, అనవసర వివరణలు లేవు. అది చదివినమీదట ఇతనూ విదేశాలకు వెళ్ళాడు, చాలా విషయాలు తెలిసినవాడు కాని చెప్పే ఆతురతలేదు అనిపిస్తుంది...ఎవరైనా సవాల్‌చేసి రచనలో ఆతురత చూపమంటే దానికి సమాధానంగా, ఇలాంటివి చూపుటకు వీలులేదని రసిక పాఠకుల మనస్సులే అనుభవపూర్వకంగా తెలుసుకుంటాయి అనవలసివస్తుంది. శ్రీమతి...దేవి వ్రాసిన నవలలో వేదవేదాంతాలు, ఉపనిషత్తులు, పురాణాలు, కాళిదాసు, భవభూతి ఒకరేమిటి అందరూ దూరడానికి త్రొక్కిసలాడుతున్నారు. "చూడండి నే నెంత విదుషీమణినో, నే నెంత చదువుకున్నదానినో, నా కెంత తెలుసునో" అనే రచయిత్రి భావం ప్రతీ పంక్తిలోనూ కనపడుతోంది. ఇలాంటి అతిశయాలకు చోటుండరాదు. జీవితంలోనూ సాహిత్యంలోనూకూడా ఉన్నత భావాలు ఉన్నత తత్త్వాలు తీసుకుని సాగాలి. వర్షం కురిసింది, ఆకు కదిలింది; ఎర్రపువ్వు, నల్లనీను, తోటికోడళ్ళ తగాదాలు, వదినా మరదళ్ళ సరసాలు, లేక యింట్లో ఎన్ని బీరువాలున్నాయి, ఎన్ని సోఫాలున్నాయి, ఎన్ని దీపాలున్నాయి, స్టాండుమీది చీర లాంటివి ఎన్నివున్నాయి—మొదలైనవాటిరోజులు గడిచిపోయాయి. వాటి ప్రయోజనమూ అంతమైపోయింది. ఇదంతా

వ్రాతపేరసాహిత్యాన్ని మోసపుచ్చడం. నీరచనల్లో ఇవన్నీ ఉండవు. అందువల్లా, మరికొన్ని కారణాలవల్లా నీరచనలనుండి నే నెంతో ఆశిస్తాను. మంటూ! "రచయిత తన అంతరాళం లోనుంచి పుష్పంవలె విప్పిపెట్టినట్లు పాఠకునికి తోచిన రచనే ఉత్తమమైనది" అని నువ్వన్న విషయం నిజం. బెంగాలులో అందరూ మన పుస్తకాలలోని నాయికా నాయకుల కథ రచయిత స్వీయజీవితమని, స్వీయగాథ అని అందరూ అనుకుంటున్నారని నువ్వే అన్నావు. అందుచేతనే సజ్జన సమాజంలో నాకు వెలి!

—శరత్.

(అనామీ)

---

4 కార్తీకము - 1338.

మంటూ,

దేశోద్ధరణకొరకు సుభాసుదళంవారు నన్ను కొమిల్లా పంపారు. దారిలో ఒక పక్షంవారు 'షేం' 'షేం' అని అరిచారు. కిటికీల కన్నాలలోనించి బొగ్గుపుసి తలనిండా కొట్టి తను ప్రేమను తెలిపే మరొకదళం పన్నెండు గుర్రాల బగ్గీమీద ఊరేగించి బాగుదేముంది - అదేమీ లేదు-అదంతా మాయ అన్నాను. ఏది ఏమైనా నేను రూపనారాయణుని ఒడ్డుకు చేర్చాను. శ్రీ అరవిందుని 'విముక్త మానవుని' లో ఆశలేదు. 'The liberated man has no hopes' అనే సత్యాన్ని స్వీకరించుట కింక నే నేమీ వెనకాడను. బొగ్గుపిసికీ జై! పన్నెండు గుర్రాల బగ్గికి జై! 'శేషప్రశ్న' చదివి సంతృప్తి

చెందావని తెలుసుకుని సంతోషించాను. 'బాగుచేస్తాను. గర్జించి అశ్లీలాలే వ్రాస్తాను' అనేది అతి నవ్యసాహిత్యానికి లక్ష్యంకాదని ఒక ఉదాహరణ చూపాను.

(అనామీ)

—...—

సామతాబేడ్; పి. ఓ. పానిత్రాస్.
హౌరాజిల్లా.
22, భాద్రపదం 1336.

మంటూరామ్,

నీ పుస్తకం, చిన్ని ఉత్తరం అందాయి. నిన్నంతా చదివి పుస్తకం పూర్తిచేశాను. చాలా బాగుంది. ఒకటి రెండు లోపాలుకూడా ఉన్నాయి. భారతదేశంలోని గొప్ప వాయిద్య సంగీత ప్రవీణుల్లో నీ పేరు లేకపోవడంచూచి విచారించాను. కాని ఇది నీ యిచ్ఛాపూర్వకంగా జరిగిందనుకోని ఏమైనా ముందు దిద్దుకోగలవని నమ్ముతున్నాను. మర్చిపోకు. రాయబహద్దూర్ మజుందార్‌యొక్క 'రంగా జబా మూటో మూటో మూటో' గురించి ఎక్కడ వ్రాశావు? అది కూడా వుండాలి. ఆయన బాధపడి వుంటారని నే ననుకుంటాను. ఇంతవరకూ పుస్తకంలోని లోపాలు చెప్పాను. ఇక ఒక భేదాభిప్రాయం ఉంది.

శరీరారోగ్యం బాగుండనందువల్ల నీ కన్సర్ట్‌లోనికి వెళ్ళలేకపోయాను. మరొక కారణ మేమంటే మేదినీపురం జిల్లాలో ప్రతిసంవత్సరం ఎక్కడో ఒకచోట వరదలువస్తూనే

ఉంటాయి. రాకతప్పవు కూడాను. దీనికి ప్రభుత్వంకూడా ఏమీ చర్య తీసుకోలేదు. తీసుకోదుకూడా. ఈ వరదలు దేశంపై స్థిరమైన పన్నులాగ తయారైనాయి. ఇలా ప్రతి సంవత్సరం వరదబాధితులకు సహాయమనడంలో అర్థం ఏముంది? నీళ్ళు ఎక్కువ నిలిచిపోయాయని ఒక పారమట్టి రైలుకట్టమీదనుంచి తప్పితే ఊరుకుంటారా—పట్టుకుని ఖైదుకు పంపరూ! వరదబాధితులందరికీ తిండి బట్ట ఇవ్వడం కలకత్తాలోని నాగరికుల కర్తవ్యమంటావు. ఎందుకయ్యా అంటే వాళ్ళ ఇళ్ళల్లోకి నీళ్లువచ్చాయి. ఇంతేకాక పద్మ లంకల్లో ప్రజలు గుంపులుగుంపులుగా ఎందుకుంటున్నారో తెలుసా? వర్షాలకి వాళ్ళయిళ్ళు కొట్టుకుపోతే పశ్చిమ బెంగాలు ప్రజలు వారికి సహాయం చేస్తారని. కేవలం అందర్నీ చిక్కుపెట్టడానికే వాళ్ళు ఇలాంటి ప్రమాదకర స్థలాలలో నివసిస్తున్నారు. ఇదికాక వాళ్ళకి మరో ఉద్దేశ్యం లేదు. ఈ విషయంలో నీకు అభిప్రాయభేదముండదని నాకు తెలుసు. నువ్వు బుద్ధిమంతుడివి. సత్యమైన విష యాలను ఒప్పుకుంటావు.

నువ్వు విదేశాలకు వెళుతున్నావని పత్రికల్లో చది వాను. నీ ప్రయాణం నిర్విఘ్నంగా సాగాలనీ, నీ లక్ష్యం ఫలించాలనీ ఆశీర్వదిస్తున్నాను. నేను పెద్దవాడనై పోయాను. అందుచేత నువ్వు తిరిగివచ్చాక మనం కలుసుకోలేకపోతే చివరివరకూ నేను నీ శుభాన్ని కోరుతూ ఉన్నాననుకో. నువ్వు క్షేమంగా ఉన్నావనుకుంటాను.

—శరశ్చంద్ర చటోపాధ్యాయ.

తాజాకలం :—

వచ్చే 31, భాద్రపదానికి 50 వ సంవత్సరం వస్తుంది. కార్తీకం మొదట్లోనే మిమ్మల్నందర్నీ కలుసుకోడానికి కలకత్తా వస్తాను.

---

సామతాబేడ్, పాణిత్రాస్, పి. ఓ.
హౌరాజిల్లా.
6 ఫాల్గుణం 1333

చిరంజీవి మంటూ,

నీ ఉత్తరం అందగానే నే నెంత సంతోషించానో నువ్వు ఊహించలేవు కూడాను. నువ్వు నన్ను గౌరవిస్తున్నావు; ప్రేమిస్తున్నావు. ఇదికూడా నేను తెలుసుకోలేకపోతే ఈ ప్రపంచంలో మరేమి తెలుసుకోగలనంటావు ?

నీకు వీడ్కోలు ఇవ్వడానికి చేరినవారందరూ ఏమేమి మాట్లాడారో విన్నాను. నువ్వు విదేశాలకు వెళుతున్నావు కాని త్వరగా తిరిగిరావాలిసుమా. నువ్వు దగ్గరగా ఉండడం లేదనే విషయం నన్నెప్పుడూ బాధిస్తూనే ఉంటుంది.

'మనేర్ పరశ్' చివరిభాగం అంటే మూడవభాగం నాకు ఎంత బాగా నచ్చిందో చెప్పశక్యంకాదు. నిజమైన బాధలు, దుఃఖాల్లో ప్రపంచంలోని ప్రజలందరు ఎంత ఆత్మీయులుగా ఉంటారో నీ పుస్తకం చివర ఎంతో సహజంగా చిత్రించబడింది. అందుచేతనే నాకు చదువుతూన్నంతసేపూ నువ్వు ఎవరిదో యదార్థజీవితానికి చెందిన కథను లిపిబద్ధం

చేస్తున్నానని అనిపించింది. అయితే దీన్ని లిపిబద్ధంచేసే కౌశలాన్ని మరికొంచెం ప్రయత్నించి బాగా నేర్చుకోవాలి. నీ తండ్రిగారిని నే నెరుగను. కాని మానవుని బాధలను, ఆవేదనను అర్థంచేసుకునే వారిశక్తి అద్వితీయమైనదని వారి సన్నిహిత మిత్రులద్వారా విన్నాను. అదే నీకు వారసత్వంగా అబ్బి ఉంటుంది. దీన్ని నువ్వు రాత్రింబవళ్ళు నీ హృదయంలో పెంచి పెద్దదాన్ని చేయాలి. అప్పుడే ఇంకా గొప్పగా తయారౌతుంది.

సరే, నా ఉత్తరాల్లో ఏవికావాలంటే అవి ప్రచురించుకో, అనుమతిస్తున్నాను.

నువ్వంటే నా కెంతో ప్రేమ. ఇప్పుడేకాదు. చిన్నప్పటినుంచీ నువ్వు నీ స్నేహితులతో వచ్చి అల్లరిచేసి పూరీలు తిని పోతూఉండేవాడివి, అప్పటినుంచీకూడా.

ఈ జీవితంలో నీకు జయం లభించాలని, నువ్వు దీర్ఘాయుష్మంతుడవు కావాలని, ఆరోగ్యంగా ఉండాలని హృదయపూర్వకంగా ఆశీర్వదిస్తున్నాను.

శరశ్చంద్ర చటోపాధ్యాయ.

—...—

సామతాబేడ్, పాణితాస్.
భాద్రపదం, 1335.

చిరంజీవి మంటూ,

నీఉత్తరానికి చాలా రోజులనుంచీకూడా జవాబు వ్రాయలేదు. నీకు చాలాకోపం వచ్చివుంటుంది. ఒకనాడు

థియేటర్ రోడ్డుమీాదవున్న మీాయింటికి వెళ్ళాము. నువ్వూ లేవు, నీమామగారూ లేరు. అయ్యగారికోసం నిరీక్షించడం సాంప్రదాయసిద్ధం అవునో కాదో నిర్ణయించుకోలేకపోయాను. నాతో వచ్చినవారు చాలా తెలివైనవారు. మధ్యన గ్రీకింద ఆయన చాలామంది దగ్గరకు వెళుతూ వుంటారు. నోరు తెరచుకోని కూర్చుంటే ప్రయోజన మేముంది, కార్డుయిచ్చి వెళ్తే మంచిది అన్నారు. కాని నాకు కార్డు యెక్కడిది? అంచేత మాట్లాడకుండా తిరిగి వచ్చాము.

నిన్నరాత్రి మళ్ళా నీ 'దోధారా'ని ఎన్నోచోట్ల చదివాను. నిజంగా పుస్తకం చాలా బాగుంది. ఆషామాషీగా చదవడానికి వీలులేదు. శ్రద్ధగా చదువదగినది. కాని ఈ రోజుల్లో ప్రశంసాపత్రాలకు విలువలేదని తెలుసుగదా. వాటివిలువ తెలిసినవారే వాటిని అగౌరవపరుస్తున్నారు. అందుచేతనే వెంటనే ఏమీా చెప్పడంలేదు. అయితే నా మాటలమీాద నమ్మకముండేవారితో మాత్రం, ఈ మంటూ పుస్తకాన్ని మొదటినుంచి చివరవరకూ శ్రద్ధగా చదవండి అని చెప్పుతున్నాను. నావృత్తే అదిగదా! అయినా నే నింత వరకూ ఊహించని విషయాలెన్నో అందులో యిమిడి వున్నాయి.

'భారతవర్ష' (జ్యేష్ఠం 1335) లో నీ 'చాకర్' కథ చదివాను. కథలలెక్కలో యిది అంత గొప్పదికాదుగాని, నీలో ఒక విషయం ప్రత్యేకత పొందుతోందని తోచింది. అది సంభాషణలు. నీలో కథారచనా విధానం, సంభాషణల

ప్రవాహం ఈ రెండూ సమమైన రోజున నువ్వు నిజంగా గొప్ప సాహిత్యకారుడవైపోతావు. కాని, మంటూ, ఒక విషయం మరువకు. రచనల్లో వ్రాస్తూపోవడం ఎంత కష్టమో వ్రాయకుండా ఊరుకోవడంకూడా అంతకష్టమే. ఇది ఎవరికీ నేర్పలేము. దీన్ని ఎవరికి వారు స్వయంగా నేర్చుకోవాలి. నువ్వు త్వరగానే నేర్చుకోగలవని నాకు తెలుసు. ఇవాళ నిన్ను హేళనచేసేవారే ఒకరోజున బహిరంగంగా కాకపోయినా, కనీసం మనస్సులోనైనా ఈ సత్యాన్ని ఒప్పుకుని తీరుతారు. నా నిర్గమనసమయం దగ్గర పడుతోంది. కాని తర్వాతకూడా చాలారోజుల వరకూ నన్ను నువ్వు మర్చిపోకపోతే నేను చెప్పే ఈ విషయాలు నీకు గుర్తుంటాయి.

'శరత్ చంద్ర - గాల్స్వర్దీ' అనే వ్యాసం చదివాను. గాల్స్వర్దీ పేరు విన్నానేగాని, ఆయన పుస్తకం ఒక్కటీ చదవలేదు. అందుచేత ఆయనకీ నాకూ ఎక్కడ సామ్యం ఉందో, ఎక్కడలేదో నాకు తెలీదు. వ్యాసంలో నాప్రశంస, గాల్స్వర్దీవి ఎన్నోవాక్యాలు ఉన్నాయి. అందుచేత నాకేమీ అర్థంకాలేదు. అయితే అ... గాల్స్వర్ది పుస్తకాలు చాలా చదివిందనీ, గాల్స్వర్దీ ఎవరైనప్పటికీ ఆయన చాలా మంచి విషయాలు చెప్పారనీ, అవి చదవడంవల్ల జ్ఞానం పెరుగుతుందనీ తెలుసుకోగలిగాను.

అమ్మాయిజీవితం సుఖంగా లేదని విని చాలా విచార పడుతున్నాను. ఈ సమాజంలో స్త్రీజన్మ తప్పించుకోడానికి వీలులేని శాపంగా తయారైంది.

ఒకసారి బెర్ట్రాండ్ రస్సెల్ ది 'యాన్ అవుట్‌లైన్ ఆఫ్ ఫిలాసఫీ' అనే పుస్తకం చదివాను. పుస్తకం చాలాకతి నంగావుంది. గణితజ్ఞానం లేకపోతే పుస్తకంలోని చాలా భాగం తెలుసుకోవడం కష్టం. అలాగే నాకూ అర్థం కాలేదు. కాని వ్యక్తిలోని సరళత్వం, అంత గొప్పవ్యక్తి అంత తేలికగా వివరించుటకుచేసే ప్రయత్నాన్నిచూసి ముగ్ధులమైపోవలసివస్తోంది. జ్ఞానం తెలియని ప్రజలయెడ అందులో ఎంతోకరుణ నిండివుంది. ఓహో!— వీళ్ళు కొన్ని విషయాలైనా తెలుసుకోగలిగితే అని ప్రతిపంక్తి చదివి నప్పుడూ అనిపిస్తుంది. నిజంగా పండితులు జ్ఞానులు అయిన వారి రచనలోనూ, గంతులువేసేవారి రచనల్లోనూ ఎంత తేడావుందో అనుకుంటాను. వారిది హెచ్. జి. వెల్సు రచనలు ఒక దానిప్రక్క నొకటి పెట్టుకు చదివితే ఈ విష యం తెలుస్తుంది. పెద్దపెద్దవిషయాలు తేలికగా చెప్పడానికి ఎప్పుడూ ప్రయత్నిస్తూవుంటారు. రస్సెల్‌ది 'ఆన్ఎడ్యు కేషన్' కొన్నాను. రేపు చదవాలనుకుంటున్నాను. వచ్చే సంవత్సరం ఇంగ్లండు వెళ్ళగలిగితే ఒకసారి తప్పకుండా కలుసుకుంటాను.

ఒకరోజున చాలామంది పిల్లలు వచ్చారు. వారం దరూ నీ 'మనేర్‌పరశ్'ని చాలా ప్రశంసించారు. ఆ పుస్తకంగురించి నేను చెప్పినదంతా యదార్థమని వారంటూ వుంటే నాకు చాలా సంతోషం కలిగింది.

మామగారెలా వున్నారు? ఇప్పుడు నువ్వు ఎక్క డుంటున్నావో తెలీక ఈఉత్తరాన్ని మీ మామగారి

అడ్రసుకి వ్రాస్తున్నాను. నీకు అందగలదనుకుంటాను. నా స్నేహాశీర్వాదా లందుకో—

శ ర త్.

ఆటోగ్రాఫ్ కాపీ నేనే స్వయంగా ఒకరోజున వచ్చి యిస్తాను. పోలేదు, వుంది అని యజమానురాలితో చెప్పు.

———

సామతాబేడ్; పి. ఓ. పాణిత్రాస్,
హౌరాజిల్లా.
13–6–1925.

మ ం టూ,

నువ్వు సాధువైపోయి కూర్చోడానికి నీమీాద ఏమీా వారంటు లేదుగదా. చాలు, మరేమీా అక్కరలేదు. ఈ వుత్తరం అందగానే వచ్చేసేయి. అంతగా కాదంటే కొన్ని రోజులుండి మళ్ళా వెళ్ళిపోదువుగాని. దీనివల్ల నష్టం ఏమీా వుండదు. నేను అనుభవంగలవాణ్ణి; చెబుతున్నాను విను. నీవయస్సులో నేను నాలుగైదుసార్లు సన్న్యాసిగా తయారయ్యాను. ఆవేపు ఎక్కువ దోషములున్నట్లులేవు. లేకపోతే హిందూస్తానీవాళ్ళ వీపుమీాది చర్మంతప్ప మరెవరిచర్మం సహించగలదు! తమ్ముడూ ఇది బెంగాలీలు చెయ్యవలసింది కాదు. నామాటవిను. తిరిగి రా. నువ్వు వస్తే ఈ మాకు ఇద్దరం కలసి వుత్తర – దక్షిణదేశాలు రెండూ పర్యటిద్దాం. నువ్వు దగ్గరవుండకపోతే నా కంత మర్యాదావుండదు, తిండీ

తిప్పల యేర్పాట్లుకూడా సరిగా వుండవు. ఈ ఉత్తరం అంద గానే ఎప్పుడువస్తున్నదీ వ్రాయి. నేను స్టేషనుకు వస్తాను.

మరొక విషయం, వారీన్ ఏ చెట్టుఆకునైనా నీముక్కు మీాద వ్రాసి నీకు కావలసిన పువ్వువాసన వచ్చేటట్లు చేయ గలడట. అతను ఈ విద్యను కర్త (శ్రీ అరవిందులు) నుండి నేర్చుకున్నాడని ఉపేన్ వంద్యోపాధ్యాయ్ అన్నాడు. వచ్చే ముందు నువ్వది నేర్చుకుని రా. అతను నేర్పడానికి వెంటనే ఒప్పుకోడు. కాని నువ్వు వొదిలిపెట్టకు. కొన్నాళ్ళవరకూ వాళ్ళ అండమాన్‌వంశాన్ని బాగా పొగడు. పుస్తకాన్ని ఎప్పుడూ దగ్గరవుంచుకొని యిన్నాళ్ళబట్టీ యింకా దీన్ని చదవలేకపోయాను అని మధ్యమధ్య అంటూవుండు. ఇలా చేస్తే నువ్వా 'విద్య'ని చేపట్టగలవనుకుంటాను. ఉత్తరదేశం తిరిగేటప్పుడు అది బాగా పనికివస్తుంది.

అనివరణ్ మట్టిని పంచదార చేస్తాడని విన్నాను. అది ఎక్కువసేపు వుండకపోయినా 5, 6 గంటలవరకూ దృష్టికీ - రుచికీ పంచదారవలెనే వుంటుందట. దీన్ని తప్పకుండా నేర్చుకు రావడానికి ప్రయత్నించు. అకస్మాత్తుగా డబ్బు అయిపోతే పరదేశాల్లో - యాత్రల్లో - తెలిసిందా? తప్ప కుండా నేర్చుకురా. అనిలవరన్ చాలా మంచివాడు. నేర్ప డంలో చికాకుపెడితే భూత-ప్రేతాలకథలు చెప్పు. నిజంగా భూతాన్ని చూచానని ఒట్టువేసుకో. ఇంక దానితో నీ పాచిక పారుతుంది, సులభంగా ఆ 'కౌశలం' నీకు చిక్కు తుంది. ఈ రెంటినీ నేర్చుకుంటే ఇంక అక్కడ కష్టపడుతూ వుండవలసిన అవసరమేముంది ?

చాలా రోజులైంది నిన్ను చూచి. నిన్ను చూడాలని, నీ పాట వినాలనేకోరిక ఎక్కువౌతోంది. ఎప్పుడు వస్తావో వ్రాయి. నా స్నేహాశీర్వాదాలందుకో.—

—శరత్

తాజాకలం :—

'విద్య'లు నేర్చుకురా. సమయంకాని సమయాల్లో బాగా వుపయోగపడతాయి. ఏమైనా త్వరగా రా. సాధువు అవడం చాలా చెడ్డది మంటూ! నా మాట విను. ఈ రోజుల్లో ఇందులో ఏమీ మజా లేదు. ఎప్పుడు వస్తావో సరిగా వ్రాయి.

—...—

సామతాబేడ్, పాణిత్రాస్ పి. ఓ.
హౌరాజిల్లా,
4 ఫాల్గుణం, 1337.

చిరంజీవి మంటూ,

నీ ఉత్తరం అందినది. "మీకు నేనంటే అయిష్టంగా ఉన్నట్లుంది" అని నువ్వు వ్రాశావు. అయిష్టత అర్థం విరక్తి అయితే కానేకాదు అంటాను. నిజానికి నువ్వంటే నాకెంతో ప్రేమ. అందువల్లే నా జీవితం సమాప్తమైపోతున్నప్పుడు, ఈ జీవితంలో నిన్ను చూస్తానో లేదో అనిపించేటప్పుడు, నువ్వు భజనల సమాజంలో కలిశావంటే నిజంగానే నాకు కష్టంగావుంది. అందుచేత ఇవన్నీ అనవసరం. జీవితంలో ఎన్నో దుఃఖాలను సహించాను. వాటిల్లో ఇది ఒకటి.

నీ రచనలు చూస్తే నాకేమేమో ఆశలుంటాయి. కాని నువ్వు దీన్ని వదలివేశావే అని మనస్సులో చాలా బాధగా ఉంది. ఆశ్రమాల్లో ఉండి నువ్వు ఆపని చేయలేవు. జీవితంలో ప్రేమించకపోతే, కళంకాలు భరించకపోతే, దుఃఖాన్ని దిగమింగకపోతే, నిజమైన అనుభవాలను సంపాదించకపోతే, ఇతరులనుండి తీసుకున్న అనుభవాలకల్పన ఎంతకాలం సాహిత్యవస్తువై ఉండగలుగుతుంది కనుక ? ముక్కుమూసుకుని ప్రాణాయామంచేస్తే మరేమైనా వస్తుందేమోగాని ఇదిమాత్రం రాదు. తన జీవితం నీరసమై బెంగాలీ బాలవితంతువులా పవిత్రమై ఉంటే, ప్రారంభ జీవితంలోని ఉద్వేగంతో ఏమేమిచేసినా చివరకు బంజరు లాగ నిస్సారము, నిరుపయోగము అవుతుంది. నీ రచనల్లో కూడా అదే వచ్చేస్తుందేమోనని రానురాను భయం వేస్తోంది. రచయిత తన హృదయంలోంచి పూవునలె వికసింపజేస్తున్నట్లు పాఠకునకు తోచునట్లు చేయునదే ఉత్తమ రచన. నా అన్నిపుస్తకాలలోను నాయికా నాయకులది— ఇది రచయిత స్వీయజీవితమేనని ప్రజలు అనుకోవడం నువ్వు వినలేదా? అందుచేతనే సజ్జనుల సమాజంలో నాకు నెలి. ప్రజలనోట్లో ఎన్ని శృతులు వుంటాయో! నా విషయం అలాఉంచు. నీ గురించి ఆలోచిస్తే, మంటూ బాధిష్టరై రాలేదు. బాగా నేఉంది పరవాలేదనుకున్నాను. కుప్పలాది డబ్బు సంపాదించకపోతే, కార్లలో తిరగకపోతే, హైసర్కిల్సులో తిరగకపోతే ఏం! ఏమీలోటులేదు. ఉన్నదాంతోనే సాగిపోతుంది. కేవలం సాహిత్యం, సంగీతంద్వారానే నా

మంటూ దేశానికి ఎంతైనా సేవ చేయగలడు అనుకున్నాను. ఆ నిరానందమే దేశానికి సంతోషభోజనం; అదే మాకు చాలు. నేను మరోసంగతికూడా అనుకునేవాడిని. మంటూ దేశదేశాలలో తిరుగుతున్నాడు. అనేక జాతులు, అనేక సంఘాలు, అనేకరకాల ప్రజలతో గౌరవాన్వితమైన, స్నేహపూర్వకమైన బెంగాలీ సంబంధాలు స్థాపిస్తాడు.. అది అందరికీ తెలుసు – అందరూ ప్రేమిస్తారు – మంటూతో వెళ్ళితే గౌరవానికి లోటువుండదు, అనుకునేవాడిని. కాని ఆ ఆశ నిరాశ అయిపోయింది. శారీరకంగా, మానసికంగా, సాంఘికంగా ఏ విధమైన బంధనాలులేని స్వాతంత్ర్యాన్ని అనుభవించే వ్యక్తి నేడు కాలుకదపడానికి అనుమతి కావలసి వచ్చేటట్లుగా బానిసత్వపు పట్టా వ్రాసి యిచ్చాడు ! ఇదే అతని ముక్తిసాధన! దేశంపోయింది, అతని ఊహాకల్పిత స్వార్థం మిగిలి అదే అతని సర్వస్వం అయిపోయింది. నేనూ చాలా చదివాను, చాలా చూచాను, చాలా చెప్పాను – చేశాను – దీన్ని నేనుకూడా మరువలేను. అందుచేత ఎవరేం చెప్పినా ఒప్పుకోవాలంటే అనుమానం కలుగుతోంది. ఇప్పుడీ విషయంపై చర్చ అనవసరం. నా చిన్నప్పటి విషయం ఒకటి జ్ఞాపకంవస్తోంది. మామగారితోటి సర్ గురుదాసు గారి ఇంటికి దసరాల్లో వెళ్ళాను. వెళ్ళిచూస్తే సర్ గురుదాసు గారి నుదుటిమీద రక్తనాళాలన్నీ కోపంవల్ల ఉబ్బిఉన్నాయి. తెలిసినదేమంటే ఒకవిద్యార్థి వచ్చి 'గంగాస్నానంచేస్తే పాపాలన్నీ పోతాయనే విషయంలో తనకు నమ్మకంలేదు' అన్నాడట. అప్పుడు గురుదాసుగారు విసుగెత్తి "స్నానం

చెయ్యనక్కరలేదు, ఒడ్డున నుంచునే గంగ - గంగ అంటూ దర్శనం చేసుకుంటేనే అతనేకాక అతని ఏడుతరాలవరకూ పాపవిముక్తులై స్వర్గంలో ఉంటారు. ఇందులో అనుమానానికి తావేలేదు. ఈ శాస్త్రవాక్యాన్ని కాదనే పాతకుడెవరు? అంటూ కోపంతో ఇంట్లోకి వెళ్ళిపోయారట. నాకు బాగా గుర్తుంది. ఆ బాల్యంలోని నా గురుదాసేనా ఈయన? అనుకున్నాను. ఆ సమయంలో ఎం. ఏ. లో ఫస్టు; పెద్దవకీలు, పెద్ద జడ్జి. విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలర్ ఆయన. ఆయన పెద్ద నిష్ఠాపరుడు, సత్యవంతుడు. ఆయనేమీ మోసంచేయలేడు. తాను సత్యం అని నమ్మినదానికి గట్టిగా నిలబడ్డారు. అందుచేతనే అంత కోపిష్ఠులైనారు. ఇలాంటి విషయాలు తీసుకుని ఆలివర్ లాడ్జితోనూ చర్చించలేము. అలాగే మా ఆసామితోగాని, పడవవానితోగాని చర్చించలేము. దీన్నే మూఢవిశ్వాసం అటారు. దీన్నే అన్ని తర్కాలలోనుంచి, వాదనల పేచీల మధ్యనుంచి సత్యమంటారు. చదువు-సంధ్యలుఉంటే మాటల్లో కాస్తరంగులు పూస్తారు. లేకపోతే సూటిగా సరళంగా చెబుతారు. ఇంతే తేడా. ఆయనే గురుదాస్! నీతో ఇవన్నీ చెప్పడానికి భయం వేస్తోంది. ఎందుకంటే ఆశ్రమవాసులంతా కోపిష్టులని అందరికీ తెలుసు. వాళ్ళు మాటిమాటికీ తిట్లతో ప్రారంభించి కొట్లాటవరకూ సాగుతారు...నాకు ఆశ్రమం అంటే సదభిప్రాయం లేదు; కాని ప్రత్యేకంగా నాకు ఏ ఆశ్రమం మీదా కోపంలేదు. అన్నీ సమానమేనని నే ననుకుంటాను.

ఆశ్రమవిషయాలు పోనీ.....అసలు కావలసింది

నువ్వు. నిన్ను చాలా ప్రేమిస్తున్నాను. ఇది అబద్ధంకాదు. నిన్నుచూడాలని చాలా కోరికగాఉంది. నీపాటలు వినాలనీ, నీతో సరదాగా మాట్లాడాలనీఉంది. ముసలివాణ్ణి అయిపో యాను. ఇంక ఎన్నాళ్లు బ్రతుకుతానుకనుక? ఒకసారి ఇక్క డికిరావూ? నా ఆశీర్వాదాలు అందుకో.

శరశ్చంద్ర చటోపాధ్యాయ.

—...—

సామరాబేడ్, పాణిత్రాస్. పి. ఓ.
హౌరాజిల్లా.
30 వైశాఖము 1338.

చిరంజీవి మంటూ,

'శేషప్రశ్న' చదివి సంతోషించావని తెలిసి నేను చాలా ఆనందించాను. ఎందుకంటే మీకు సంతోషించే అలవాటులేదు. ప్రవర్తకసంఘంవారు (చంద్రనగర్లోని ఒక సాంస్కృతిక సమాజం) ఈ సంవత్సరం అక్షయ తృతీ యునిగా తిరిగి నన్ను పిలువలేదు. వాళ్ళు ఈ పుస్తకం చివర ఆశ్రమాన్ని కీర్తించమని కోరారు. కాని అది నావల్లకాలేదు. 'శేషప్రశ్న'లో అతినవ్యసాహిత్యం ఎలావుంటుందో సూచిం చాలని ప్రయత్నించాను. "బాగుచేస్తాను-గర్జించి అశ్లీలాలే వ్రాస్తాను" అనేది అతినవ్యసాహిత్య లక్షణం కాదు అని తెలుపుటకు ఇది ఒక ఉదాహరణ. కాని ముసలివాణ్ని అయ్యాను. నా శక్తి సామర్థ్యాలు పడమటికొండలకు చేరాయి. ఇక బాధ్యతంతా మీమీదే ఉంది. నీ రచన

లన్నీ నేను చాలా శ్రద్ధగా చదువుతాను. నీ గురించి ఉత్తరంలో రవీంద్రులు వ్రాసింది నిజం. త్వరితగతిని అభివృద్ధి కొచ్చే చిహ్నాలు స్పష్టంగా కన్పిస్తున్నాయి. అది బయట నుంచి ఎవరి దయవల్లనో కాదు. రక్తంతో వారసత్వంగా పొందిన నీలోని సత్యసాధనవల్లనే. పుదుచ్చేరిలో కాక కలకత్తాలో ఉన్నా సరిగ్గా ఇలాగే సంభవించవచ్చు.

మనం బుద్ధియుగపు సంతానమని అరవిందు లంటున్నారని నువ్వు వ్రాశావు నిజమే. నీ రచనల్లో ఈ సత్యం రానురాను ఉజ్వలమౌతోంది. అయినా నువ్వు జాగ్రత్తగా ఉండవలసినసమయం ఇప్పుడే వచ్చింది. సంభాషణలు చిన్నవిగాను, మధురంగానూ ఉండాలి. ఉపయోగంలేని అక్షరం ఒక్కటైనా ఉందని ఏ పరిస్థితులలోనూ అనిపించకూడదు. ఆర్టిస్టిక్ ఫారంయొక్క అసలురహస్యం ఇదే. తొలిసారి రచయితకు తాను అనుకున్నవన్నీ చెప్పలేక పోయాననే అనిపించవచ్చు. ఇక్కడే రచయిత అన్నిటినీ మించిన తప్పిదం చేస్తున్నాడు. పాఠకుడు అర్థంచేసుకోకపోతే పరవాలేదు గాని, ఇంకా ఎక్కువ అర్థంచేసుకోవాలి అనే గర్జన రచయితనుండి రాకూడదు. తెలిసిందా? అందుచేతనే కొంతమంది మంటూ రచనలలో మధ్యమధ్య తర్కవితర్కాలు ప్రబలరూపం ధరిస్తున్నాయని అంటున్నారు. చదువుతున్నది ఆలోచించి అర్థంచేసుకునేందుకు అవకాశం యివ్వకపోతే తన బుద్ధిప్రమాణాన్ని గుర్తించలేడు. అలాంటప్పుడు కోపంవస్తుంది. నేను సోమరిని. ఉత్తరాలు వ్రాయాలంటే జడుస్తాను. నువ్వు దగ్గరుంటే నీ రచనల్లోని

ఇలాంటివాటిని చూపించేవాడిని. నీ రచనలు చదువు తూండగా ఎన్నోసార్లు మంటూ ఇక్క డిలా ముగించిఉంటే ఎంత బాగుండేదో అనిపించింది.

నా వయస్సు అంత్యానికి వచ్చింది. రవీంద్రనాథులది కూడా అంతే. ఇంక మా తర్వాత బెంగాలీ నవలాసాహిత్యం దిగజారిపోతుందేమోనని అప్పుడప్పుడు అనిపిస్తుంది.

అలాంటప్పుడు నా కొక గొప్ప ఆశ ఉంటుంది మంటూ. ఎందుకంటే చెత్తనే సాహసమనుకుని పోటీపడి వ్రాసేవాడివికాదు నువ్వు. నీ చదువు-సంస్కృతి వేరు.

నీ క్రొత్తగీతాలను జాగ్రత్తగా చదివాను. చాలా బాగున్నాయి. సరే ఇది చెప్పు. శ్రీ అరవిందులు బెంగాలీ చదువుతారా? 'శేషప్రశ్న' చదవమని ఇస్తే కుపితులౌ తారా? ఇలాంటివి చదవడానికి వారికి సమయం ఉండదని తెలుసు. కాని చదవమంటే అవమానం అనుకుంటారా? ప్రవర్తకసంఘంవారు కోపం తెచ్చుకున్నారు. అందువల్లనే భయం వేస్తోంది. లేకపోతే వారిలాంటి పండితుల అభిప్రాయం తెలుసుకోవడానికి నా రచనాప్రవాహం మరొక మార్గం వెతికేది. నవలద్వారా అనేక యితర విషయాలు వినటానికి మనిషిని బలవంతపెట్టడం జరుగుతుంది.- ఈ విషయాన్ని అరవిందులు ఒప్పుకుంటారా? తేలికసాహిత్యం అనేదాని యెడల వారు విముఖులా?

షోడశి, రమ, హరిలక్ష్మి నీకు పంపుతాను. నా స్నేహాశీర్వాదాలందుకో.

—శరచ్చంద్రచటోపాధ్యాయ.

సామతాబేడ్; పాణిత్రాస్; పి. ఓ.
హౌరాజిల్లా.
6 భాద్రపదం. 1338.

చిరంజీవి మంటూ,

ఇంతవరకూ నీ ఉత్తరానికి జవాబివ్వలేదని నువ్వు పంపినవేమీ అసలు చదవలేదని అనుకోకు. శ్రీ అరవిందుని చిన్న చిన్న సందేశాలు, మీకుపంపిన ప్రశ్నలకు వారిచ్చిన సమాధానాలు ఇవన్నీ నువ్వు ఎంతో శ్రద్ధగా నాకుపంపావు. వాటిని నేను చదువుతున్నాను, వాటిమీద ఆలోచిస్తున్నాను; మళ్ళా చదువుతున్నా. అయితే చాలవరకు అర్థం చేసుకోలేకపోతున్నాను. అప్పుడప్పుడు వారు మానసిక చైతన్యంగురించి చెప్పే భిన్న భిన్న సూక్ష్మమైన పొరలు నా బుద్ధికి అందకుండాఉన్నాయి. కవిత్వం విషయమైకూడా వారిభావాలు ఒప్పుకోలేకుండా ఉన్నాను. ఉదాహరణకు చెప్పాలంటే, నీ కవితాసృష్టిలో వారు మంచివని చెప్పినవి నా దృష్టిలో మిగిలినవాటికంటే నిమ్నస్థాయికి చెందుతాయి. వాస్తవంలో ఆ యితర కవితలే భాషలో - భావంలో - ఛందస్సులో బాగున్నాయి. వాటిని ఏది వయస సక్రమంలో పెట్టాలంటే ఒకరి అభిప్రాయంతో మరొకరి అభిప్రాయం కలియదు. సరేకాని కొద్దిరోజులనుంచీ నువ్వు మనస్ఫూర్తిగా సాహిత్యసాధనలో మునిగిఉన్నట్లు కనపడుతోంది. ఇక నీ జయం నిశ్చయం.

నా జన్మదినసందర్భంలో నువ్వు వ్రాసిపంపిన గీతం కవిత్వం - హృదయం రెంటి దృష్ట్యా బాగున్నది. కాని

అతిశయోక్తి దోషం తగిలింది. అందుచేతనే అనుమానంగా ఉంది. ఆరోజున నళినీ సర్కార్‌కు (బెంగాలులో రాజకీయ వేత్త - పారిశ్రామికుడు) ఆ గీతం ఇచ్చి ఇది మీరు పాడితే మంటూ బాగుంటుందన్నాడు అన్నాను. ఆయన స్వరలిపి కొరకు నీకు వ్రాయవచ్చు. రేడియోవారు జన్మదినోత్సవ సందర్భంలో ఆ గీతాన్ని నీ పేరుతో ప్రసారంచేస్తామంటు న్నారు. దాన్ని పాడేది నళిని. సరే. నా షోడశినిగ్గైరా పుస్తకాలు నీకు హరిభాయి పంపారా? నేను ఉత్తరం వ్రాశాను.

నేను నీకు ఇంకా విషయాలు వ్రాయాలనుకున్నాను. కాని యింక సమయంలేదు. పోస్టుటైం అయిపోయింది.

. నీ ఆ పాతఉత్తరాలు, కాగితాలు అన్నీ రేపో, ఎల్లుండో పంపుతాను.

ఇది విను- వెనకబడిన వర్గాలతరఫున 'పరిచయ్' అనే త్రైమాసపత్రిక వచ్చింది. అందులో నీ మిత్రులు నీ... (నీరేంద్రనాథ్‌రాయ్, బెంగాలీ విమర్శకుడు. వంగవాసి కళాశాల ఆంగ్లభాషాధ్యాపకులు) శేషప్రశ్న సమీక్ష వ్రాశారు. బహుశ నువ్వు చదివే ఉంటావు. దాని సారాంశ మేమింటే ఇది గోరా (రవీంద్రనాథ్ నవల) కొడుకట. అందుచేతనే 'కమల్' చరిత్ర గోరాకి నకలు తప్ప వేరు కాదట. అంటే కామెర్ల రోగికి ప్రపంచమంతా పచ్చగా కనిపించినట్లు ఈయనకూడా కలంపడుతున్నాడు. స్వంత పత్రిక ఉందికనుక వ్రాసింది అచ్చుఅవుతుందే అని విచారించ వలసివస్తోంది. ఫ్రెంచి, జర్మన్ భాషలు వచ్చునని గర్వం.

చివరికి అనుప్రాసలాంగ - ఓ భగవంతుడా! కృప నిర్మాణవి కాక ఉపకారం చెయ్యి - లాంటివి.

ఇంక ఒక క్షణంకూడా సమయంలేదు. ఆశీర్వాదాలందుకో.

— శరత్ చంద్ర చట్టోపాధ్యాయ.

---

సామతాబేడ్, పాణిత్రాస్,
హౌరా,
విజయదశమి. 4 కార్తీకం 1338.

మంటూ,

నా విజయదశమి ఆశీస్సులందుకో. చాలారోజుల నుంచీ ఉత్తరాలు వ్రాయలేదు. అందుకు పశ్చాత్తాప పడుతున్నాను.

ముందు అసలువిషయాలు పూర్తిచెయ్యనీ. 'దోలా' (దిలీప్‌కుమార్ నవల) మొదటిపేజీలు కొన్ని దీనితో పంపుతున్నాను. నాగరి నడపబోయే ఈ ఆడంబరాన్ని చూచి 'ఆర్యా! మీ బిచ్చంతో విసుగెత్తిపోయాను. మీ కక్కను పిలుచుకోండి. నా మిగిలిన వ్రాతప్రతి తిరిగి యివ్వండి' అని నువ్వు సమాధానం వ్రాస్తావేమో. నా వైపునుంచికూడా దీనికేమీ వాదన సమాధానం లేదు అనుకోకు.

నీలాగానే నేనుకూడా ఆ కొన్ని నినాదాలను ఒప్పుకోను. కళ కళకొరకే, మతం మతంకొరకే, సత్యం సత్యం కొరకే మొదలైనవి. కళనుండి ఫలితం అందరికీ ఒకలాగే

ఉండదు. అది లోపలినస్తువు. ఒక సౌంజ్ఞని నిర్దేశించడం దాని తర్వాత దానినే ఒక్క ఊపు ఊపడం మంచిదికాదు. ధర్మం, సత్యం మొదలైనవి శబ్దాలుమాత్రమేకాదు. అంతకంటే ప్రత్యేకవిశిష్టత ఉందని గుర్తుంచుకోవాలి. కథయొక్క ఉద్దేశ్యంకూడా మనోరంజకం అంటే, అందులో మనస్సు-రంజింపబడుట అనే రెండుశబ్దాలు ఇమిడివున్నాయని ఒప్పుకోవాలి. డాక్టర్ జితేంద్రమజుందార్ యం.డి., మంటూరాన్ ఇద్దరిమనస్సులూ ఒకటికాదు. ఒకరిమనస్సు ఒక విషయం వల్ల ఆనందంతో ఓలలాడితే అదేవిషయం మరొకరి మనస్సును కదల్చలేకపోవచ్చుకూడాను. బాగా చదువుకున్న ఒకాయన 'దోధారా'ను 10 -15 పేజీలకంటె ఎక్కువ చదవలేకపోయారు. మరి నేను ఆపుస్తకాన్ని ఎలాపూర్తిచేయగలిగానో అర్థంకాలేదు. కథారచనా నిబంధనలు అందులో ఎంతవరకూ ఉల్లంఘించబడ్డాయో నాకు తెలియదు, తెలుసుకోవాలనే కోరికాలేదు. సంతోషించాను, సంతృప్తికలిగింది, యిది ఒక తథ్యము. అయినా కళ అంటే ఏమిటి అని వాదిస్తే నాకదేమీ తెలీదు. అందుచేత ఊరుకుంటాను. అంతేకాని ఈ 56 సంవత్సరాల వయస్సుగల మనస్సు రాజీపడలేను. అందుచేత ఎలాగో ఓలాగ నాగలి త్రిప్పటానికి కాదు నా మాటలు. నువ్వు చాలా ఆలోచించివ్రాసిన విషయాలు నవలారచనలో అక్కర్లేదని నేననను. కాని, నామనస్సులో నవల వ్రాయడమంటేగల అభిప్రాయాల ప్రకారం 'స్వపన్' పాత్రపోషణగురించి ఆలోచిస్తే చివరిభాగాలలో మొదటిభాగాలంత సమంజసాన్ని కలిగిలేవనిపిస్తోంది. ఇంతేకాక

ప్రారంభంలో పుస్తకాన్ని కుదించాలి. ప్రారంభం చదవటంలో నచిపోకుండా చూడడం ఒక నిపుణత్వం. మరొక విషయంవుంది మంటూ. వ్రాయడానికి కూర్చుని వ్రాయడంకంటే అవసరమైనప్పుడు ఆపివేయడం చాలాకష్టం... వంద్యోపాధ్యాయ నిజంగా గొప్పరచయితే కాని ఎక్కడ ఏది వ్రాయకూడదో ఆయనకి తెలియదు. ఈవిషయం నువ్వు వారి పుస్తకాలలో చూడలేదా? నాకు వారి పుస్తకాలు చదువుతూవుంటే యిదే అనిపిస్తుంది. దీన్నే వ్రాతలో సంయమనం అంటారు. ఆవేశం కొందరపాటులో చెప్పవలసిన విషయం ఒక అడుగు వెనకవున్నా పరవాలేదుగాని, ఎప్పుడూ ముందువుండకూడదు. నీకు యింతగా తగ్గించడం యిష్టంలేకపోతే నీకుదగ్గరగావున్న సాహిత్యమిత్రులను అడిగిచూడు. అయితే యిప్పుడు తీసివేసిన అంశాలే పుస్తకం చివరికి వచ్చేసరికి మరొకచోట నేనే చేర్చవచ్చునేమో. ఏమైనా నీ అభిప్రాయం తెలుసుకోవడం అవసరం. అప్పుడు దీన్ని సవరించడం ఎంతోసేపు పట్టదు.

నీ నీ ... వుత్తరాలు చాలా శ్రద్ధగా చదివాను. నేనంటే నీకు ఎంతో గౌరవం, ప్రేమాను. అందుచేతనే అవి నీకు చాలా బాధ కలిగించాయి. కాని దానివల్ల ఫలితం ఏమీ వుండదుగదా. వారికున్న కొండంతగర్వంలో వీసమెత్తైనా తగ్గుతుందని నాకు నమ్మకంలేదు. ఇంక ఆప్ ... విషయమంటావా ? అతనెంత నీచుడో ఊహించలేము కూడాను. వాదవివాదాల్లోకూడా నాపేరు ప్రక్కన అతని పేరు శోభిస్తుందా అని ఆలోచిస్తే నా మనస్సు సిగ్గుతో

కుగిపోతోంది. దేశంపై పెద్ద దెబ్బతీసి విదేశీపాలకులకు తోడ్పడిన దేశీయుల లెక్కలోకివస్తాడు. ఇది కొంతకాలం ఆగితే నీకే తెలుస్తుంది.

త ... ని ఒకసారి త్వరగానే కలుసుకుంటాను. నువ్వు అతన్నిగురించి నాకు వ్రాశావని చెప్పను. కాని నువ్వు వ్రాసిన విషయాలను ఆధారంచేసుకుని మాట్లాడి నిజం తెలుసుకొనుటకు ప్రయత్నిస్తాను. త... ఏమిచెబు తాడో చూస్తాను. శ్రీ అరవిందులనుగురించి నేనెక్కడా ఏమీ అనలేదు. దేశంలో అందరూ ఆయన్ని గౌరవిస్తూ వుంటే, నేనొక్కడినేగా గౌరవించకుండా వుండేది. కాని ఆశ్రమవాసులయెడ నాకు సదభిప్రాయం లేదు. త... చెప్పినవిషయాలు, ఇతర ఆశ్రమవాసులగురించి నాకు తెలి సిన విషయాలే ఇందుకు కారణాలు. తర్వాత నువ్వు వెళ్ళి పోవడం నాకు చాలా కష్టంగావుంది. నువ్వు ఐ. సి. యస్. చదవకుండా తిరిగివచ్చినపుడు చాలా కష్టమనిపించింది. కాని సంగీతాన్ని, సాహిత్యాన్ని అనుసరించినపుడు ఆ కష్టం కొంత తగ్గింది. అందరూ వుద్యోగాలు చేసి, బారిష్టర్లయి దేశభక్తులను జైలుకు ఎందుకు పంపాలి? అని అనుకు న్నాను. గుంటూరుకు తిండితిప్పలకు లోటులేదు. అలాంట ప్పుడు విదేశీయుల దృష్టిలో దేశీయ కళాసంపదకు గౌరవం తేగలిగితే, తన బుద్ధిద్వారా క్రొత్తమార్గాన్ని సృష్టిస్తే దానివల్ల దేశానికి లాభం వుండదా, గౌరవం రాదా? అని పించింది. విదేశీయులవద్ద 'సింఫోనీ' అనేది వుంటుందనీ అది చాలా గొప్పదనీ, దాన్ని దేశీయసంగీతంలో ప్రవేశపెట్టా

లనీ నువ్వే ఒకసారి అన్నావు. ఆ తర్వాత అకస్మాత్తుగా నువ్వు అన్నీ వదలి విరాగివై వెళ్ళిపోయావని విన్నాను. అప్పుడు నాకు ఏదో పెద్ద నష్టం వాటిల్లినట్లనిపించింది. ఈ జీవితంలో నిన్ను మళ్ళీ చూడలేనేమోననేది కాస్త దుఃఖమంటావా? మరెవరు నమ్మినా నమ్మకపోయినా నాకీ దుఃఖం కలకాలం వుంటుందని నీకు తెలుసుననుకుంటాను.

ఒక చిత్రమైనసంగతి విను మంటూ, ఒకరోజున పని మీద బ్యాంకుకు వెళ్లాను. అక్కడ క్యాషియరు బెంగాలీ ఆయన. ఆయన పెద్ద జ్యోతిష్కుడని విన్నాను. చాలా శ్రద్ధగాను, త్వరగాను ఆయన నా పని పూర్తిచేసి నా జాతకచక్రం అడిగారు. జాతకం లేదుగాని, నా నోటు బుక్కులో రాసివుంది అన్నాను. దాన్ని ఆయన వెంటనే వ్రాసుకుని, నా చేతిలోని రేఖలు చూచి ఏదో లెక్కలు వేశారు. ఏం చెప్పారో తెలుసా? ఒక సంవత్సరంలో 'మీరు మరొకదారి తొక్కుతారు' అన్నారు. మరోదారి అంటే అని అడిగాను. ఆధ్యాత్మికమార్గం అన్నారు. జాతకంలో అలావుందని కాశీలోని పండితులూ అన్నారు. కాని నాకు దానిమీద ఆవగింజంతైనా నమ్మకంలేదు. నాకు ఆధ్యాత్మికంలోని 'అ, ఆ'లు కూడా రావు అన్నాను. ఒక సంవత్సరం తర్వాత మళ్ళీకలిస్తే అప్పుడు సమాధానమిస్తానన్నారు. సంవత్సరం తర్వాతకూడా నానోట మీరు ఇదే వింటారు అన్నాను. ఆయన తలూపారు. జాతకచక్రం లెక్కలు వేస్తే ఇక అది తప్పకారాదని ఆయన విశ్వాసం.

మంటూ, ఒకసంగతి : నువ్వు ఇంతకుముందే విని

ఉంటావు. నా వంశానికి ఒకచరిత్ర ఉంది. మా ఈవంశంలో నా రెండో అన్నగారు (ప్రభాస్) స్వర్గీయ స్వామీ వేదానందనుండి వరుసగా 8 తరాలవరకు సాధువులవుతూ వస్తున్నారు. నేనే ఘోర నాస్తికుడనుగా తయారయ్యాను. వంశానుగత ఆనువాయితీ నా రక్తంలో ఎదురు తిరిగింది. అందుచేత జీవితంలో 55 సంవత్సరాలు దాటినతర్వాత క్రొత్తశిష్యులను సంపాదించగలమనే ఆశ కూడదు. కాని ఆ క్యాపియరుకి నేను బైరాగినవుతాననే గట్టి నమ్మకం !

నీ అనిలవరన్ మట్టిని పంచదార చేస్తాడని విన్నాను. ఆశ్రమానికి కావలసిన పంచదార అంతా అతనే సప్లయి చేస్తాడట. నిజమేనా ? నాకు నమ్మకం లేదు. ఎందుకంటే అంత శక్తిఉన్నవాడు ఆశ్రమంలో ఎందుకుంటాడు. కలకత్తావచ్చి తేలికగా ఒక పంచదార దుకాణం పెట్టేసేవాడు.

బారీన్‌ని తరచు కలుసుకోవడం జరుగుతోంది. అతనింక ఆశ్రమానికి ఎప్పుడూ వెళ్ళనంటున్నాడు. అక్కడుండే కఠిన నియమాలమధ్య అతని ఆత్మ పంజరాన్ని వదలిపోనందుకు సంతోషించాలి. మీ 'మదర్' అంటేమాత్రం అతనికి చాలా భక్తి. అలాంటి అద్భుతవ్యక్తిని ఎక్కడా చూడలేమని అంటాడు. ఆమె సూక్ష్మదృష్టి అద్భుతమైనదంటాడు. విపరీతమైన కార్యశక్తి, క్రమశిక్షణతోపాటు ఆమెకు అంత సూక్ష్మబుద్ధికూడా ఉంది అంటాడు. ప్రతి వ్యక్తికి సంబంధించిన ప్రతివిషయం ఆమెదృష్టిలో పడి తీరుతుందనీ, వారి ఆదేశాలు ఉపదేశాలుకాక ఇంకేమీ అమలు జరగడానికి వీలులేదనీ, అందుచేత బయటనుంచి

ఒక్కసారిగా అక్కడికి వెళ్ళినవాళ్ళు రకరకాల అభిప్రాయాలతో తిరిగిరావడం జరుగుతూ ఉంటుందనీ ... అన్నాడు.

'దోలా'లోని కొట్టివేతలు అర్థంచేసుకొంటూ చదువు. ఒక్కసారి కోపం తెచ్చుకోకు. నే నిప్పుడు కొట్టివేసినవన్నీ అవసరమైతే చివర నేనే కలుపుతాను. ఏమైనా ఈ విషయంలో నువ్వు ఏమైనా చెప్పదలచుకుంటే నాకు కాదు రవీంద్రనాథ్‌కే. మరొకసారి నా విజయదశమి స్నేహాశీస్సు లందుకో.

శరచ్చంద్ర చట్టోపాధ్యాయ.

తాజాకలం:—

అనిలవరన్ పంచదార తయారుచేసే విషయంగురించి తప్పకుండా వ్రాయి. పంచదార నిజంగా తయారు చేయగలిగితే మనం జావా పంచదారను ఆపివేసుకోవచ్చు. ఇది పెద్ద దేశసేవ కాగలుగుతుంది.

—...—

సామతాబేడ్; పాణిత్రాస్. పి. ఓ.
10 చైత్రము, 1339.

చిరంజీవి మంటూ,

నేను సోమరిని కాదు. ఈమాటు నిజంగా తఫ్సీలు ఇచ్చుకుంటున్నాను. రెండు సంవత్సరాలక్రిందట జైలులో తలుపుకి నా మోకాలు తగిలి పుండుఅయింది. దానితో ఏదో అలాగే యింతకాలం ఈడ్చుకొస్తున్నాను. కాని నెలా పదిహేనురోజులనుంచి మంచంపట్టాను. నిజంగా

మంచంమీదనుంచి లేవడంలేదు. ఎక్సు-రే తీయించుకో డానికి రేపు కలకత్తా వెళుతున్నాను. రవీంద్రజయంతి అనంతరం నెలా పదిహేను రోజులు అసలు రాత్రిళ్లు నిద్రే పట్టలేదు. రాత్రింబవళ్లు ఒకటే మేకులు గుచ్చుకున్నట్లు బాధగా ఉంటోంది. బాగుపడతానో లేదో నమ్మకంలేదు. పోనీ అవన్నీ, తిరిగి లేవలేకపోయినా ఒకవిధంగా బాగానే ఉంటుంది. నా అంతిమయాత్ర సమీపంలోనే ఉన్నట్లని పిస్తోంది. నీకు ఉత్తరం వ్రాయడంలేదన్నమాటేగాని నువ్వు పంపుతున్నవన్నీ చాలా శ్రద్ధగా చదువుతున్నాను. ఒక్కొక్కప్పుడు ప్రేరణఉంటుంది, మరొకప్పుడు ఉండదు. కాని నీలోని ఆశ, విశ్వాసం, నిష్ఠ, గంభీరత్వం ఇవన్నీ నాకెంతో బాగా కనిపిస్తున్నాయి. ఇంతబాగా కనిపించ డానికి కారణంకూడా తెలీదు.

నీ "జలాంత్-కే-ప్రేమ్‌బీజ్" ప్రహసనం చదివాను. కలకత్తానుంచి తిరిగిరాగానే త్రిప్పిపంపుతాను. బాగా సాగింది. కాని దానిజీవితం తక్కువ. అందుచేత రచననికూడా చిన్నదిచేస్తే మంచిది. చిన్నదైతేనే రసం బిగిగా ఉంటుంది. ఇది నువ్వు ఒప్పుకోవాలి.

'శిశిర్' 'భాదుడీ'ని అభినయిస్తారనే దానిపై నమ్మకం పెట్టుకోకు. తిరిగివచ్చి అన్నిసంగతులూ వ్రాస్తాను. పడుకుని ఉంటే కలం సాగడంలేదు.

శ్రేయోభిలాషి.
శరచ్చంద్రచటోపాధ్యాయ.

—...—

ది 5 జ్యేష్ఠము 1340.

చిరంజీవి మంటూ,

చాలారోజులనుంచీ నీకు ఉత్తరం వ్రాయాలనుకుంటున్నాను గాని వ్రాయలేకపోయాను. ఇవాళ కలం చేతబట్టాను. ఏదో కొంత వ్రాస్తాను.

...'అభయా' వాటి సంబంధంలో 'శ్రీకాంత్' ఐదవ అధ్యాయాన్ని పూర్తిచేస్తాను. నాలుగవ అధ్యాయం బాగుండలేదని మీరందరూ అంటే కథం యింతటితో తే ఆగిపోతుంది.

కాని ఈ సందర్భంలో నా తరఫువాదనకూడాఉంది. సాధారణమైన, సహజసంఘటనతో ఈ అధ్యాయాన్ని ముగిస్తాను. దానివల్ల సాహిత్యసంయమంతో కొద్దిమాటలతో అన్నిదిశలనుండీ ఎంత రసస్పష్టి చేయగలనో పరీక్షిస్తాను. లక్ష్యము, సాధనముల ఆధిక్యతతో కాక, అసాధారణ సంఘటనలవల్లనూ కాక, అతిసాధారణ గ్రామీణసంఘటనలతో ఈ పుస్తకం పూర్తిఅవుతుంది. విస్తృతంకాక గంభీరంగా ఉంటుంది. పుంఖానుపుంఖ వివరణకాక, సూచనప్రాయంగా ఉంటుంది. రసికుల ఆనందంకోరకే ఇది. ఎక్కడనుంచి ఎంతవరకూ జరిగిందో తెలీదు. కాని నవలా సాహిత్యాన్ని గురించి నాకు తెలిసినంతవరకూ ఏమిబాగున్నా బాగుండకపోయినా, కనీసం సంయమంగాఉండి, విశృంఖలత్వం కనపడనీయను. నీ అభిప్రాయంకూడా తెలుపు.

మరొక విషయం. ఆ ఆశ్రమంలోనికి వెళ్ళినతర్వాత నీ అధ్యయనం విశాలంగా, దూరదర్శికంగాను మారినట్లే

అంతర్ముఖంగాను, గంభీరంగాను సాగుతున్నదని నేను గుర్తించాను ఎందుకంటే నీ పాండిత్యం, జ్ఞానం అంత శాంత మైనవి, వినయపూర్వకమైనవీను. నీమీద ఎన్ని దెబ్బలు పడ్డా నువ్వుమాత్రం ఇతరులమీద నీ పాండిత్యపు లాఠీని ప్రయోగించలేదు. ఈవిషయంలో నువ్వు పరీక్షింపబడుతున్న కొద్దీ రాటుదేలుతున్నావు. నా జాతికి చెందుతున్నావని చాలా ముగ్ధుణ్నైపోతున్నాను. సామర్థ్యం ఉంటికూడా ఊరుకోవడం, సహించడం చాలా గొప్పవిశేషం. అంతే కాని నోరు చెడగొట్టుకుని ఇతరులను అవమానించడానికి, వారిమీద దాడిచెయ్యడానికి ముందుకురాకు. నీకేమీ భయంలేదు; మిత్రులనుగురించి చింతాలేదు. ఐంటూ! సాహిత్యసేవకులైకూడా స్వీయమిత్రులను తిడుతూ తిరస్క రించేవారంటే నాకు చాలా భయం. ఇతరులను అవమా నించినంత మాత్రాన్నే తమ గొప్పతనం స్పష్టంకాదని తెలుసుకోలేకపోతున్నారు. దానికి ఇంకా యితరత్రా జ్ఞానం కావాలి. అది అంత తేలికైన పనికాదు.

'పుష్పపాత్ర' పత్రికలో నీ రచన చదివాను. అందులో ఎన్నో యితర విషయాలతోపాటు నువ్వు బూ.. ......యొక్క స్త్రీ విద్వేషాన్ని ఎదిరించావు; దానికి కారణాన్ని కనిపెట్టావు. అతనంటే నీకు ప్రేమ. మీ స్నేహంలో అడ్డు తగులుతాయేమోనని నాకు భయంగా ఉంది. నీవు చాలా ఆంతరంగికవిషయాలు తెలుసు కోవాలి. సాహిత్యసృష్టియొక్క అంతరాళంలోవుండే స్రష్ట చిన్నవాడవుతున్నకొద్దీ సృష్టిలో సంకుచితతత్వం వస్తుందని

ఎవరో వ్రాశారు. ఈవిషయాన్ని నేనూ నమ్ముతాను. సావిత్రి వంటి హాస్టలు పనిమనిషి దొరికితే నేను హాస్టలులోనే పడి వుంటానని బూ......వ్రాశాడు. కాని హాస్టలులోపడి ఉంటేనే చాలదు — సతీష్‌గా కూడా తయారుకావాలి. లేకపోతే జీవితమంతా హాస్టలులోనే గడిపినా సావిత్రి హృదయాన్ని జయించలేడు. అంతేకాక సావిత్రి నిజంగా పనిమనిషిజాతికి చెందినదికాదని అతని నమ్మకం. లక్ష్మీదేవి కూడా ఒకసారి కష్టాల్లోపడి బ్రాహ్మణుని యింట దాసీపని చేసినదని పురాణాల్లో వ్రాసివుంది. పంచపాండవులలో అర్జునుడు ఉత్తరకు నృత్యం, గానం నేర్పినప్పుడు వారి సంభాషణలు విని ఇలాంటి గురువుదొరికితే ఆడపిల్లలందరూ నృత్యం-గానం నేర్చుకోవడానికి పిచ్చివాళ్ళైపోతారనీ చెప్ప లేము. అన్ని సాంప్రదాయాలలోనలెనే వేశ్యల్లో కూడా నిమ్నోన్నతాలుంటాయి. వేశ్యనద్ద పనిమనిషిగాఉండే వేశ్యయొక్క - నడత ఆమె యజమానురాలి నడత ఒక్కలాగానే ఉండకపోవచ్చు. దీన్నిగురించి అనుభవం సంపాదించుటకు రూపాయి — అర్ధ ఖర్చులోనే సరిపెట్టు కోవచ్చు. కాని లోతుగా తెలుసుకోవాలంటే చాలా ఖర్చుచేయవలసిఉంటుంది. తేలికగా కాదు. రంగుపూసు కుని వాళ్ళందరూ వీధి అరుగులమీద కూర్చొంటారు. నువ్వు మధురభాషిణి సుశీలాబాయిని (రాజ్యలక్ష్మి) గురించి వ్రాశావు. ఆమెను అందరూ చూడగలరా? దానికి అనేక ప్రయత్నాలు లేకపోతే పనికాదు. తన డబ్బుగాని లేక ఏదైనా రాజకుమారుని ధనంగాని విరివిగా ఖర్చు కాకపోతే

పై అంతస్తులకు ప్రవేశాధికారమే లభించదు. లేకపోతే రోడ్డుమీద చెయ్యిపుచ్చుకుని ఏ కూలిపోతున్న పెంకు టింట్లోకో లాక్కుపోయేవారి పరిచయంమాత్రమే లభిస్తుంది. బీదవారి అనుభవం ఇలాంటి నిమ్నస్థాయివారిలోనే పరిమితమై ఉంటుంది. అందుచేత అతను శ్రీకాంతలోని టగర్ బాడీనాలీని మాత్రమే గుర్తిస్తున్నాడు. ఈ ఉదాహరణలన్నీ అనవసరం. వ్రాయడానికి సిగ్గుకూడా వేస్తోంది. కాని గ్రుడ్డిగా స్త్రీజాతిని ఎదిరించడమే యదార్థవాదం అనుకునేవారిలో ఆదర్శవాదం అసలే లేదు సరిగదా యదార్థవాదం కూడా లేదు. ఉన్నదల్లా నటన, పోటీ - తెలియని అహంకారం. స్త్రీలకు వ్యతిరేకంగా తగాదాలు పెంచాలనే ఆవేశంలో ఎప్పుడూ సాహిత్యసృష్టి కాదు...

నా హృదయపూర్వక స్నేహాన్ని, శుభచింతనను అందుకో. సాహానా కలిస్తే నా ఆశీస్సులందజేయి.

—శరత్ బాబు.

—...—

సామతాబేడ్, పాణిత్రాస్.

హౌరాజిల్లా.

10 భాద్రపదం. 1340.

చిరంజీవి మంటూ.

నీ ఉత్తరం అందింది. శ్రీకాంత నాల్గవఅధ్యాయంపై నువ్వు వ్రాసిన వ్యాసం ఇంతకుముందే అందింది. మొదట్లో వ్యాసం పెద్దదైనదని కోతఅవసరమని అనుకున్నాను. కాని

రెండుమూడుసార్లు చదివిన తర్వాత ఈ వ్యాసంలో తర్కించ వలసినదేమీ లేదనిపించింది. నా పుస్తకాన్ని గురించి వ్రాశావు కనుక నా కది నచ్చిందాలేదా అని నా మన స్సులో అనుక్షణం ప్రశ్న ఉదయించిది. ఎంతో ఆలోచించిన తర్వాత నువ్వు ఈ వ్యాసం మరేపుస్తకాన్ని గురించి వ్రాసినాకూడా నా కింత బాగానూ ఉంటుందని చెప్పడానికి సంకోచంలేదు. దీనికి కారణం ముఖ్యంగా శ్రీకాంత్ విష యాలే. కాని సాహిత్య భావాలను నువ్వు ఎంతో సహృ దయతతోనూ, మధురంగానూ విమర్శించావు. ఈ విమర్శ నిజంగా అందంగాఉండడమేకాక నిష్పాక్షికంగాకూడాఉంది. అందుచేత సహృదయ పాఠకులెవరైనా నిస్సంకోచంగా స్వీక రిస్తారు. అంతేకాక సంభాషణలశైలిలో విమర్శ నడిపావు. మంటూ, నువ్వు చాలా మంచివిధానం కనిపెట్టావు. ఈ పద్ధతిలో కాకపోతే అంత పెద్దవ్యాసాన్ని చదవడానికి అంద రికీ ఓపికఉండదు. చదువుతూవుంటే ఒక మంచికథలా ఉంటుంది. దీన్ని ఏదైనా మాసపత్రికలో ప్రచురణకు పంపుతూ ఏమాత్రమూ తగ్గించవద్దని కోరుతాను. కాని నీకు ప్రూఫ్‌లు పంపుటకు వీలుంటుందో ఉండదో చెప్పలేను. వీలుంటేమాత్రం పంపుతాను.

శ్రీకాంత్ నాల్గవ అధ్యాయం నీ కంత బాగుందని పించిందంటే నా కెంత సంతోషంగా వుందో చెప్పలేను. ఎందుకంటే ఈ పుస్తకాన్ని నేను హృదయమంతాపెట్టి సహృదయ పాఠకులకు బాగుండడంకొరకే ప్రయత్నించి వ్రాశాను. శ్రీకాంత్ అదృష్టంవల్ల నీవంటి పాఠకుడు దొరికి

నందుకు నేను చాలా సంతోషిస్తున్నాను. ఇక ఒక్క పాఠకుడు దొరక్కపోయినా చింతలేదు. ఎన్నో పుస్తకాలు నువ్వు చదువుతూంటావు. వాటిమధ్య నావంటి మూర్ఖుని పుస్తకం చదువుటకు నీకు తీరిక దొరికినదంటే ఆశ్చర్యమే. నేనెంత సామాన్య రచయితనో నాకు తెలుసు. నాకు చదువూ లేదు. పాండిత్యమూ లేదు. పల్లెటూరివాడిని. ఏది తోస్తే అది వ్రాసేస్తాను. అందువల్లనే ఈ యుగంలో ప్రొఫెసర్లు నామీద దాడిచేస్తే భయంతో మాట్లాడక ఊరుకుంటాను. వాళ్ళందరిముందూ నే నెంత అల్పుడనా, సామాన్యుడనా అనుకుంటాను. కాని మధ్యమధ్య నీవంటి మిత్రుని ప్రశంస వినపడితే, గర్వముతోపాటు మంటూ పిళ్ళకేమీ తీసిపోడు అనుకుంటాను. అయినప్పటికీ వారికీ వచ్చిందిగదా. ఇది నాకు పెద్దఅండ, పెద్దఓదార్పు.

చాలాకాలంనుంచీ నిన్నుచూడలేదు. చూడాలని చాలా కోరికగాఉంది. దసరాకు పుదుచ్చేరివస్తె రెండు, మూడు రోజులు ఉండడానికి ఏర్పాటుచేయగలవా? ఆశ్రమంలో ఉండడానికి వీలులేదని నాకు తెలుసు. అక్కడేమీ హోటల్ లేదూ? ఉంటే వ్రాయి.

నీ నిత్య శ్రేయోభిలాషి.
శరచ్చంద్ర చటోపాధ్యాయ.

—o—

సామతాబేడ్, పాణిత్రాస్.
హౌరాజిల్లా.
19 మాఘము, 1340.

చిరంజీవి మంటూ,

చాలా రోజులైంది నీకు వుత్తరం వ్రాసి. ఇవాళ ఉదయం నీకు వ్రాయాలనిపించింది. ఎందుకలా అనిపించిందో తెలియదు. బహుశా దీన్‌పూర్‌లోని పరేశ్ బాబు ఆంతరంగికవిషయాలు కారణం కావచ్చు. దీన్‌పూర్ నుంచి వచ్చి మూడురోజులైంది. అక్కడ సాహిత్య సమ్మేళనం, మ్యునిసిపల్ సన్మానం జరిగాయి. స్టేజిమీద సారగర్భితమైన దీర్ఘవ్యాసం చదవబడుతూవుంటే ప్రక్కన క్రింద 'అనామీ' గురించి చర్చ సాగుతోంది. అయితే నూటికి ఎనభై వ్యతిరేకాభిప్రాయాలే. వాటిమధ్యనుంచి ఒకాయన తాను 'అనామీ' పుస్తకాన్ని నాలుగుసార్లు చదివానని మరొక నాలుగుసార్లు చదవాలని అనిపిస్తోందనీ అంగీకరించాడు.

"ఏం చెబుతున్నారు దినేశ్ బాబూ! మీరు ఫరీద్‌పూర్ బార్‌లో రత్నంవంటివారుగదా. ప్రచండ తార్కిక న్యాయవాదిగదా—మీలోనే ఈ దౌర్బల్యం ఏమిటి?"

"దినేశ్ బాబూ! మీ మనస్సు సరిగా లేదులాగుంది"

"దినేశ్ బాబూ! మీరు ప్రపంచంలోని ఎనిమిదవ వింత" మొదలైనవి.

నేను మౌనంగా ఉన్నాను - సాక్షిలాగా - ఒకసారి నన్ను ఒంటరిగాచూచి ఈ దినేశ్ బాబే ఇలా అన్నారు. "శరత్ బాబూ! ప్రపంచంలో అన్నిపుస్తకాలు అందరి

కొరకూ కాదు. నేను శాంతదాస్ బాబాజీదాస్ శిష్యుణ్ణి - వైష్ణవుణ్ణి. దేవుని నమ్ముతాను. దిలీప్‌బాబు ఏ భావ ప్రేరణతో తన కవిత్వాన్ని వ్రాశారో ఈ ప్రపంచంలో దానికి సాటిలేదు. సమయం దొరికినప్పుడల్లా ముగ్ధుడనై కవిత్వం చదువుతాను. ఎంత నచ్చాయో నేను యితరులకు చెప్పలేను."

విన్నతర్వాత ఇంతకంటే నిజమైన, నిష్పక్షపాత విమర్శ మరేముంటుంది అనుకున్నాను. నీవు మీటిన తీగయే వారి హృదయంలోనితీగనూ కదిపి మ్రోగించింది. తన హృదయతంత్రి కదలనివారు నాలుగైదుసార్లు చదివిన వారి మాటలు విని ఆశ్చర్యం ప్రకటించకపోతే మరేం చెప్పగలరు? విస్మయ ప్రదర్శనతో ఊరుకోలేనివారు అసభ్య దూషణలకుకూడా దిగుతారు. అందు వారిస్థాయి ఎంత పెరిగితే తమను అంత పెద్ద విమర్శకులుగా భావించు కుంటారు. ఇదికూడా నేను చాలాచోట్ల చూస్తున్నాను.

ఆ తర్వాత 'అనామీ'పై ఒక విమర్శనాసభ ఏర్పాటుచేస్తున్నాననీ నన్ను అధ్యక్షునిగా ఉండమనీ కోరుతూ హీరేన్ అనే యువకు డొక ఉత్తరం వ్రాశాడు. ఉత్తరంరాగానే క్షణంలో ఆలోచించుకుని 'సరే' నని జవాబు వ్రాశాను. దినేశ్‌బాబు నాలుగైదుసార్లు 'అనామీ' చదివారంటే చాలామందికి ఆశ్చర్యంగా ఉంది. సభలో నే నీ విషయాన్నిగురించికూడా చెబుతాను.

కొన్నాళ్ళనుంచీ నీ కొకసంగతి చెప్పాలనుకుంటు న్నాను. అది ఆ......రచనల సందర్భంలోనే. అతనికి

నువ్వంటే గౌరవం. అందుచేత నువ్వు చెబితే వినవచ్చు కూడాను. వ్రాయడంలో కొంచెం సంయమంగా ఉండాలని చెప్పు. సంయమం ఒకవిధంగా సహజగుణం (ఇన్‌స్టింక్టు) అనుకో. స్వయంగా లేకపోతే ఇతరులు నచ్చచెప్పలేరు. అయినప్పటికి రచనల్లో అకారణంగా ఇతరుల వాక్యాలు ఉదహరించడమంత అసహ్యమైనపని మరొకటుండదు. ఫలానా రచయిత చెప్పిన '.........' విషయాలతో నేను ఏకీభవిస్తాను. ఆయన '.........' పంక్తులు బాగుండలేదు. ఫలానా రచయిత '...........' వాక్యాలు అందంగా ఉన్నాయి మొదలైనవి. ఇవి ఎలాగంటే పాఠకునితో చాలా అసహ్యకరమైన పద్ధతిలో 'చూశారా నేను ఎన్ని పుస్తకాలు చదివానో, చిన్నవయస్సులోనే ఎంత తెలుసుకున్నానో' అని చెప్పడం. మంటూ, నువ్వు నీరచనలోని యిలాంటి ఉదాహరణలు చూడమని అతనికి చెప్పు. నీ బహు విస్తృతమైన అధ్యయనంవల్ల అవసరంకొద్దీ అవి వచ్చాయనికూడా చెప్పు. అకారణంగానుకాదు, పాండిత్యం ప్రదర్శించాలనే దంభంతోనూకాదు. ఆ...ఇంకా క్రూర వాడు. కాబట్టి ఇప్పటినుంచీ చెబితే బాగుపడవచ్చు. ఇట్టి ఉదాహరణలివ్వడంలో నిన్ను అనుకరించడం తేలికైనపని కాదని అతనికి తెలియకపోవచ్చు. ఇతర విశృంఖలత్వాన్ని గురించి ఎత్తడంలేదు. ఎందుకంటే బూ.. ...కనక ఇతని సాహిత్య ఆదర్శపురుషుడైతే ఇక అతన్ని దారిలో పెట్టలేము. ఇదంతా బాధపడే వ్రాస్తున్నాను. వ్రాయడంలో సంయమ సాధనను మించిన కఠినమైనసాధన మరొకటిలేదని నీకు

ఎన్నిసార్లు వ్రాశానుకాదు. సంయమంయొక్క చిహ్నాన్ని చూస్తే రసికపాఠకుని హృదయం ఆనందంతో ఓలలాడుతుంది. సరే, ఇక దాన్నిపోనీ. 'స్వదేశ్ ఓ ప్రచారక్'లో అచ్చైన నా ఆ ఉత్తరంగురించి కవి నాకు జాబువ్రాశారు. అందులో చివర "నువ్వు మాటమాటకీ కఠినభాషలో నాపై దాడి వెడలుతున్నావు. కాని నే నెప్పుడూ బహిరంగంగాగాని, చాటునగాని నిందించి ప్రతీకారం తీర్చుకోలేదు. ఈ రచననుకూడా ఆ వరుసలోనే చేర్చాను." అని వ్రాశారు.

ఆ రోజున ఉమాప్రసాద్ (కీ. శే. డాక్టర్ శ్యామ్ ప్రసాద్ ముఖర్జీ అన్న) ఆ ఉత్తరం వ్రాసి చాలా అన్యాయంచేశానని అన్నారు. అందు ప్రతిపంక్తిలోనూ విషం నిండిఉన్నదట. కాని నే నిప్పు డేం చెయ్యగలను? వ్రాసిన దాన్ని తిరిగి తీసుకోలేనుగదా. కవితో నా ఎడబాటు బహుశా పూర్తి అయిపోయిందనుకుంటాను. కాని ఈ విషయమై నువ్వు 'స్వదేశ్'లో వ్రాసిన లేఖ బాగుంది. అందులో విచారమేగాని కోపంలేదు. నావల్ల తప్పే జరిగింది. కాని ఏంజరుగుతుందో చూడాలి. 'పరిచయ్'లోని ఆ రచన చదువగానే నా శరీరమంతా మండిపోతే వెంటనే కాగితం తీసుకుని ఆ లేఖ వ్రాసేశాను.

శ్రీకాంత్ నాల్గవఅధ్యాయం విమర్శ మరొకసారి 'విచిత్ర'లో వచ్చింది. ఇది శ్రీకాంత్‌ను గురించికాక మరొక దాన్ని గురించి అయితే ఏకకంఠంతో ప్రశంసించి సంతోషంగా

ఊపిరి పీల్చేవాడిని. రచన చాలా బాగుంది. నిజంగా అర్థం చేసుకుని చదివి అనుభూతిపొందాడు.

మంటూ, నానుంచి జవాబు వచ్చినా, రాకపోయినా అప్పుడప్పుడు ఉత్తరాలు వ్రాస్తూఉండు. నీ ఉత్తరంవస్తే నాకొక తృప్తిఉంటుంది. మిత్రులు సురేన్‌మైత్ర శ్రీ అరవిందునికి గొప్పభక్తులు. నువ్వు నాకు నాగురించి వ్రాసిన రచనలన్నీ (నీకు ఇంకా నేను పంపకుండా ఉన్నవి) చదవడానికి కావాలన్నారు. ఇస్తానన్నాను. కోపం తెచ్చుకోకు. సురేన్ బ్రహ్మసామాజికులైనా చాలా మంచివారు.

నీ నిత్య శ్రేయోభిలాషి,
శరచ్చంద్ర చటోపాధ్యాయ.

—...—

సామతాబేడ్, పాణిత్రాస్,
హౌరా, 20 మాఘము, 1340.

మంటూ,

ఇప్పుడే నీ రిజిష్టరు ఉత్తరం అందింది. అసలు విషయాలు ముందు వ్రాస్తాను.

(1) 'రంగేర్ పరశ్' పంపు. రెండు మూడు పేజీల్లో చేతనైనట్లు వ్రాస్తాను. కాని నిజంచెప్పాలంటే కథలు, నవలలు కాక నేను మరేమీ వ్రాయలేను. భాషా దారిద్ర్యం వల్ల వ్యాసంవ్రాస్తే చదువ వీలులేకుండావుంది. నా ఉత్తరాలభాష చూస్తున్నావుగదా; కవి సందర్భంలో 'స్వదేశ్'లో వ్రాసిన లేఖ ఎంత అసహ్యంగా తయారైంది!

అయినప్పటికీ ఇంక నా ఆ సూటి గ్రామీణభాషలో అనం దాన్ని ప్రకటించడం సవరించుకోలేను. అందుచేత అలాగే వ్రాస్తాను. మరి నన్నేవరూ కాదనలేరు.

(2) హీరేన్ విషయం ఆ ఉత్తరంలో వ్రాశాను. 'అనామీ' విమర్శ గురించి ఏర్పాటుచేసిన సభలో పాల్గొంటాను.

(3) 'విచిత్ర'లో శ్రీకాంత్ గురించి ప్రచురింపబడిన విమర్శనను ఎలాగైనా అచ్చువేయించు. ప్రజలు చదువుతారు. 'రంగేర్ పరశ్'లో ప్రకటించడంకూడా బాగానే ఉంటుంది. అయినా ఇతరుల అభిప్రాయాలుకూడా తీసుకో.

మరొక్కసంగతి "పథేర్ దావేదార్" విమర్శ గురించి సూచించకపోవడం మంచిదే. ఈ రోజుల్లో ప్రభుత్వం దానివెంటపడింది. అందుచేత దాన్నిబట్టి పుస్తకాలన్నీ జప్తు చెయ్యబడకుండా చూడాలి.

నువ్వు యిప్పుడు వ్రాస్తున్న నవల ఇంకా బాగా తయారవుతుందనుకుంటాను. సంభాషణల్లో సహజమైన భాషనే వాడు. సంభాషణలు చిన్నవిగా ఉండాలి. ఒక్కచోటే కుప్పపోసినట్లూ ఉండరాదు. ఒక అధ్యాయంలో కొన్ని, మరొక అధ్యాయంలో ఇంకొన్ని - అలాగ పోలికలు, అలంకారాలు రవీంద్రుని రచనల్లోలాగా అసంబద్ధంగానూ నిరర్థకంగానూ ఉండకుండా చూడు. మనిషిని అలంకారాలతో చక్కదిద్దడం బంగారుకొట్లలో షోకేసులు చక్కదిద్దడం ఒకటికాదు. దీన్ని ఎప్పుడూ గుర్తుంచుకో, అలంకారాలతో నిండినవాక్యం ఎంత బాధాజనకంగా

ఉంటుందో పాఠకులకే తెలుస్తుంది. ఇంక చాలు. ఇప్పటికే ఎన్నో ఉపదేశాలు కుప్పలుగా చెప్పేశాను. సంయమం పాటించెబుతూ స్వయంగా నేనే దాన్ని అతిక్రమిస్తున్నట్లున్నాను. ప్రేమాశీర్వాదాలు.



పి. 566 మనోహర్ పుకుర్, కాళీఘాట్
కలకత్తా, 7 జ్యేష్ఠం 1342.

చిరంజీవి,

మొదట స్వవిషయం వ్రాయనీ. మొన్న యింటి నుంచి తిరిగివచ్చినదగ్గరనుంచీ తలనొప్పిగా ఉంది. దగ్గర బుద్ధదేవ భట్టాచార్య, డా॥ కానాయి గంగూలీ ఉన్నారు. ఒక డాక్టరుహోంకి ఫోనుచేస్తున్నారు. డ్రైవరును కారు బయటకి తియ్యమంటున్నారు. బ్లడ్‌ప్రెషర్ చూస్తారట. ఎక్కువగా లేకపోతే చిక్కేలేదు. ఉంటేమాత్రం కదలకుండా పక్కమీద పడుకుని ఆనందంగా సమయం గడిపేస్తాను. నాకు ఇంతకంటే విశ్రాంతికీ, సంతోషానికీ సమయం లేదు. దేవుడదే చేయుగాక!

బుద్ధదేవ్‌చే నీ ఉత్తరం సగం చదివించుకున్నాను. ఫ్రెంచి తెలిసిన యితర మిత్రునిచే మిగిలిన సగం చదివించుకోవాలి.

మంటూ, ఇంత చిన్న 'నిష్కృతి'ని తీసుకుని సమరాంగణంలోకి దిగడం, తగరపుఖడ్గం తీసుకుని గేదెని వధించ

బూనడం ఒకటే. నిజంగా నాలో ప్రత్యేకశక్తి ఏమీలేదు. కేవలం నీ గురుదేవుని ఆశీర్వాదం, నీ స్వచ్ఛమైన స్నేహం, గౌరవం ఇవే నాకు బలం. కాని తమ్ముడూ నావైపునుంచి ఏమీలేదనిపిస్తుంది.

నువ్వు 'శ్రీకాంత్'ని అనువదించడానికి ఎందుకు సంకోచిస్తున్నావు? అనువదించడం జరిగితే నీవల్లనే కావాలి. భవానీని పిలిచి శ్రీకాంత చతుర్థ అధ్యాయమిచ్చి అనువాదం చేసుకురమ్మన్నాను. ఒక వారం గడిచాక, స్వయంగా రాలేక, తనకు అనువాదంచేసే సాహసంలేదని ఉత్తరంద్వారా తెలిపాడు. ఇంగ్లీషులో అతను వ్రాసినది చూస్తే నిజమేననిపించింది. ఇంక అతనివల్ల కాదు. ఒకవేళ చేస్తే అది పత్రికావార్తలభాష అవుతుంది. సోమనాథ మైత్రా రెండవభాగాన్ని అనువదించపూనుకున్నాడట. అయితే నాకా విషయం తెలియదు. 'విచిత్ర' ఉపేన్ కనుక దీనికి ఏర్పాటుచేస్తే మంచిదే. కనుక్కుంటాను. లేకపోతేమాత్రం నువ్వుతప్ప మరెవరూ అనువాదానికి యోగ్యులుగా కనపడడంలేదు. 'నిష్కృతి'ని నువ్వుచేసినదానికంటే బాగా మరెవరూ అనువాదంచేయలేరు. అయితే శ్రీకాంత్ అనువాదభారం నీకు అప్పగించలేకున్నాను. ఇంత పెద్దపని పెడితే నీ యితరపనులు కుంటుపడతాయి.

'నిష్కృతి'ని గురించి నీ యిష్టంవచ్చిన ఏర్పాట్లు చెయ్యి. చిన్నకథల అనువాదానికి ఇక్కడ ఏర్పాటుచేస్తాను. కాని మనుషులు దొరకడంలేదు. 'పండిత మహాశయు'ని అనువాదం నావద్దే ఉంది. కాని దాన్ని చూస్తే నీకు కష్టం

కలుగుతుందేమో. మాయను నేనింతవరకూ కలుసుకోలేదు. రెండుమూడు రోజుల్లో కలుసుకోగలననుకుంటాను. నా స్నేహాశీస్సు లందుకో.

—శరత్ అన్న.

తాజాకలం.—

మిగిలిన సమాచారాలు బుద్ధదేవ్ చెబుతాడు.

—శ. చ.

—...—

పి. 566 మనోహర్ పుకుర్,
కలకత్తా, 3 మాఘం, 1341

చిరంజీవి మంటూ,

నిన్నరాత్రి పల్లెటూరునుండి వచ్చాను. నీ ఉత్తరాలు అందాయి. విషయాలు వరుసగా వ్రాస్తాను.

(1) నిశికాంతుడు చిత్రించిన నీ చిత్రం చాలా బాగుంది. చాలారోజులతర్వాత నీ ముఖం చూడగలిగాను. చాలా ఆనందం కల్గింది. ఇప్పుడు నిజంగా నిన్ను చూడాలని ఉంది. కాని, ఇంక ఆ ఆశ వదులుకున్నాను. ఈ జీవితంలో ఇంక చూడలేననే నిశ్చయించుకున్నాను.

(2) టైప్‌రైటర్ సక్రమంగా చేరినందుకు సంతోషం. ముక్కచెక్కలై చేరుతుందేమోనని భయపడ్డాను. ఆ రోజున హీరేన్‌వచ్చి 'మంటూదాదా టైపురైటరు పాతదై పోయింది. క్రొత్తది కావాలి' అన్నాడు. కాస్త నువ్వే ఆ పని చెయ్యి అని నేను చెప్పమాత్రం వ్రాసియిచ్చాను.

నీకు నచ్చినందుకు సంతోషం. అంతకంటే నాకు కావలసిం దేముంది? తన సర్వస్వాన్ని యిచ్చిన వ్యక్తికి ఇవ్వడం - ఇవ్వడం కాదు పొందడమే అవుతుంది. నీకు నావల్ల లభించిన దానికంటే నాకు నీవల్ల లభించినదే అధికం.

(3) శ్రీ అరవిందుని స్వదస్తూరితో వున్న వుత్తరం జాగ్రత్తగా దాచాను. అది ఒక రత్నం.

(4) 'నిష్కృతి'ని చక్కగా అనువదించటానికి నువ్వు శక్తివంచనలేక కృషిచేస్తావని నాకు తెలుసు. నువ్వు నన్ను నిజంగా ప్రేమిస్తున్నావనే కాదు, సాధువులయ్యేవారందరి స్వభావమూ అంతే. ఇలా చెయ్యకుండా వారు వుండలేరు. అసలు చెయ్యనే చెయ్యరు. చేస్తే బాగానే చేస్తారు.

(5) శ్రీ అరవిందులు స్వయంగా అజమాయిషీ చేసేటప్పుడు అనువాదం చాలా బాగుంటుంది. కాని మంటూ, పుస్తకంలో నా ప్రతిభ యేముంది కనుక? శ్రీ అరవిందులకు ఎందుకు నచ్చిందో నాకు తెలియదు. కనీసం నచ్చకపోయినా నాకు ఆశ్చర్యంలేదు. నేను విచా రించేవాడినీకాను. నువ్వు శ్రీకాంత్ని ప్రచారంచేసినప్పుడు పశ్చిమదేశస్థులు ఈ బెంగాలీ కథారచయితని గౌరవదృష్టితో చూడగలరని నమ్ముతాను. నీ కృషి, శ్రీ అరవిందుల ఆశీ ర్వాదంవుంటే ఇది తప్పకుండా ఒకరోజున సంభవమా తుందని నా ఆశ.

(6) అనువాదంవిషయంలో నీకు పూర్తిస్వాతం త్ర్యాన్ని యిస్తున్నాను. నువ్వు అనువాదకుడివిమాత్రమే కాదు. స్వయంగా గొప్ప రచయితవికూడాను. నిన్ను

మామూలువ్యక్తిక్రింద జమకట్టేవారు తక్కువలేరు. వారి ప్రయత్నాలు అలా సాగనీ. వారి ప్రయత్నాలకంటే నీ ఏకాగ్రసాధన, ప్రతిభ చాలా గొప్పవి. నీ గురువుల ఆశీస్సులు నీ వెనుక ఉండనేఉంటాయి. నీ అంతరాళంలోని చైతన్యశక్తి ఓడిపోవడం, వారి చెడుప్రయత్నాలకు విజయం లభించడం అసంభవం, మంటూ.

(7) రవీంద్రనాథ్ నన్ను పరిచయంచేస్తారని నేను నమ్మను. నా యెడల వారు సుముఖంగాలేరు. ఇంతేకాక వారికి తీరికకూడాలేదు. సాహిత్యసేవ విషయంలో రవీంద్రులను నేను గురుతుల్యులుగా భావిస్తాను. వారి ఋణాన్ని నే నెప్పుడూ తీర్చుకోలేను. మనస్సులో వారియెడల నే నింత గౌరవ పూజ్యభావం ఉంచుకుంటాను. కాని నా వ్రాత అందుకు సాక్ష్యం చెప్పలేదు. నేనంటే రవీంద్రులకుండే వైముఖ్యానికి అంతులేదు. అందుచేత దానికి ప్రయత్నించడం అనవసరం.

(8) హీరేన్ ఇవాళో, రేపో వస్తాడు. రాగానే నీ కాగితాలన్నీ పంపివేయమని చెబుతాను.

(9) ఇంక నీ విషయం మిగిలింది. నేను నీకు చాలా కృతజ్ఞుణ్ణి. మంటూ ఇంతకంటే ఏం చెప్పను? ఉత్తరాలు వ్రాయడం నాకు మొదటినుంచీ కష్టంగానే ఉంది. ఎంత ప్రయత్నించినా సరిగా వ్రాయలేకపోయాను. అందుచేత చెప్పదలచుకున్నవి సరిగా చెప్పలేకపోయాను. అది నా అసమర్థత. అంతేకాని అయిష్టతమాత్రం కాదు. ఇది నమ్ము.

నా స్నేహాశీస్సు లందుకో. సౌరీన్‌ని అడిగానని చెప్పు. కుర్రవాడిసంగతి గుర్తు రావడం లేదు. కీ. శే. దాదామహాశయుని ఇంటివద్దగాని లేక 'తకూ' ఇంటివద్ద గాని చూచిఉంటాను.

(10) శ్రీ అరవిందుని నవవార్షిక ప్రార్థన నిజంగా చాలా బాగుంది. వాస్తవంలో వారు చాలా గొప్పకవి.

శ్రేయోభిలాషి,
శరశ్చంద్రచటోపాధ్యాయ.

—o—

7 చైత్రం, 1341.

చిరంజీవి మంటూ,

చాలా రోజులనుంచీ నీకు ఉత్తరం వ్రాయలేదు. అన్యాయమే జరిగింది దీనికి శిక్షఉన్నదని నాకు తెలుసు. కాని క్షమార్హులు కానివారిని క్షమించకపోవడం కృత్రిమం కాదు. అప్పుడు దాన్ని పూర్తిచేయుటకు భగవంతుడే స్వయంగా మనుష్యులను పంపుతారు. కాని ఒక్కసారిగా పాతాళానికి పంపరు. బుద్ధదేవ్ భట్టాచార్యుని రూపంలో నాకా మనుష్యులు లభించారు. అందుచేత నీకు చెప్పవలసిన దంతా వారిద్వారా చెబుతాను. వారే నీకు విషయాలన్నీ చెబుతారు. నీలాగే వారుకూడా నన్ను హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నారు. నామేలుని. నా కీర్తి తగ్గరాదని వారెప్పుడూ కోరుతూఉంటారు. ఒకరోజున ఆయన నన్ను బలవంతంగా హాఫ్ మెన్ కెమేరా ముందు కూర్చోబెట్టి ఫోటో

తీయించిగాని వదల్లేదు. 'దిలీప్‌కుమార్ అడిగారు, కాదన లేను' అన్నారు. వారి శ్రమకు సహాకరించాలి. అంటే శ్రమలో భాగం పంచుకోవాలి. అంతా ఒంటరిగానే చెయ్యాలా? నేను పెద్ద రచయితనని, కాబట్టి నాకు అట్టి సన్మానం లభించాలని ఆయన అనుకుంటూరు. నేను చాలా చిన్న రచయితనని నేను చెబుతూవుంటాను. యూరపు నన్నేమీ గౌరవించదు; అందుచేత నాలో ఏదో ఉన్నదని అనుకోను. అయితే దిలీప్ బాబు అనవసరంగా ఇంత కష్టపడు తున్నాడా? ఆ శ్రమ వృథాపోదు. శ్రీ అరవిందులు ఆయ నకి అభయమిచ్చారు అని చెప్పాడు బుద్ధదేవ్. అప్పుడు నేను 'అయితే అరవిందులకే తెలియాలి' అన్నాను.

ఒకరోజున వశిష్టసేన్ అమెరికన్ భార్య 'నిష్కృతి' అనువాదం చూడాలని మరీమరీ అడిగింది. అందులో శ్రీ అరవిందుని చెయ్యి పడిందని ఆమెకు తెలిసిందట. అందుకే ఇంతగా కోరింది. ఏప్రిల్‌లో ఒక కాపీ అమెరికా తీసుకువెళ్ళి ప్రచురిస్తానని చెప్పింది. ఇంతకుముందు ఆమె 'ఏషియా' పత్రిక సంపాదకురాలుగా ఉండేది. అక్కడ చాలమంది ప్రకాశకులామెకు తెలుసు. 'నిష్కృతి' కాక 'శ్రీకాంత్' ఇస్తే బాగుంటుందని నా అభిప్రాయం. ఆ దేశంలో 'నిష్కృతి'కి ఏవిషయంపై గౌరవం లభిస్తుంది కనుక? ప్రస్తుతానికి నాకు ఒక కాపీపంపు. అనువాదం ఎలా జరిగిందో చూస్తాను. బుద్ధదేవ్‌కూడా నీకీ పాటికి వ్రాసే ఉంటాడు. నువ్వు అడిగిన వస్తువులన్నీ పంపమని చెప్పాను. ఈపాటికి నీకు అందే ఉండవచ్చు.

'నిష్కృతి' ఫ్రెంచి అనువాదం చెయ్యాలని నువ్వు అనుకుంటున్నావనీ, ప్రయత్నిస్తున్నావనీ విన్నాను. నేను ఎంత కాలం ఉంటానో నమ్మకంలేదు. కాని శ్రీ అరవిందుని ఆశీర్వాదంతో అసంభవాలుకూడా సంభవంకాగలవు.

నువ్వు బైరాగివి అయినా నాకోసం చాలా ఖర్చు పెడుతున్నావు. బుద్ధదేవ్ రావడంతోనే కొంత పంపుతాను. బుద్ధదేవ్ కుర్రవాడైనా బాగా చదివినవాడు. సంస్కృతం, నృత్యశాస్త్రంలో చాలా పరిచయం ఉన్నవాడు. కాలేజీలో ఈ రెండువిషయాలు బోధించుతూ ఉంటాడు.

మంటూ, ఇంక 'శ్రీకాంత్'లో చెయ్యి వెయ్యి; బ్రతికిఉండగా ఒక్కసారి ఈ కళ్ళతో అనువాదాన్ని చూచిపోవాలని ఉంది.

సాహానా, నువ్వు పాడేపాటలపుస్తకం కనిపించింది. జాగ్రత్తగా బీరువాలో దాచాను. సాహానాకు నా ఆశీస్సులందించు.

నేను సమాధానాలు వ్రాయడంలో ఎంత ఆలస్యమైనా నువ్వుమాత్రం ప్రతీకారం ఈ రూపంలో తీర్చుకోకు. ఒకవారంలో అందగం పల్లెకు వెళుతున్నాము. వెళ్ళేముందు నీకు చిరునామా వ్రాస్తాను. ఈలోగా 'నిష్కృతి' అనువాదం ప్రతిఒకటి కలకత్తాఅడ్రసుకు పంపు. మీరందరూ క్షేమంగా ఉన్నారనుకుంటాను. నా స్నేహాశీస్సులందుకో.

శరత్ అన్న.

పి 566 మనోహర్ పుకుర్,
3 మాఘం 1342,
కలకత్తా.

చిరంజీవి మంటూ,

నీ పోష్టుకార్డు, 'బహువల్లభ్' ఫారాలు అందాయి. గత తొమ్మిది పది మాసాలుగా నేను అస్వస్థతగా ఉన్నానని బహుశా నీకు తెలియకపోవచ్చు. శయ్యాగతుడనై ఉన్నానన్నా అతిశయోక్తికాదు. గత జ్యేష్ఠమాసంలో పల్లెనుంచి ఇక్కడకు వచ్చేటప్పుడు ట్రైన్‌లో వడగాలి తగిలింది. అప్పటినుంచీ చెప్పలేనంత కళ్ళుమంట, తలనొప్పీను. ఇంకా తగ్గలేదు. ముందైనా బాగుపడతానని నమ్మకంలేదు. అంతే కాక పాతరోగం. ఒట్టి రక్తం పడుతూవుంటుంది. నెల్లాళ్ళబట్టీ మధ్యమధ్య జ్వరం వస్తోంది. జ్వరంతోనే నీకు ఉత్తరం వ్రాస్తున్నాను. పల్లెలోనే ఉంటూ మధ్యలో కొంచెం బాగున్నప్పుడు కలకత్తా వస్తున్నాను. వ్రాయడం-చదవడం పూర్తిగా మానేశాను. పత్రికకూడా చదవడంలేదు. ఇంక ఆజీవనం వ్రాయను-చదువను వీలులేకపోయినా బాధలేదు. శక్తిసామర్థ్యాలున్నంతవరకూ పనిచేశాము. లేనప్పుడు విచారించి ప్రయోజనం? హృదయంలో ఎప్పుడూ బైరాగినే. ముందుకూడా అలాగేఉండాలి.

మంటూబాబు 'దోలా' చాలా బాగుందని ఒక నాడు బుద్ధదేవ్ అంటున్నాడు. విని ఆశ్చర్యంనెయ్యలేదు. రోజురోజుకూ మంటూ నవలలు అభివృద్ధిపొందుతాయని నాకు తెలుసు. స్వచ్ఛమైన సాధనకు ఫలితం రాక ఎలా

పోతుంది? అంతేగాక వారసత్వంగా కళాకారునిహృదయం లభించింది. ఎంత విశాలమైనదో అంత సుసంస్కారయుత మైనది. పరదుఃఖ పీడితమైనదికూడాను. నీ రసపూరిత హృదయపరిచయం చిన్నతనంనుండే సంగీతంలో, సద్గుణాల యెగడల ప్రేమలో, నీకార్య కలాపాలన్నిట్లోను కనిపించింది. అందుచేతనే నీపట్ల నా ప్రేమకూడా స్వచ్ఛమైనది. బయట నుంచి వచ్చేదేనివల్లా అది మలినంకాదు. నీ రచనయెడ చాలా రోజులనుంచి నే నాశించుతున్నది నేడు సఫలమౌ తోంది. ఇది నాకు అత్యంత ఆనందదాయకం. నువ్వు జీవితంలో సుఖం పొందాలనీ, సార్థకత పొందాలనీ ఆశీర్వ దిస్తున్నాను.

బుద్ధదేవబోసుయొక్క 'బాసరఘర్'ను గురించి రవీం ద్రులేమన్నారో నేను చదువలేదు. రవీంద్రులు నాకంటే గొప్ప నవలారచయిత అని బుద్ధదేవ్ అనటంలో అసత్య మేముంది? ఇది నిజమని నాహృదయానికి తెలుసు.

ఇంతేకాక నాకంటే ఎవరు గొప్ప, ఎవరు చిన్న అని నేను ఎప్పుడూ బాధపడలేదు... ఒకవేళ నా ఏ పుస్త కమూకూడా నవల అనిపించుకోదు అని అన్నా తాత్కాలిక బాధకంటే మరేమీఉండదు. నేను ఎంతో దైన్యాన్ని ప్రకటి స్తున్నానని నమ్మరేమో. కాని నేను ఇన్నాళ్ళబట్టీ ప్రయత్నిస్తున్నది దీనికే కాబట్టి ఏవిధంగా దాడిచేసినా ఎదు రించను. యౌవనంలో ఒకటి రెండుసార్లు రవీంద్రులను ఎదు రించాను. కాని అది నా ప్రకృతికాదు, అది నా వికృతి. అప్పుడు ఎన్నో కారణాలవల్ల తప్పుచేశాను.

సృష్టించగలనో పరీక్షించవలసివుంది. ఉపాదానంగానీ, ఉపకరణాలుగానీ, సంఘటనల ఆధారంగానీ - యివన్నీ అత్యంత సాధారణ గ్రామ్యజీవితంలోని దైనందిన సంఘటనలతోనే - ఈ పుస్తకం నిండివుంటుంది. దీర్ఘమైన వివరణలు వుండవు. కేవలం సంజ్ఞలుమాత్రమే వుంటయ్. రసికులైనవారు ఆనందించగలుగుతారు. కానీ, నవలాసాహిత్యంలో నాకున్న తెలివితేటలన్నిటిని జొప్పించినప్పటికీ - నవల బాగుండకపోవచ్చు. కానీ, దీనిలో సాహిత్య సంయమము లేని విశృంఖలస్వరూపంమాత్రం వుండదు.

సావిత్రి విషయంలో 'పుష్పపత్రిక' (వైశాఖ, జ్యేష్ఠ మాసాలు)లో 'బుద్ధదేవ్, యదార్థవీర్' శీర్షికతో రాసిన దాన్ని నేను చదివాను. నువు రాసిందికూడా బాగానే వుంది. కానీ, సావిత్రి యదార్థంగా పరిచారికాకులానికి సంబంధించినది కాదన్నసంగతి ఎందుకు మరచిపోతుంటారో, నాకు తెలియదు. పురాణాల్లో, ఒకమారు లక్ష్మీదేవికూడా ఆపదల్లో చిక్కుకొని బ్రాహ్మణునియింట దాసిగా పని చేసిందట. సాంప్రదాయాన్నిబట్టి వేశ్యల్లోకూడా ఉచ్చ నీచతరగతులున్నాయి. ఒక వేశ్యదగ్గర, మరో వేశ్య దాసీగా వుంటే వారి సాంప్రదాయాలు ఒకేవిధంగా వుండవు. దాసీని పొందడం తేలికే - కానీ, దాని యజమానురాలిని పొందడం కష్టంతోకూడుకొని వుంటుంది. స్త్రీ జాతిని దూషిస్తూ ప్రచారంచేస్తున్నవాళ్ళు - యదార్థవాదులమని అనుకుంటూ వుంటారని నీవు వ్రాసింది నిజమే! వారిలో ఆదర్శవాదమనేది లేదు. యదార్థవాదమనేదీ లేదు.

కేవలం అహంకారం మాత్రమే వుంది. కావలసినంత డాంబికం వుంది. మహిళామణులకు విరుద్ధంగా కటువైన మాటలు వ్రాయడం వీరత్వం కావచ్చు. కానీ, ఆవిధంగా నిజమైన సాహిత్యాన్ని సృష్టించడంమాత్రం జరగదు.

('పాఠశాల' భాద్రపదం - 1350)

—...—

వ్రాయలేకపోయాను. మరేమీ అనుకోకు. మీరందరూ ఎప్పుడు తిరిగివస్తారు? మీ అందరినీ ఎప్పుడు కలుసుకో గలుగుతానా అని నేనీ గ్రామీణభవనంలో కూర్చుని ఆలోచిస్తున్నాను. సాహిత్యరంగంలో నాకు మీ పరిచయం లభించింది. మీకు హృదయపూర్వకంగా దేశాన్ని ప్రేమి స్తున్నారని నాకు తెలుసు. కాని మీకు ఏ అపరాధానికి బంధింపబడ్డారో తెలియడంలేదు. అతిత్వరలో విడుదలై సాహిత్యరంగంలోకి తిరిగిరావాలని ప్రార్థిస్తున్నాను.

'శేషప్రశ్న' నవల మీకు బాగా నచ్చినదని తెలుసు కుని చాలా సంతోషిస్తున్నాను. ఇందులో చాలా సాంఘిక సమస్యల సమీక్షఉంది. కాని వాటి పరిష్కారబాధ్యత మీమీద ఉంది. భవిష్యత్తులో ఈ కఠోర బాధ్యతను నిర్వహించాలనే సూచనయే మీకు ఆనందాన్ని కలిగించి యుండవచ్చు. కాని చాలామంది ఈ పుస్తకం చూచి నిరాశ చెందుతారనీ, వారికి దీనివల్ల ఏమీ ఆనందం కలుగదనీ నేననుకుంటాను. ఒకటేమిటంటే కథాంశం చాలా తక్కువ. రెండవది ఒక చిన్న నిద్రతీసినట్లు చదు వుతూ ఆనందం అనుభవించడానికి దీనిలోవీలులేదు. ఇది బా గుండడమనే విషయమేలేదు. కొద్దిమందైనా అర్థంచేసుకుని చదువుతారు. అలాఅయినా నాపని సార్థకమైనట్లేనని తలచి నేనిది వ్రాశాను. అందరికీ అన్నిరసాలూ పనికిరావు. అధికార తారతమ్యాన్ని నేనూ అంగీకరిస్తాను.

మరొకవిషయం ఏమంటే అది అతి నవ్యసాహిత్యం. ఆ వయసులోకూడా ఏదైనా సంజ్ఞామాత్రంగా వదుల్దా మను

కున్నాను. ముసలివాణ్ణి అయిపోయేను. ఇంక వ్రాయగలిగే శక్తి ఉడిగినట్లే. కాని మళ్ళీ ముందుతరాలవారైన మీకు కలుషితం చేయకుండానే అతి నవ్యసాహిత్యం వ్రాయవచ్చు ననే నమ్మకం కుదురుతుం దనుకున్నాను. కేవలం కోమల మైన రసానుభూతి మాత్రమే కాక, మెదడుకు గట్టిమేత నివ్వడంకూడా అతి నవ్యసాహిత్యానికుండవలసిన ముఖ్య లక్షణం. ఇంక తర్వాత మీరు వ్రాసినప్పుడు మీరు చాలా చదివి ఆలోచించవలసివస్తుంది. కేవలం వినోదానికని తేలికగా వ్రాసినంతమాత్రాన చాలదు.

జైలులో ఉన్నారుగదా. ఇప్పుడు నీకు కావలసినంత తీరిక ఉంటుంది. నీకు నా సందేశ మేమిటంటే ఈ మంచి అవకాశాన్ని నష్టపరచుకోకు. ఈ ఏకాంతవాసం నీ భావి జీవితంలో మంగళద్వారాలు తెరుస్తుంది. జనంలోంచి మనుష్యులను గుర్తించడం నేర్చుకో. మనుష్య స్వభావాన్ని గుర్తించడమే సాహిత్యానికి కావలసిన నిజమైన సరంజామా. ఈ సత్యాన్ని మరువకు.

ముసలితనంలో నా శరీరం ఏ అవస్థలో ఉండాలో అలాగేఉంది. కులాసాగా ఉంది. నీ కేకష్టం కలగకుండుగాక అని ఆశీర్వదిస్తున్నాను.

4 జ్యేష్ఠము 1338.

శ్రేయోభిలాషి,

శరచ్చంద్ర చటోపాధ్యాయ.

—...—

పోయి దారిమధ్యలోనే బోర్లా పడిపోయిందా అనిపించింది. అలాంటివాటికి పత్రికలో ఎప్పుడూ స్థానం యివ్వకు. అలాగని కథలో బుద్ధివాదం ఉండడమే దూష్యమని కాదు; హృదయ ప్రవృత్తినే అధికంగా తన కథనంద్వారా వ్యాపింపచేయగలగాలి.

['స్వదేశ్' ఆశ్వయుజం 1340.]

—...—

## శ్రీ అవినాశచంద్ర ఘోషాల్‌కు

25, శ్రావణము 1341.

'వాతాయన్' ప్రతి సంచిక నేను శ్రద్ధగా చదువుతున్నాను. సోమరితనం, మర్చిపోవడం అనేవి ఈ సందర్భంలో జరగడంలేదు.

పత్రికలోని అన్నివిషయాలతో నేను ఏకీభవిస్తానని అనలేను. కాని అకారణంగా వ్యక్తిగత ఈర్ష్యవల్లగాని, ద్వేషంవల్లగాని విమర్శలను కలుషితంచేయడమునేది నేనింతవరకూ చూడలేదు. ఇది చాలా సంతోషించదగ్గ విషయం, ఒకవేళ లోగడ అలాంటివేమైనా జరిగి నా దృష్టికిరాకుండా ఉంటే వాటినిగురించి 'గతం గతం'అని మాత్రమే అనగలుగుతాను. అయితే ఈ నూతన సంవత్సరంలో మీరొక విషయాన్ని గుర్తుంచుకోవాలి. అది: రచనలో అపహానాన్ని అయినా సహించవచ్చుగాని క్రూరత్వం, నైచ్యం, అసత్య

ప్రచారం మొదలైన మానవుని అధమునిగా చిత్రించుటకు చేయు ప్రయత్నాలు సహించలేము. వాటినల్ల రచయిత, స్వయంగా నీచుడైపోయి, తన అసలు విషయాన్ని బయట పెట్టుకుంటాడు. అప్పుడు పత్రికమర్యాద పోతుంది. ఆశయం శిథిలమైపోతుంది. విమర్శ అనవసరశ్రమగా దిగజారి పోతుంది. అన్ని వేపులనుంచి ఇక ఆ పత్రిక శ్రేయస్సుకున్న ఆశలు అడుగంటిపోతాయి. పత్రికకు ఇంతకుమించిన అధోగతి వేరేఉండదు. అసత్యం. అన్యాయమేకాక, అసుందరం (కురూపత్వం) కూడా ఎప్పుడూ దీర్ఘజీవి కాలేదు.

('వాతాయన్' 25 శ్రావణం 1341)

దేశంలోని వారపత్రికలు ప్రజలదృష్టిని, జిజ్ఞాసను ఆకర్షిస్తున్నట్లు కనబడుతోంది. అంటే మనిషి తన దైనందిన కార్యకలాపాల్లో దీని అవసరాన్ని కూడా గుర్తిస్తున్నాడన్న మాట. ఇది సంతోషించదగిన విషయం. కాని, ఈ ప్రతిష్ఠను సంపాదించడంవరకే చాలదు; పనిద్వారా తనకు వచ్చిన మర్యాదను రోజురోజూ వృద్ధిచేసుకోవాలి. నీ కార్యపటుత్వం సాధారణ ప్రజల సౌభాగ్యాన్ని, కళ్యాణాన్ని, సమృద్ధిని వృద్ధిచేస్తుందని గుర్తించాలి. కార్యపటుత్వం ద్వారా కాక మరి ఏ యితర ఉపాయంద్వారానైనా పత్రిక అస్తిత్వాన్ని నిలుపుకోవాలని ప్రయత్నించడం వ్యర్థమూ, అనవసర ప్రయాసే అవుతుంది.

నిన్ను నేను చిన్నతనంనుండి ఎరుగుదును. నీ ఆద

ర్శాలు అనుభవాలను గురించి నావద్ద చర్చించి తమ్ముడినా లైనా సలహాలు అడుగుతూ ఉండేవాడివి. నీ జీవితయాత్రలో యివన్నీ మర్చిపోవద్దని నా కోరిక.

పత్రికను నడపడం ఒక బాధ్యతతో కూడుకున్నది మాత్రమే కాదు. దాంట్లో ఎన్నో అడ్డంకులున్నాయి. రకరకాల వ్యతిరేకతలను ఎదుర్కోవలసి వస్తుంది. రూపురేఖలు తాత్కాలికం మాత్రమే; అందుచేత సంయమము, సహనము ముఖ్యావసరాలు. నిర్భయ విమర్శలు వారపత్రికలకు ప్రాణంవంటివి. కర్తవ్యవిముఖత్వం ఘోరతప్పిదము. ఇవన్నీ ఇలాఉండగా అన్నిటికంటే మించి నీ శీలం, నీ మర్యాద విలువకలిగినవిగా వుండాలి. సౌజన్య రహితంగా, కుప్రభావాలకు లోనై నీ అభిప్రాయాలను, వ్రాతలను కలుషితం చేసుకోకు. ఒకరిని చిన్నబుచ్చడంలో కాక, అందరినీ గౌరవంగా చూచుటలోనే నీ శక్తిని వినియోగించాలని నేను కోరుతున్నాను. అభ్యుదయపథంలో నీకు తిరుగులేని విజయాలు లభించితీరుతాయి.

7 శ్రావణము, 1342

శ్రేయోభిలాషి

శరశ్చంద్ర చటోపాధ్యాయ.

## శ్రీ మతిలాల్‌రాయ్‌కి

పరమపూజ్యులకు,

సత్యం-శివం-సుందరం కళాసాధనకు మూలసూత్రమని పెద్దలు చెప్పారు. అంటే సాధన సత్యంమీద సుందరం మీద ఆధారపడిఉండాలనీ, దానిఫలితం మంగళమయం కావాలనీ గదా! విజ్ఞానసాధకులైనవారికి (తత్వజ్ఞానులను గురించికాదు - మామూలు వాడకం అర్థంలో) అంటే వైజ్ఞానికులైనవారికి ఏకైక మంత్రం సత్యం. వారి కృషి యొక్క ఫలితం సుందరమైనా, అసుందరమైనా; మంగళదాయకమైనా, అమంగళదాయకమైనా వారికేమీ పరవా లేదు. అయినా మంచిదే; కాకపోయినా మంచిదే...

కాని సాహిత్యసేవలో చాలాకాలంగా మునిగిఉన్న నేను సత్యం - సుందరం మధ్య అడుగడుగునా వైరుధ్యాన్ని నిరంతరం చూస్తున్నాను. సాంసారిక జీవితంలో సత్యమైన సంఘటన సాహిత్యంలో సుందరం కాకపోనచ్చు. అలాగే వాస్తవజీవితంలో సుందరమైనది సాహిత్యంలో పదహారణాలా మిథ్యకూడా కావచ్చు. సత్యంగా చూస్తున్నదానికి సాహిత్యంలో రూపం ఇవ్వబోతే భీభత్సంగానూ, కురూపంతోనూ తయారౌతోంది; మరొకవేపు అసత్యం అనుకునే దాన్ని వదలివేస్తే సుందరంయొక్క రూపమే లభించుట లేదు. మంగళం - అమంగళం సమస్యకూడా ఇలాగే ఉంది. సాహిత్యంలో ఈ విషయం అప్రాసంగికమని స్వీకరించవలసి యుంటుంది.

సత్యం, సుందరంకు వ్యతిరేకమైతే, మంగళం - అమంగళం అప్రధానమైతే సాహిత్యసాధనలో ఈ సమస్యను ఎలా పరిష్కరిస్తామా అనిపిస్తోంది.

భవదీయుడు,
శరశ్చంద్ర చటోపాధ్యాయ,
('ప్రవర్తక్' ఫాల్గుణము, 1344)

## శ్రీ పశుపతి చటోపాధ్యాయకు

నేను నాటకాలు ఎందుకు వ్రాయడంలేదు? అని నీ ప్రశ్న—బహుశః రెండు కారణాలవల్ల నువ్వీ ప్రశ్న వేసి ఉంటావు. మొదటిది నాటకకారులు, ఇతర గ్రంథకర్తల ద్వారా రచింపబడిన నవలలకు నాటకరూపాన్నిచ్చిన శ్రీయుత యోగేశ్ చౌదరీ ఈమధ్య 'వాతాయన్'లో బెంగాలీ నాటకసాహిత్యాన్ని గురించి వ్రాసిన వ్యాసంతో నువ్వు పూర్తిగా ఏకీభవించి ఉండవు. ఇక రెండవది: నువ్వు సాధారణంగా రంగస్థలంమీద చూస్తున్న నాటకాలలోని భావం, శైలి, భాష, పాత్రపోషణ వీటన్నిటిని విమర్శనా దృష్టితో చూచి శరశ్చంద్రుడుకూడా నాటకాలు వ్రాస్తే రంగస్థలంలో పరివర్తనం వస్తుందని అభిప్రాయపడిఉంటావు.

నీ ప్రశ్నకు నేను చెప్పే సమాధానంలో మొదటి విషయం, నేను నాటకాలు వ్రాయను. కారణం అంటావా అందుకు నేను అసమర్థుడను. ఒకవేళ నా అసమర్థతని అంగీకరించకుండా నేను నాటకాలు వ్రాస్తే నాకు తగిన విలువ రాదు. కేవలం డబ్బుకోరకే వ్రాస్తున్నానని అనుకోకు.

ప్రపంచంలో దాని అవసరమూ ఉంది. కాని అదొక్కటే ముఖ్యంకాదు. ఈ సత్యాన్ని నే నెప్పుడూ మరువను. నవలలు వ్రాస్తే తనకుతామె కోరి మాసపత్రికలవాళ్ళు తీసుకుంటారు. వాటిని అచ్చువేయించే ప్రకాశకులకూ కరువు లేదు. నవలలు చదివే పాఠకులూ ఉన్నారు. ఇక ముందు సంగతి చెప్పలేనుగాని ఇంతవరకూ కథ ఎలా వ్రాయాలో కూడా నాకు తెలుసు. 'కథ వ్రాయడం నేర్పండి' అని ఎవరిదగ్గరకూ వెళ్ళి నేర్చుకోవాల్సిన అవసరం నాకు లేదు. కాని నాటకమో? నాట్యశాల అధికారులే దాని నిర్ణయాలకు హైకోర్టులు. తలత్రిప్పేసి ఇక్కడ యాక్షను బాగుండలేదంటే దర్శకుడు ఒప్పుకోడు; నాటకం సాగదు. ఇంక దాన్ని ముందుకు త్రోయ్యడం జరగదు. వాళ్ళ అభిప్రాయాలే అంతిమ నిర్ణయాలు. ఎందుకంటే వారే అందులో నిపుణులు. డబ్బు ఇచ్చే ప్రేక్షకుల ప్రతివాదాన్ని వారు ఎరుగుదురు. అందుచేత ఏరికోరి కష్టంలో చిక్కుకోవడం సందిగ్ధమే.

నేను నాటకాలు వ్రాయగలననుకుంటాను. ఎందువల్లనంటే నాటకానికి అత్యంత ప్రయోజనకరమైనది, ప్రేక్షకుల హృదయాలను చూరగొనే కథోపకథనం వ్రాసే అలవాటు నాకుంది. మాటలు ఎలా చెప్పాలి? ఎలా, ఎంత సరళంగా చెబితే ఇతరుల మనస్సును తేలికగా ఆకర్షిస్తుంది. అనేవి నాకు తెలియకపోలేదు. ఇవేకాక పాత్రపోషణ, సంఘటనల క్రమ నిర్మాణం అంటావా అవీ నిర్వహించగలననే నా నమ్మకం. నాటకాల్లో పాత్రపోషణకు సిట్యు

యేషన్ ఏర్పరచవలసిఉంటుంది. పాత్రసృష్టి రెండు రకాలుగా ఉంటుంది. ఒకటి: బహిరంగం. అంటే ఘటనా పరంపర సహాయంతో ఉన్న పాత్రలను ప్రేక్షకులముందు పెట్టడం. రెండవది: పాత్రపోషణ. అంటే ఘటనాపరంపర మధ్యనుంచి జీవితంలో వచ్చే మార్పులను చూపడం. అది మంచి అయినా కావచ్చు; చెడుఅయినా కావచ్చు. 20 సంవత్సరాలక్రిందట ఒక వ్యక్తి విల్సన్ హోటల్‌లో తింటూ ఉండేవాడు. ఎప్పుడూ అబద్ధాలు చెప్పేవాడు; చెడ్డపనులు చేసేవాడు అనుకో. ఇవాళ ఆ వ్యక్తి సాతానివైష్ణవుడు. బంకించంద్రుని మాటల్లో చెప్పాలంటే ఆకుమీద చేపనీళ్ళు పడితే తుడిచేస్తాడు. అయితే ఇది అతని నటనకాక నిజంగా హృదయపరివర్తనకూడా కావచ్చు. రకరకాల సంఘటనల మధ్యపడి కొంతమంది మంచివారి సంపర్కంలోకి వచ్చి ఆ ప్రభావంవల్ల ఇలా మారిపోయి ఉండవచ్చు గదా. 20 సంవత్సరాల క్రింద ఉన్న అతని స్థితి నిజమే. నేడు అతనిలో కలిగిన పరివర్తనా నిజమే. కాని దీన్ని యథాతథంగా నాటకంలో ప్రేక్షకుల ఎదుట పెడితే చాలదు. నాటకంలో నుంచి, రచనద్వారా ప్రేక్షకుని ఎదుట దీన్ని యదార్థమని నిరూపించాలి. వాళ్ళకి ఈ పరివర్తనకు కారణం నాటకంలో వెతికితే దొరక్కుండా వుండకూడదు. ఇది కష్టం. మరొక విషయం నవలలోవలె నాటకం పెరిగిపోకూడదు. నాటకం ఒక నిర్ణీతసమయంలో సమాప్తమైపోవాలి. ఇంతేకాక నాటకంలో సంఘటనలను అలంకరించి విడదీసి అంకాలుగాను, రంగాలుగాను విడదీయాలి; ప్రయత్నిస్తే ఇదీ

అసాధ్యంకాదు. కాని యింతాచేస్తే ఏమిటి లాభం అంటాను. వ్రాసే నాటకాన్ని రంగస్థలంపైకి తెచ్చేదెవరు? విద్యావంతులైన, విజ్ఞానవంతులైన నటీనటులెక్కడ వున్నారు? నాటకానికి నాయకి కాదగిన ఒక్క నటికూడ నాకు కనబడలేదు. ఇంకా ఇలాంటి చాలా కారణాలవల్ల సాహిత్యంలో ఆ వేపు అడుగుపెట్టాలని అనిపించడంలేదు. ఎప్పుడో ఒకప్పుడు ప్రస్తుత నాటకరంగంలోని ఈ లోటు తీరగలదనే ఆశిస్తున్నాను. అయితే ఈ జీవితంలో చూచే అవకాశాలులేవు. హాస్యప్రేరణ కలిగితే ఎప్పుడైనా వ్రాస్తానేమో! కాని నానుంచి ఆశించకు.

('నాచ్‌ఘర్', 25 ఆశ్వీయుజం 1341)

---

## శ్రీ జహానారా చౌదరీకి

12, మాఘం - 1342.

నీ వార్షికసంచికకు ఏమైనా వ్రాయమని కోరావు. నా ప్రస్తుత అనారోగ్యస్థితిలో ఏమీ వ్రాయలేను. మధ్య మధ్య చాలాసార్లు సాహిత్యంయొక్క ధర్మము, రూపము, నిర్మాణం, రంగం, వీని తత్వములు మొదలైన వాటిమీద కొంత చర్చ జరిగిందిగాని, ఇంకా మరొక ముఖ్యమైన అంశంమీద నేటివరకు బహిరంగంగా చర్చసాగలేదను కుంటాను. అది సాహిత్యకళ్యాణ సంబంధంలో దాని ప్రయోజనానికి సంబంధించిన అంశం. సాహిత్యంలో

నిబిడీకృతమై వున్న రసమువల్ల పాఠకులకు మనసుల్లో నిర్మల మైన ఆనందాన్ని కలిగించడమే కాక మానవునిలో అంత ర్భాగంగా వున్న కుసంస్కారాల మూలములపై కూడా సాహిత్యం గొడ్డలిపెట్టు పెడుతుందని అందరూ ఒప్పు కుంటారు. దీనివల్ల మనిషి గొప్పవాడు కాగలుగుతాడు. అతనిదృష్టి ఉదారతతో నిండుతుంది. అతని సహనశీలమైన, క్షమాశీలమైన మనస్సుకు సాహిత్యరసముయొక్క నూతన కృతివల్ల లాభం చేకూరుతుంది.

బెంగాలులోని ఒకపెద్ద సంప్రదాయంలో దీనికి వ్యతి రేకత కనబడుతోంది. సాహిత్యసృష్టితోపాటుగా బాధ, క్షోభకూడా పెరుగుతున్నట్లుంది. నేను మీ ముస్లింసాంప్ర దాయం సంగతే చెబుతున్నాను. కోపం రావడంవల్ల కొందరు వికృతభాషాప్రయోగాలకుకూడా వెనుకాడుటలేదని తెలుస్తోంది. దీనికి కారణం లేకపోలేదని నేననను. కాని వారికోపం తగ్గిపోయిన తర్వాత వారే స్వయంగా ఆ కార ణం ఏమంత పెద్దదికాదని తెలుసుకోగలుగుతారను కుంటాను. కారణం ఏదైనా కానీ, ఇంతవరకూ బెంగా లులో హిందువులు మాత్రమే సాహిత్యచర్చ చేస్తూ వచ్చారు. ముస్లింధర్మము చాలాకాలంబట్టీ దీనియెడల విముఖంగా ఉంది. అయినా కృషికి ఫలితం ఉంటుందిగదా! అందుచేత సరస్వతీదేవి వీరికికూడా వరదానం చేసింది. కొద్దిమందైనా, ముస్లిం సాహిత్యరసికులను నేను మరువ లేదు. కాని అది విస్తృతం కాలేదు. అందుచేతనే క్రోధం

వల్ల కొందరు కొందరు దీన్ని హిందూసాహిత్యం అన్నారు. అయితే ఆక్షేపించినంతమాత్రాన తర్కసమ్మతం కాదుగదా.

అయినప్పటికీ, సాహిత్యకారుల్లో ఎంతనుంది తమ రచనలలో ముస్లించరిత్రను చిత్రించారు? ఎన్ని స్థలాలలో ఇంత పెద్ద సంప్రదాయముయొక్క సుఖ - దుఃఖాలు వివరించారు? అని అడుగవచ్చును. అలాంటప్పుడు వారి సానుభూతిని ఎలా పొందగలుగుతారు? వారి హృదయాన్ని ఎలా స్పర్శిస్తారు అని కూడా ప్రశ్నించవచ్చు. వారి హృదయాన్ని ఇంతవరకూ స్పర్శించలేదని నాకు తెలుసు; అంతేకాక దానికి విరుద్ధంకూడా కనపడుతోంది. తత్ఫలితంగా నష్టం కూడా తక్కువేమీ జరగలేదు. ఇక ఇప్పుడు దానికి ప్రత్యామ్నాయంగా ఏదేనా దారికూడా చూడాలి.

కొంతకాలంక్రింద ఒక ముస్లింమిత్రుడు ఈవిషయమై నావద్ద తన విచారాన్ని ప్రకటించాడు. ఆయన స్వయంగా సాహిత్యకారుడు, పండితుడు. మతద్వేషాలు ఇంకా హృదయాన్ని దృష్టిని కలుషితంచేయని వ్యక్తి. ముస్లిం - హిందూ మతాలు రెండూ ఒకేదేశంలో ఒకేపరిస్థితులలో ఇరుగుపొరుగుగా ఉంటున్నాయి. జన్మతః ఒకేభాష మాట్లాడబడుతూంది. అయినా ఇవి ఇంతదూరంగా, ఇంత ద్వేషపూరితంగా ఎందుకున్నాయంటే ఆశ్చర్యం వేస్తుంది. జీవితంలో సమాజంలో బయటిసంపర్కం ఒకటే. కాని అంతఃకరణ సంపర్కం లేదనడం అబద్ధంకాదు. ఇలా ఎందుకు ఉందిఅని శోధించవలసిన అవసరంలేదు. అయితే నేను ఈ విభేదాన్ని

దుఃఖపూరితమైన ఈ తేడాలను రూపుమాపవలసియున్నది. లేకపోతే ఎవ్వరికీ మేలు చేకూరదు" అని ఆయన అన్నారు.

"ఇది నేను ఒప్పుకుంటాను. అయితే దీన్ని సాధించడానికి ఏం ఉపాయం చెబుతారు ?" అని నే నడిగాను.

"ఒకే ఒక ఉపాయం సాహిత్యం. మీరు మమ్మల్ని ఆకర్షించండి. స్నేహంతో, సానుభూతితో మావిషయాలు వ్రాయండి. కేవలం హిందువులకోసం కే హిందూ సాహిత్యాన్ని సృష్టించకండి. ముస్లిం పాఠకులనుకూడా గుర్తించండి. అప్పుడు బయటికి విభేదాలు ఎంతపెద్దవిగా కనపడ్డా ఇద్దరి రక్తనాళాలలో ఒకే ఆనందం, ఒకే ఆవేదన ఎందుకు ప్రవహించదో చూద్దాం" అన్నా రాయన.

దీనికి నే నన్నాను: "నే నీ విషయాన్నొప్పుకుంటాను. కాని అనురాగంతోపాటు వైరాగ్యం, ప్రశంసతోపాటు తిరస్కృతి, మంచి విషయాలతోపాటు చెడు విషయాలు కథాసాహిత్యంలో అవిభాజ్యమైన అంగాలు. అయితే మీరు వీటినిగురించి ఆలోచించలేరా? క్షమించలేరా? బహుశః ఆలోచిస్తేనే ఒళ్ళు గగుర్పొడిచే శిక్ష విధించాలనుకుంటున్నారా? అలా అయితే అంతకంటే ప్రస్తుతమున్న స్థితే క్షేమకరం."

కొంచెంసేపు ఇద్దరమూ నిశ్శబ్దంగా ఉన్నాము. చివరికి నేనే అన్నాను. "మీలో కొంతమంది మేము పిరికివాళ్ళమని, మీరు వీరులని, హిందువుల కలంనుండి వచ్చే నిందలను సహించమని, దానికి ప్రతీకారం తీసుకుంటామని, అదికూడా చరమావస్థలోనని అంటారు. అదీ నేను ఒప్పు

కుంటాను. మిమ్మల్ని పిసులనడంలో నాకు వ్యక్తిగతంగా ఏమీ అభ్యంతరంలేదు. కాని ఈ పరత్వపు విధానం మారినప్పుడల్లా అందరికంటే మీరే ఎక్కువబాధ లనుభ వించారనేది సత్యమని తెలియచేస్తున్నాను."

యువకమిత్రుని ముఖం పాలిపోయింది. "అయితే ఎప్పటికీ ఈ సహాయ నిరాకరణమే సాగుతుందా?" అన్నాడు.

"లేదు. ఎప్పటికీకాదు. ఎందుకంటే సాహిత్య సేవ కులకు మతం-జాతి అంటూ నేరేలేవు. మూలంలో, హృద యంలో వారు ఒకటే. ఆ సత్యాన్ని స్వీకరించి నేడున్న ఈ అవాంఛనీయ తాత్కాలిక భేదాలను మీరే నిర్మూ లించాలి." అన్నాను.

"ఇప్పటినుంచీ అందుకే ప్రయత్నిస్తాను." అన్నాడా మిత్రుడు.

"కృషిచెయ్యి. నీ కృషికి తోడు ప్రతినిత్యం భగ వంతుని ఆశీర్వాదం లభిస్తుంది" అన్నాను.

('వర్ష వాణి' తృతీయ సంపుటి 1342)

## కాజీ వదూద్ కి

శివపూర్ [హౌరా]
20-3-1918.

రెండురోజుల క్రిందటనే మీ ఉత్తరము, "మిత్ర పరి వారము" అందాయని వినయపూర్వకంగా తెలుపు

తున్నాను. చివరికథ 'హాబీంద్' కాక మిగిలినవన్నీ చదివాను. ఈ రోజుల్లో కథలు చదవగలగడం, ఆ పైన వాటిని ప్రశంసించడం రెండూ కష్టమౌతున్నాయి. పుస్తకాన్ని అందుకుని గ్రంథకర్తకి నాలుగైదు మంచిమాటలు చెప్పి, హృదయపూర్వకంగా ఉత్సాహాన్నిచ్చే అవకాశం దొరకకపోవడంచేత పూర్తిగా ఊరుకుంటున్నాను. మీరు నాకు అట్టి సదవకాశాన్ని కల్పించారు. అందుకు మీకు ధన్యవాదాలు. నిజంగా నేను చాలా సంతోషపడ్డాను. ఇది మీ ప్రథమప్రయత్నమే అయితే భవిష్యత్తులో మీనుండి చాలా ఆశించవచ్చునని వేరే చెప్పనవసరంలేదు.

మీ రచనలో ఉర్దూ శబ్దాలను ఎక్కువగా వాడి మంచి పనిచేశారు. లేకపోతే ముస్లిం పాఠకులు, పాఠకురాండ్రు దీన్ని మాతృభాషగా అంగీకరించి నిస్సంకోచంగా స్వీకరించలేకపోయేవారు. వాళ్ళకెప్పుడూ ఇది హిందువుల భాష, తమదికాదు అనిపిస్తూవుంటుంది. ఇరుగుపొరుగున వుండే ఈ రెండు జాతులలో పరస్పర సాహిత్యస్నేహాన్ని పెంపొందించుటకు ఇది వుత్తమమార్గం. అయితే అందరూ ఈ అభిప్రాయంతో ఏకీభవించకపోవచ్చు. కాని నేను మాత్రం ఈ అభిప్రాయపక్షపాతిని.

మీకు నేను ఒక విషయం గుర్తుచేయాలనుకుంటున్నాను. నేను చాలాకాలంనుంచీ ఈ రంగంలో వున్నవాడిని. అందుచేత కొంత అనుభవం సంపాదించాననుకుంటాను. ఉచితమైన సలహా చెబుతున్నందుకు కోపగించుకోరనుకుంటాను. విషయమేమంటే అన్నిజాతుల్లోనూ

మంచివారూ వున్నారు, చెడ్డవారూ వున్నారు. హిందువుల లోనూ వున్నారు. ముసల్మానులలోనూ వున్నారు. ఈ సత్యాన్ని ఎప్పుడూ మరవకండి. మరొక విషయమేమంటే రచయిత ఎప్పుడూ ఏప్రత్యేకజాతికీ మతానికీ చెంది వుండడు. అతను హిందువు, ముస్లిం, క్రైస్తవుడు, యూదుడు— అన్నీ కూడాను.

భవదీయుడు,
శరచ్చంద్ర చటోపాధ్యాయ.

—...—

## శ్రీ ఉమాప్రసాద్ ముఖోపాధ్యాయకు

సామతాబేడ్; పానిత్రాస్, పి. ఓ.
హౌరాజిల్లా.
25 ఆషాఢం, 1333.

చిరంజీవి ఉమాప్రసాద్,

మొన్ననే నీ ఉత్తరం అందింది. ఎప్పటివలె ఈ మాటుకూడా, భవిష్యత్తులో కూడా అందరికంటె నువ్వు ముందుండాలని నేను కోరుకుంటున్నాను. నీ చదువు బాగా సాగలేదని నాకు తెలుసు. అయినా నిన్ను ఎవరైనా దాటి ముందుకు పోవాలంటే అది తేలికైనది కాదు.

ఆ తర్వాత మళ్ళీ నేను కలకత్తా వెళ్ళలేదు. ఇక్కడి

ఈ చిన్ని కైవారంలోనే ఏదో రోజులు గడిచిపోతున్నాయి. కాని, ఒకసారి పట్టణం వెళ్ళివస్తే సద్దుకోవడానికి నాలుగైదు రోజులైపోతాయి.

అంతే కాకుండా ఏర్లాలు, బురదలో వెళ్ళడానికి దారికూడా బాగులేదు. అందుకు శక్తీలేదు, ప్రయత్నమూ లేదు. కొద్దిరోజుల క్రిందట చీకటిరాత్రిలో రెండుమెట్లు ఒకటి అనుకుని దిగడంవల్ల ఎంత జరగాలో అంతా జరిగింది. బయటకేమీ దెబ్బ తగలకపోయినా, వీపు, నడుము నెప్పి ఇంకా పూర్తిగా తగ్గలేదు.

మనఃపూర్తిగా పరీక్షకు చదును. కుముదబాబును కలుసుకుంటే ఆయన ఉత్తరం అందిందని చెప్పు. వ్యాసం సంగతి నాకు తెలియదు. బహుశా పోయి ఉండవచ్చు.

నీ పుస్తకం ఉంచి, చివరి అధ్యాయాలు చాలావరకూ చూచాను. కాని ముందు పరీక్ష పూర్తికానీ.

అందరూ నన్ను వ్రాయమంటారు. కాని ఏమి వ్రాయాలోమాత్రం అర్థం కావడంలేదు. అంతా అర్థరహితంగాను, అనవసరంగానూ కనబడుతోంది. ఇతర సాహిత్యకారులవలె నా మనస్సును ఒకసారి ప్రాతకాలపు 'సాహిత్యసేవ'లోనికి తీసుకువెళ్ళగలిగితే మళ్ళీ ఎన్నైనా 'బిందోబిడ్డ'లను 'చరిత్రహీన్'లను రచించగలను. కాని ఈ జీవితంలో ఆ రోజులు తిరిగివస్తాయని అనుకోను. వ్రాసినంత మాత్రాన ఏమౌతుంది అని ఎప్పుడూ అనుకుంటూ

వుంటాను. ప్రజలకు ఆనందం లభిస్తుందా? ఆనందం లభించకపోయినా మొట్టమొదట అదిపొందే అధికారాన్ని సంపాదించాలి. అప్పుడు 'బిందుగారబ్బాయి' 'రాముని బుద్ధిమంతతనం' వంటివి కుప్పతిప్పలుగా వ్రాసేవారు చాలా మంది వస్తారు.

నిర్మల్ భవానీపూర్‌లోనే ఉన్నాడా? హస్త సాముద్రికం నేర్చుకోవాలనిపిస్తోంది. నా స్నేహపూర్వక ఆశీస్సులు అందుకో.

శరచ్చంద్ర చటోపాధ్యాయ.

---

12 శ్రావణము 1333

చిరంజీవి ఉమాప్రసాద్,

నిన్న నీ ఉత్తరం అందింది. ఇంతకు ముందుకూడా ఒక ఉత్తరం అందింది. కాని యథాసమయంలో సమాధానం వ్రాయలేకపోయాను.

ఇప్పుడే ఒక పడవనడిపేవానికి చికిత్సచేసి వచ్చాను. ఒళ్ళంతా టించర్ అయొడిన్ వ్రాసి, కాపుకాచే ఏర్పాటు చేసి వచ్చాను. నిన్న రాత్రి అతని నావ మునిగిపోయి అతనిపైగా దాటిపోయింది.

ప్రస్తుతం ఒక విషయంలో నిశ్చింతగా ఉన్నాను. ఈ ఇంటిని రూపనారాయణుడికి (నది) సమర్పించి సుఖంగా ఉన్నాను. వరదల్లో ఈ యేరు ఎంత భయంకరంగా ఉంటుందో ఈసారు చూడగలిగాను. మీరు ఇదివరకు నడిచినచ్చో ఆనకట్ట ఇప్పుడు లేదు. నేటి ఈ వరదలో అది

నామరూపాల్లేకుండా కొట్టుకుపోవచ్చు. ఆ తర్వాత ఇంక అంతా నీటిమయమే అవుతుంది. బెంగాలులో షడ్ ఋతువుల అర్థమేమిటో ఇక్కడ సంవత్సరం పూర్తిగా ఉంటేనే గాని తెలుసుకోలేము. ఇదీ ఒక పెద్ద లాభమే.

ఆ విషయమై కుతూహలంగానే ఉంది. అయితే సరియైనవాళ్ళ చేతుల్లోనే ఉందని తెలుసు. ఉపాయముంటే సరేసరి. దానికి తల బ్రద్దలుచేసుకోవడం అనవసరం. కాని చివరికి ఏమౌతుందో తెలిసినదేకదా. 10, 15 రోజులవరకూ వర్షం, వరదతర్వాత ఇక్కడ దిబ్బవెయ్యడం, అక్కడ గండికొట్టడం అలాగే గడచిపోతుంది.

ఫౌంటెన్ పెన్ చెడింది. టార్చి విరిగింది.

నీ వకీలు పరీక్షాఫలితం ఏమైంది ?

నా ఆశీర్వాదాలందుకో. శరీరస్థితి అంతగా చెడిపోలేదు.

శరచ్చంద్ర చటోపాధ్యాయ.

—...—

18 ఆశ్వయుజము 1314.

చిరంజీవి బిజూ,

చాలాకాలంనుంచి నీ నుండి ఉత్తరంలేదు. ఎక్కడున్నావో కూడా సరిగా తెలియలేదు. నా ఆరోగ్యం ఇంతకు ముందుకంటే బాగుంది. రెండు ఇమిటీన్ ఇంజక్షన్లవల్ల కొంచెం లాభించింది. రక్తం పడటం ఆగిపోయింది. సైనోజెజీను, గ్రుడ్లు, గజ నిమ్మపండ్లు నియమితసమయాల్లో పుచ్చుకుంటూ ఉండడంవల్ల ఆరోగ్యం కొంచెం బాగు

న్నది. కాని బయటచూస్తే మాత్రం ముఖం బాగా డీలా పడినట్లు కనపడుతుంది. పోనీలే. 'భారతలక్ష్మి' అనే క్రొత్త మాసపత్రిక సంపాదకుడుగా ఉండడానికి అంగీకరించాను. చివరివరకూ రాజీపడుతూనే ఉండాలిగదా. ఇవాళ ఒక ఉత్తరం వ్రాశాను. అందులోని షరతులు వాళ్ళు ఒప్పుకుంటే సంపాదకత్వం వహిస్తాను. ప్రపంచంలో ఎక్కువ మంది వ్యక్తులకు ఏమి జరుగుతూ ఉంటుందో నాకూ అదే జరుగుతోంది. అంటే ప్రపంచంలో తెలివైనవాళ్ళూ - తెలివితక్కువవాళ్లూ ఇద్దరూ ఉన్నారు; ఏదో ఒకపక్షం విజయం సాధిస్తూఉంటుంది. ఎక్కువ కాకపోయినా 4, 5 వేలు ప్రోగుచేశాను. 'భారతలక్ష్మి'లో చేరి ఇదంతా అందులో పెట్టాలనుకుంటున్నాను. వారు నాకు వాల్గనభాగం ఇస్తారు. ఇప్పుడింక ప్రపంచజ్ఞానం తెలిసినవాళ్ళలాగా వ్యవహరిస్తాను. అంటే మోసపోను అన్నమాట. దసరా తర్వాతనే అన్నివిషయాలూ సవివరంగా నిశ్చయిస్తాను. కాని, అప్పుడే సాహిత్యరంగంలో పరిచితులూ, అపరిచితులూ చాలామంది తమ రచనలు స్వీకరించి అడ్వాన్సుగా కొంత మొత్తాలు పంపమని వ్రాస్తున్నారు. ఆ శక్తే నాకు ఉంటే! అదే నా కిప్పుడు అత్యంత అవసరం.

నిన్ను చూచి చాలారోజులైంది. జ్వరం తగ్గిపోతే ఒకసారి మీారే ఎందుకు రాకూడదు. నా స్నేహపూర్వక ఆశీర్వాదా లందుకో.

—అన్న.

24 అశ్వినీదత్తరోడ్, కాలీఘాట్,
కలకత్తా,
12 కార్తీకం 1342.

చిరంజీవి బిజూ,

నిన్న గ్రామంనుండివచ్చేసరికి నీ వుత్తరం అందింది. పెద్దకోడలు నిమోనియాలో మంచం పట్టిందని కబురువచ్చింది. అందుచేత త్వరగానే తిరిగివచ్చాను. కాని పరిస్థితి అంత ప్రమాదంగా లేదు. బహుశా త్వరలోనే తగ్గిపోవచ్చు. లేకపోతే అసలే బీదవాణ్ణి. ఈ కలకత్తాలో చికిత్స చేయించాలంటే భరించలేను.

నా 61వ జన్మదినసందర్భంలో ఉదారమైన భాషలో కవి నన్ను ఆశీర్వదించారు. హృదయపూర్వకంగా నా సుఖాన్ని కాంక్షించారు. 'ఆనందబజార్ పత్రిక'లో అచ్చయిందంతా నీకు పంపబడింది. ఆయన స్వదస్తూరితో వ్రాసి (ఆశీర్వాదం) నాకిచ్చారు. నువ్వు వచ్చినప్పుడు వారి ఇతర ఉత్తరాలవలెనే ఇదికూడా దాచి ఉంచడానికి నీకు యిస్తాను. అప్పుడీ లేంఖాశము నాకు తిరిగి ఇవ్వవుగాని. నేను ఆరోగ్యంగా లేనుగాని, మునుపటికంటే బాగున్నాను. జ్వరం రావటంలేదు. నా ఆశీర్వాదాన్ని అందుకో. నీఅన్నలెవరైనా ఉంటే క్షేమం అడిగినానని చెప్పు.

శుభాకాంక్షి,
శరశ్చంద్ర చటోపాధ్యాయ

—....—

## శ్రీ రవీంద్రనాథ టాగూరుకు

శివపూర్,

29 పుష్యము 1324

పాదసన్నిధికి,

ఇవాళ మేము మీవద్దకు వచ్చేవారమే కాని దారిలో శ్రీయుత ప్రమథబాబువద్దనుంచి టెలిఫోను చేస్తే మీరు బోల్‌పూర్‌లో ఉన్నారని తెలిసింది. బహుశా మాఘోత్సవాలకు వస్తారేమో. కాని అప్పుడు మిమ్మల్ని కలుసుకోవడం చాలాకష్టం.

నా పేటలో ఒక చిన్న సాహిత్యసంఘం ఉంది. నెలకో - రెండు నెలలకో ఒకసారి ఎవరో ఒకరి ఇంట్లో సమావేశమౌతూ ఉంటాము. ఇది చాలా చిన్నవిషయం అయినప్పటికీ క్రిందటిసారి ప్రమథబాబును పట్టుకోగలిగాము చివరకు ఆయన ఆనాటి సభకు అధ్యక్షత వహించారు.

చాలారోజులనుంచి ఈమారు సభకు మీరు విచ్చేయగలిగే అవకాశం ఉంటుందేమోనని ఆలోచిస్తున్నాము. మీరు యింటికి తిరిగివచ్చిన తర్వాత మీరు అనుమతిస్తే మీవద్దకువచ్చి నివేదించుకుంటాము.

సేవకుడు,

శరచ్చంద్ర చటోపాధ్యాయ.

—o—

శివపూర్ (హౌరా)

26 వైశాఖము 1329.

పాదసన్నిధికి,

మీరు నాయందు చాలా కోపగించుకున్నారని పిల్లల

ద్వారా విన్నాను. ఉద్రేకంలో కోపంతో మీ గురించి సత్యంకాని విషయాలు చెప్పియుండవచ్చు. అయితే వాటి తప్పొప్పులు తెలుసుకోవాలని మీవద్దకు వచ్చిన వ్యక్తి కూడా ఏమీ తక్కువ అపరాధం చేయలేదు. ఇంగ్లండు ప్రవర్తనకు మీరు చాలా బాధపడ్డారు. అదికూడా ఆ పంజాబుకు సంబంధించిన ఉత్తరాన్ని గురించే. ఆయన ఇవి వ్రాయకపోతే ఇదంతా జరిగేదేకాదు. ఈ విషయాలు నే నప్పుడు ఎలా చెప్పానో నా కిప్పు డేమీ గుర్తులేదు. సాధారణంగా నేను అబద్ధాలు కల్పించి చెప్పను. కాని అది పూర్తిగా అసంభవమనీ నేను అనను. ఈమారు మీరు ఇంగ్లండునుంచి వచ్చినతర్వాత చాలా మారిపోయారనీ, బెంగాలీలపట్ల మునుపటిమాదిరిగా ప్రేమ, మమత్వం మీలో లేవనీ, చరఖా, సహాయనిరాకరణం మొదలైన వాటిపై మీకు ఏమాత్రమూ నమ్మకం లేదనీ నే నన్న మాట వాస్తవం.

ఒకరోజున కొంచెం కోపంతో మీవద్దనుండి వచ్చేశాను. బహుశా, ఆ తర్వాతనే కొన్ని అయదార్థవిషయాల ప్రచారం జరిగియుండవచ్చు. అప్పుడు నా మనస్సులో ప్రజలు తప్పు అర్థం చేసుకుంటే చేసుకోనీలే అనే భావముంటే ఉండి ఉండవచ్చు.

మీ యెడల నేను చాలా పెద్దతప్పు చేశాను. అయితే మొదటిసారి కనుక క్షమించండి. మీవద్దకు కాక మరే పెద్దవారివద్దకూ నేను బుద్ధిపూర్వకంగా వెళ్ళను. నాకు

ఆ మార్గం నా తప్పువల్లనే మూసుకుపోయింది. ఆలోచిస్తే దుఃఖం కలుగుతుంది.

మీకున్న అనేకమంది శిష్యుల్లో నేనొకడను. ఇంత వరకూ వారివలె నేనుకూడా ఎప్పుడూ మిమ్మల్ని నిందించలేదు. కాని ఈమారీ దుర్దశ ఎందుకు పట్టిందో నాకే తెలియడం లేదు.

నా ప్రణామము లందుకోండి.

సేవకుడు,
శరచ్చంద్ర చటోపాధ్యాయ.

—....—

శివపూర్ [హౌరా]
26 వైశాఖము 1336.

పాదసన్నిధికి,

మీరు స్వల్ప స్వార్థంకోరకు దేశానికి హానిచేశారు అని అంత పెద్దనింద మోపేఉంటే ఆ పైన ఉత్తరంవ్రాసి క్షమార్పణకోరడం మిమ్మల్ని ఎగతాళిచేయుటే కాక మిమ్మల్ని కష్టించుట అవుతుంది. అందువల్ల మీ ఉత్తరం ఇంత కఠినంగా ఉండడంలో ఆశ్చర్యంలేదు.

ఈ పెద్ద అపరాధం విషయాన్ని మీ వరకూ తెచ్చి చెప్పినవారు దానికి హద్దులంటూ లేకుండాచేశారు.

ఇక నేనేం చెప్పను. నా ప్రణామము లందుకోండి.

సేవకుడు,
శరచ్చంద్ర చటోపాధ్యాయ.

—...—

శివపూర్ (హౌరా)
2 మాఘం - 1330

పాదసన్నిధికి,

ఎన్నో పనులమధ్య క్షణంకూడా మీకు తీరికలేదనే విషయాన్ని మే మందరం ఎరుగుదుము. అయినప్పటికి మీరు మాట్లాడినంత తేలిగ్గా గీతం వ్రాయగలరనీ, అది నా నాటకంలోని లోపాలన్నీ కప్పగలదనీ అనుకుని మీకు వ్రాశాను.

సత్యేంద్ర నేడుంటే మీ యీ పుత్తరాన్ని చూపి అతనిచే వెంటనే పాట వ్రాయించుకునేవాడిని. అతనికి ఈ పుత్తరం ఒక పేరిరణగా ఉండేది. కాని అతను పరలోకంలో ఉన్నాడు. పోనీ మరెవరినైనా అడుగుదామా అంటే ఎవరూ లేరు.

కలకత్తా వస్తే మీకు ఊపిరిపీల్చుకునే తీరికకూడా ఉండదు. అప్పుడీ విషయ ప్రసక్తి తెచ్చి నే నేమీ గలభా చేయను. నా శతకోటి వందనాలు స్వీకరించండి.

సేవకుడు,
శరచ్చంద్ర చటోపాధ్యాయ.

---

సామతాబేడ్, పాణితాస్
హౌరా 26 ఆశ్వయుజం 1336.

పాదసన్నిధికి,

దసరా సందర్భంలో నా ప్రణామములు స్వీకరించండి. ఈమధ్య మీరు ఎన్నో గురుతర బాధ్యతలలో మునిగిపోయి శాంతినికేతన్‌లో కూడా ఉండలేకపోయారు. అందుచేత వందనాలు అర్పించడంలో ఆలస్యమైంది.

కాలప్రవాహంతోపాటు నాకు లభించిన మీ ఆశీర్వాదం, నాకొక గొప్ప బహుమానము. మీనుండి లభించే చిన్నవస్తువుకూడా ఏ సాహిత్యకారునికైనా గొప్ప నిక్షేపం అవుతుంది. దాన్ని శిరోధార్యం చేస్తాను.

నా గీత బాగుంది. 31 భాద్రపదాన మీరు కలకత్తా రావడం తటస్థించలేదు. లేకపోతే ఆరోజున జరిగిన అత్యాచారాలు చూచి ఎంతో బాధపడేవారు. అన్నిటికంటే కష్టం కలిగించేదేమంటే నా సమవయస్కులగు సాహిత్యకారులే ఈ ఉపద్రవాలను తెచ్చిపెట్టారు. వాళ్ళందరు వాటికి సంతోషపడితే నేను సంబంధంలేకుండా ఉన్నాను. అదే మంచిపని చేశాననుకుంటాను. గత జయంతి ఉత్సవంలోకూడా వీళ్ళుమీ తక్కువ గల్లంతు చేయలేదు. నేను స్వయంగా ఒకసారి మీకు ప్రణమిల్లవద్దామనుకుంటున్నాను. కాని ఎవరైనా ఏమైనా అనుకుంటారేమోనని రాలేకపోతున్నాను.

మీ ఆరోగ్యం ఇప్పుడెలావుంది? ఆరోగ్యం ఇంత

శిథిలమైనా మీ రింత ఎక్కువపని ఎలా చేయగలుగుతు న్నారో ఆశ్చర్యంగా ఉంది.

సేవకుడు,
శరచ్చంద్ర చటోపాధ్యాయ.

—...—

## శ్రీ చారుచంద్ర వంద్యోపాధ్యాయకు

హౌరా రైల్వేస్టేషన్.
1 ఏప్రెల్ 1930

చారుసోదరా!

నేను ఢక్కాకు బయలుదేరికూడా తిరిగి ఇంటికి వెళు తున్నాను. ఇవాళ కలకత్తాలోని బళ్ళచాళ్ళ సమ్మెచేయడం వల్ల అంటే సి. యస్. పి. సి. ఎ. అధికారులకు వ్యతిరేకంగా సత్యాగ్రహం చెయ్యడంవల్ల పెద్దదుర్ఘటన సంఘటిల్లినది. సార్జంట్లు లాఠీఛార్జిచేశారు. ఫోర్టునుంచి తెల్లసైనికులువచ్చి కాల్పులు జరిపారు. పలుగురు పురుషులు చనిపోయారట.

ఇది కలకత్తావిషయం. హౌరాలోకూడా సి. యస్. పి. సి. ఎ. వుందిగదా. నేను దాని అధ్యక్షుణ్ణి. ఇదొక పెద్దడిపార్టుమెంటు. నేటికి ఎలాగో అలాగా హౌరామేజి స్ట్రేటు,పోలీసు సూపరింటెండెంటు కలసి అల్లరులను ఆపారు. అయినా ముందేమౌతుందో తెలియదు. నేను ఈ డిపార్టు మెంటు అధికారిని కావటంవల్ల పట్నాన్నివదిలి వెళ్ళటానికి

వీల్లేదు. అందువల్ల దారిలోంచే తిరిగివచ్చేశాను. రేపే మళ్ళీ తిరిగిరావలసివుండేది.

అల్లర్లు తగ్గి, ఆఫీసు అదుపులో పెట్టుకొన్నతర్వాత నిన్ను కలుసుకొంటాను. క్షమిస్తావని ఆశిస్తాను.

నీ శరత్.

—...—

శివపూర్, హౌరా,
21 ఏప్రెల్ 1925

చారుసోదరా!

నీవుత్తరం ఇప్పుడే అందింది. ఇవాళ వుత్తరాలువ్రాసే స్థితిలో నామనస్సులేదు. అయినా నీ కీ విషయాలు తెలుపకుండా వుండలేను. వచ్చేటపుడు త్రోవలో ఒక చచ్చిపోయిన దూడ పడివుంది. నీ కా సంగతి గుర్తుండివుండవచ్చు. ఆ తర్వాత ఒక పీకనులిమివేయబడ్డ కోడి కనిపించింది. దారిలో ఇన్ని మృతశరీరాలు ఎందుకు కనబడ్డాయో తెలీడంలేదు. దారిలో ఒక వృషభముకూడా కనిపించినదని నీ వన్నావు. కాని నేను చూడలేదు.

ఆ తర్వాత ఇంక మీరు వెళ్ళిపోయారు. బండి బయలుదేరిన తర్వాత దారిపక్కన గ్రద్దలగుంపుచేరివుంది. ఒక కుక్క చచ్చిపోయింది. - నాకుక్క ఆస్పత్రిలోవుంది. నా మనస్సు ఎంత వ్యథచెందిందో చెప్పలేను. ఇంగ్లీషు వాళ్ళవలె నేను మూఢనమ్మకంతో లేనుగాని, ఒక్కసారిగా త్రోవలో మూడుచావులు చూడటం నామనస్సును కలతపెట్టింది.

ఇంటికివస్తే భేలూ కులాసాగానే వున్నదని ఆస్పత్రి నుంచి పుత్తరం వచ్చివుంది.

27 ఏప్రిల్ 1925

గురువారం యింటికి తీసుకువచ్చాను. తర్వాత గురువారం వుదయం 5 గంటలకు భేలూ చనిపోయింది. నా యిరవైనాలుగుగంటలనేస్తం యికలేదు. ప్రపంచంలోయింత బాధకలిగించేవిషయాలు వుంటాయనీ అనుకోలేదు. అందుచేతనేనేమో నాకీ స్థితి కలిగింది. చాగూ!మరొక విషయం తెలుసుకున్నాను. ఈ ప్రపంచంలో objective ఏమీ లేదు; వున్నదంతా subjective మాత్రమే. కాకపోతే కుక్క తప్ప మరేమీ లేదా! భరతరాజుకథ ఎప్పుడూ అబద్ధంకాదు.

నీ శరత్

27 మాఘం 1942.

ప్రియ చారుసోదరా!

ఈ మధ్య యింటికి వెళ్ళాను. పల్లెలోని మట్టియిల్లు - రూపనారాయణనది ఈ రెండింటి మాయకు లోనై నేను పల్లెలో ఎక్కువకాలం వుండలేకపోయాను. వీటి మాయలన్నింటిని ఛేదించుకుని నేను విముక్తి పొందేరోజు దగ్గరపడుతోందా అనిపిస్తోంది. పాతస్నేహితు లందరూ నాకంటెముందుగానే వెళ్ళిపోయారు. వారిని నేనెప్పుడూ స్మరించుకుంటూవుంటాను. ఈమధ్యనే స్వర్గీయ విపినగుప్త శ్రాద్ధకర్మలకు పిలిచారు. శివపూర్‌లో ఎన్నిసాయంత్రాలు వీరితో చర్చల్లో గడిపానో! నువ్వు పాతస్నేహితులలోనే లెక్క. కాని కనీసం

నేను నీకంటే ముందుగానే చాలించుకుంటాననుకుంటాను. నిరంతరం గతవిషయాలే స్ఫురణకు వస్తున్నాయిగాని భవిష్యత్తువేపు దృష్టి పోవడమేలేదు. ఈ మాటలన్నీ వదిలేద్దాం. పేటితో నీమనస్సును కష్టపెట్టడం అనవసరం.

నాకు గౌరవబిరుదు లివ్వాలని నువ్వుసూచిస్తూ వ్రాసిన వుత్తరాలు రెండూ అందాయి. నాకు సన్మానం చేయాలని అనుకున్నవారి ప్రేమాభిమానాలే నాకు పెద్దసన్మానం. ఇది తలచుకుంటే కడుపునిండిపోతోంది.

ఢక్కాకు రాగలిగితే నువ్వు ఆహ్వానించకపోయినా నీ వద్దనే మకాం వేస్తాను. నీ భార్యకు నా గౌరవపూర్వక నమస్కారాలు అందజేసి ఆమె ఆహ్వానాన్ని అగౌరవపరచనని చెప్పు.

నీ శరత్.

---

## శ్రీ అతులానందరాయ్‌కు

కళ్యాణీయాషు,

శ్రావణమాసం 1340 న 'పరిచయ' పత్రికలో శ్రీమాన్ దిలీప్‌కుమార్‌రాయ్‌కి వ్రాయబడిన రవీంద్రనాథుని 'పత్రసాహిత్య కీ మాత్ర' విషయంలో నువ్వు నా అభిప్రాయాన్ని కోరావు. ఈఉత్తరం వ్యక్తిగతమైనప్పటికీ కూడా జనసాధారణలో ప్రచురింపబడినది గనుక, అందరూ చదవడానికి వుద్దేశింపబడిందన్నమాటే! కానీ,

నాలుగేసి పేజీల పొడుగాటి వుత్తరంలో చివరిపంక్తుల్లో 'కొంతపైకం పంపు.' అని వ్రాసినట్లు. 'యూరపు అంతా త్వరలోనే తనయంత్రాలు, ధనమూ, దస్కమూ, తుపాకులూ, ఫిరంగులూ, మానమర్యాదలూ – అన్నిటితో ఒక్కసారిగా మునిగిపోతుంది.' అనేదే రచయిత అభిప్రాయమైతే – ఆ పరిస్థితిని మనం బతికివుండగా చూడగలుగుతామా?

అయినా యింతేగాక అనేకమందివిషయంలో కూడా ఆ 'కవి' ఆశలు వదలిపెట్టుకున్నాడు. మీరందరూ– వారిలో నేనుకూడా ఒకడినని సందేహించారు. అది అసంభవం కాదనుకుంటాను. అంటే యీ నిబంధనలో కవిగారి ఫిర్యాదు ఏమిటంటే, వాళ్ళు మథించిన ఏనుగులు; వాళ్ళు ఏదో వాగుతుంటారు. కుస్తీలు పడుతుంటారు. కసరత్తు చేస్తుంటారు. Problem ను Solve చేస్తుంటారు' అని.

ఈమాటలన్నీ ఎవరు ఎవరిని అన్నారో – అన్నప్పటికీ, అందంగా లేవు. చెవులకు వినడానికి యింపుగా లేవు, ఇవి వ్యంగాన్ని, మనస్సులోని ఒకవిధమైన 'ఇరిటేషన్'ను కలిగిస్తుంది. అందులో 'కళ' వుద్దేశం వ్యర్థమైపోయింది. శ్రోతగణపు మనస్సులుకూడా భిన్నమైపోయాయి. అందును గురించి మనోవ్యథ ప్రకటించడం, ఏవిధంగా అవసరమో, ఆవిధంగానే ప్రతీకారంకూడా వ్యర్థమే! వారు ఏవిధంగా చిలకపలుకులు పలుకుతున్నారో, ఎక్కడ కుస్తీపట్లు పడుతున్నారో, నిరూపించమని ఆ వృద్ధకవిని నిలదీసి అడగడం కూడా అప్రాసంగికమే! నా చిన్ననాటిసంగతి ఒకటి గుర్తుకు

వస్తుంది. మేమంతా ఆటలాడుకుంటున్న సమయంలో 'ఫలాని వాడు మైలతోకొక్కాడని' ఒకడు అరిచాడు. ఇక చేసేదేముంది? అంతా వ్యర్థమే! ఎక్కడ మురికివుందో, ఎవరు అరిచారో, ఎవరు చూశారో, అది అసలు 'మైలా', 'పేడా' అదంతా వృథాయే! ఇంటికివచ్చాక వాళ్ళ అమ్మమాత్రం వాడిని తలారస్నానం చేసి,గంగాజలం నెత్తిన చల్లుకోకండామాత్రం యింట్లోకి రానీయలేదు. ఎందుకంటే, వాడు మైలపడి పోయాడు. ఇక్కడకూడా మనస్థితి అలాగే వుంది.

'సాహిత్యకి మాత్ర' యింకా అలాంటివే 'కవి'గారి వ్యాసాలను చదివి అర్థంచేసుకునే జ్ఞానం నాలోలేదని నేను అంగీకరిస్తాను. వారి వుపమానాలు, వుదాహరణాల్లో — దుకాణాలువస్తాయి. జంతుజాలాలూ, ఏనుగులు, గుర్రాలూ వస్తాయి. మానవసామాజిక సమస్యల విచారణలో స్త్రీ — పురుషుల పరస్పర సంబంధవిచారణ వివరంలో యివన్నీ ఎందుకు వస్తుంటాయో, నాకు తెలియకండా వుంది. విన డానికి బాగున్నప్పటికీకూడా, అతి తర్కం మాత్రం కాజాలదు.

ఒక దృష్టాంతరం యిస్తున్నాను. కొన్నిరోజులక్రితం హరిజనులకు విరుద్ధంగా జరిగిన అన్యాయానికి బాధపడి వారు — ప్రవర్తనసంఘానికీ, మతిబాబుకూ వుత్తరం వ్రాశారు. అందులో వారు — 'బ్రాహ్మణయువతి పెంచిన పిల్లి ఎంగిలిమూతితో వచ్చి ఆమె ఒడిలోకూర్చుంటే, ఆమె పవిత్రతపోదు. ఏమీ ఏవగించుకోదు.' అనివ్రాశారు. ఏవగించుకోనిమాట నిజమే! కానీ, యీ వుదాహరణవల్ల

హరిజనులకు ఈయన సాధించిపెట్టిందేమిటి? ఏసమస్య పరిష్కారమై పోయింది? పిల్లి తర్కంతో, పిల్లినిపుదాహరణ సాకుతీసుకొని ఆ బ్రాహ్మణస్త్రీవద్దకుపోయి - 'పిల్లి లాంటి అతి నికృష్టజీవి నీవళ్ళో కూర్చున్నప్పుడు నీవేమీ అడ్డుచెప్ప లేదు. అందువల్ల అతి ఉత్కృష్టమైన నేను నీ ఒళ్ళో కూర్చున్నప్పుడు, నీవు ఏవగించుకోకూడదు-' అని చెప్పలేము గదా? పిల్లి ఎందువల్ల ఒళ్ళోకూర్చున్నదో, మిడత ఎందు కోసం కంచంమీదకు ఎక్కిందో, ఈ తర్కాలను ప్రవేశ పెట్టి మనుష్యులపట్ల, మనుష్యుల సమస్యలపట్ల, న్యాయాన్యాయాలనూ పరిష్కరించలేము. ఆ పుపమానాలు విన డానికి బాగా పుంటాయి. చూడ్డానికి కళ్ళు మిరుమిట్లు గొలుపుతాయి. కానీ, దాన్ని బాగా పరకాయించి చూసి నప్పుడు, అది ఎంత విలువైనదిగా కనిపించినా, సారహీన మైనదేనని తెలుసుకోగలుగుతాము. గొప్పదైన ఫ్యాక్టరీని యీనాడు చాలామంది 'అపకారం కలగచేస్తుందనే' నెపాలువేసి నిందిస్తున్నారు.

ఆధునికకాలంలో కార్ఖానాలనుగురించి చాలామంది నిందిస్తున్నారు. 'రవీంద్రుడు' కూడా నిందించాడు. ఇందులో దోషంలేదు. పైగా యిదొక ఫాషనై పోయింది. తెలిసో, తెలియకో బాగా వస్తుసంపర్కంలో పడిపోయాము. కారణం - సుఖదుఃఖాల హేతుపులుకూడా జటిలమైపోయాయి. జీవన ప్రమాణాలుకూడా మారిపోయాయి. రైతుల జీవితాలకీ, పీరిజీవితాలకీ పోలికే కనబడ్డంలేదు. ఈ విషయాన్ని తీసుకొని మనం విచారించవచ్చు. కానీ, ఎవ

రైనా వీటి నానారకాలైన సంఘటనలను తీసుకొని కథగా తయారుచేసినట్లయితే – అది సాహిత్యమెందుకని కాదు ? కవిగారుకూడా కాదనడంలేదు. ఆపద ఎక్కడంటే సాహిత్యనిబంధనలను వుల్లంఘించకూడదని మాత్రమే ! కానీ, దీని పర్యవసానం ఎలా నిర్ణయించగలం ? పోట్లాడుకొనీ, కొట్లాడుకొనీ, తిట్టుకొనీ – కాదుగదా? కవిగారు 'సాహిత్యంయొక్క చిరంతనమూలం నీతిననుసరించినట్లయితే, అది నిర్ణయమవుతుంది.' అంటారు. మూలనీతి రచయిత మేధస్సూ, అనుభవమూ స్వకీయ రసోత్పత్తి, ఆదర్శాలే కాక – యింకేమైనా వున్నాయా ? 'చిరంతన' కోరిక శారీరకబలంతో యివ్వవచ్చు కానీ, యింకొకవిధంగా కాదు. చిరంతనమైనకోరిక మృగతృష్ణలాంటిది.

కవిగారు అన్నారు. 'నవలాసాహిత్యానికికూడా యిదే దశ పట్టింది. అది మానవ ప్రాణాల రూపవిచారాల స్తూపంక్రింద అణగారిపోతుంది' కానీ, దీనికి ప్రత్యుత్తరంగా 'నవలాసాహిత్యానికి ఆ గతి పట్టలేదు. మానవతత్వ విచారం అనే స్తూపం అడుగున అదేమీ అణగారిపోలేదు. విచారతత్వమనే సూర్యకాంతిలో ఉజ్జ్వలమై ప్రకాశిస్తోంది.' అని ఎవరైనా అంటారు. అలాంటప్పుడు ఏ దృష్టాంతరాలతో వారినోరు మూయించగలం ? దీనితోపాటు ఏదో విషయం అప్పుడప్పుడూ వినవస్తూవుంది. రవీంద్రనాథుడు కూడా మొదటదాన్ని ప్రచారంచేశాడు. 'ఒకవేళ మనుష్యుడు కథల నివాసస్థానానికి వచ్చి, కథను వినాలనుకున్నప్పుడు, అతను స్వభావసిద్ధంగా మారిపోతాడు.' అని

ఆయన అన్నారు. ఈమాటను వప్పుకుంటూకూడా, ఒకవేళ పాఠకులు 'అవును! మేము స్వభావసిద్ధమైనవారమే! కాలం మారిపోయింది. వయస్సుకూడా పెద్దదై పోయింది. అందువల్ల రాజకుమారుల కథలనూ, కప్ప కథలనూ మేము వినలేము. దానితో మా మనస్సు నిండదు' అని అంటే ఆ జవాబును నేను 'దుర్నీతి' అని అనను. 'కథ వ్రాయాలనుకున్నప్పుడు తత్త్వవిచారం చేయగలశక్తిని రచయిత విసర్జించనవసరంలేదు'. అని పాఠకులే చెప్పగలరు. కవిగారు మహాభారతమూ, రామాయణమూ తీసుకొని 'రాముని చరితమూ', కృష్ణుని చరితమూ'- సమీక్షచేసి, ఆ రెండు చరిత్రలూ ఎందుకూ పనికిరానివని జమకట్టారు. ఈ విషయాన్ని నేను విమర్శించను. ఎందుకంటే, ఆ రెండుగ్రంథాలు కేవలం ధర్మగ్రంథాలుకూడాను! బహుశా చరిత్రలుకూడాను! ఆ రెండుచరిత్రలూ సాధారణ నవలలవలెనే వ్రాసినప్పటికీ, చరిత్రలు మాత్రమేనని భావించకూడదు. అందువల్ల ఆ విధంగా-ఆ గ్రంథాలనుసైతం సామాన్యమైన కావ్యాలు, నవలలతో కొలవడం - నాకు భయంగా వుంటుంది. ఉత్తరంలో కవిగారు యింటలెక్ట్ 'Intelect' అనే శబ్దాలను చాలా వుపయోగించారు. కొన్నిచోట్ల 'విద్య' అనే అర్థం వచ్చేట్లు, మరికొన్నిచోట్ల 'జ్ఞానం' అని అర్థంవచ్చేట్లు ప్రయోగించారు. problem శబ్దంకూడా అలాగే వుంది. నవలలో ఎన్నోరకాలైన problem (సమస్య)లు వుంటాయి. వ్యక్తిగతం, నీతిగతం, సామాజికం-సాంసారికం-అని వివిధరకాలుగా వుంటయ్. అంతేగాక కథలనుకూడా

problem తో-అంటే plat తో సంబంధం వుంటుంది. దీన్ని ముడివేయడమే, అన్నిటికన్నా కష్టం. కుమారసంభవానికి problem, ఉత్తరకాండంలో రామచంద్రునికి problem, Dolls Horse లో స్త్రీల problem, యోగాయోగంలో కుముక problem, - యివన్నీ ఒకరకమైనవి కావు. యోగాయోగపుస్తకం 'విచిత్ర'లో ప్రచురింపబడినప్పుడు అధ్యాయం తర్వాత అధ్యాయంలో మేము చేసిన హంగామా ఎక్కువవుతూ వచ్చింది. ఆ దురదృష్ట పరాక్రాంత మధుసూదనుడుకూడా దాన్ని - ఒకతీరున ఎలా సమాప్తంచేస్తాడో తెలీదు కానీ, సమస్య ఒక లేడీ డాక్టరువచ్చి క్షణంలో దాన్ని తేలికగా పరిష్కారంచేసేంత సహజమైనదని ఎవరికి తెలుస్తుంది? మన జలధర్ దాదా కూడా problem ను కల్పించకుండావుండడు. చాలా కోపదారిమనిషి. ఆయన పుస్తకంలో అటువంటి ఒకవ్యక్తి వచ్చి పెద్దసమస్యను తెచ్చిపడేస్తాడు. కానీ, దాని పరిష్కారం మరొకవిధంగా జరిగింది. బుసకొడుతూ ఒక పాము వచ్చి అతన్ని కాటువేస్తుంది. దాదాగారిని 'ఇదేమిటయ్యా' అని అడిగితే, 'ఏం? పాము కాటెయ్యదా?' అని అన్నారు.

చివరకు ఒకమాట చెప్పాలి. రవీంద్రుడు 'ఇబ్సెన్ నాటకాలకు యింతకాలం అనాదరణలేకుండా జరిగిపోయింది. కాని, ఇక వాటిరంగు వెల్లబడిపోదా ? కొన్ని దినాలతర్వాత అవి తిరిగి కనిపిస్తాయా?' అని వ్రాశాడు. కనబడకపోవచ్చు. కానీ, ఈ అనుమానానికి ప్రమాణ

మేమిటి? 'ఇబ్సెన్'కున్న పాత గౌరవమే తిరిగివచ్చేకాలం కూడా రావచ్చుగదా? వర్తమానకాలమే సాహిత్యానికి ఆఖరి హైకోర్టు కాదు.

## కేదారనాథ్ వంధ్యోపాధ్యాయకు

బాజీశివపూర్, 12-10 1920.
(హౌరా)

శ్రద్ధాస్పదేషు కేదారబాబూ!

మీ పరిస్థితులన్నీ చెప్పాను. ఇక యీ బీదవాని పరిస్థితులుకూడా వినండి. కొద్దిరోజులనుండి వెన్నెముకలో చాలా నొప్పిగావుంటోంది. దానివల్ల ఎవరికీ ఏమీ నష్టం లేదు. అకస్మాత్తుగా ఒకనాటి నొప్పితో నిద్ర మెళుకువ వచ్చింది. ఊపిరిపీల్చడంకూడా అసంభవమైపోయింది. వేడి నీటికాపు పెట్టి మర్ధనచేయించాక, ఉదయానికి కొంచం నొప్పితగ్గింది. కానీ, ఆ సాయంకాలంమాత్రం డాక్టరును పిలుచుకురావడం తప్పలేదు. అప్పటినుంచీ బాధపడుతూనే వున్నాను. దానిపైన ఒకనాడు మోటారులోంచి జారిపడడంవల్ల నడుంనొప్పి పట్టింది. అయినా నల్లమందు నమ్మకం వుందిగా? దాన్నినమ్ముకొనివుంటే, చెడ్డదినాలు తప్పకుండా దాటిపోతాయి. భగవంతుడైన దేవాదిదేవుడు నాకు వరంయిచ్చివున్నాడు. మూలవ్యాధి రానిదే నేనెప్పుడూ కైలాసానికి వెళ్ళను. దాని ప్రారంభ లక్షణాలు కనిపించకుండావున్నంతకాలం నేనూ, మీరుకూడా నిశ్చింతగా వుండవచ్చు. ఏవిధమైన విచారమూ పడనవసరంలేదు.

అందువల్ల సురేశ్ కుకూడా జవాబివ్వలేకపోయాను. గత పర్యాయంనుండి, స్వయంగాకూడా దమ్ములు లాగు తున్నాను. చాలా అందంగా ఉపమాన్యంగా తయారు చేశారు. ఆనందంగావుంది. సురేశుని అసంపూర్తి కథల సంబంధంలో యింతవరకూ నేను ఏ అభిప్రాయానికీ రాలేదు. యింకా నాలుగైదు రచనలు అతనివి చూడాలి. ఈమాటనుబట్టి అపార్థాలు తీస్తాడేమో? పత్రచిత్రాలు మొదలైన అలాంటివాటిని ఏవిధంగాకూడా మంచివని చెప్ప డానికి వీలుండదు. అయినా భవిష్యత్తులో బాగా రాయగల డని ఆశించుదాం!

నే నేదోఒకవిధంగా వున్నాను. రాయడానికి కూర్చు న్నాను. తొందరగా పంపిస్తాను. నేను, నాకళ్లు ఎటు తీసు కొని వెళ్లితే, అటే వెళ్లిపోతాను. జబ్బుకారణంగా నేను యీమారు 'భారతవర్షకు' లేన్ దేన్ వ్రాయలేకపోయాను. మీారు చుక్కాని పట్టుకొని వున్నన్నాళ్లుకూడా ప్రవాసి జ్యోతి మునిగిపోతుందని నేను అనుకోను. 'ఈ చెడుకాలంలో మీారు నల్లమందును వాడడం మీాకర్తవ్యం' కర్తవ్యపాలన కన్నా గొప్పవస్తువు ప్రపంచంలో యింకొకటిలేదు.

మీ,

శరత్ చంద్ర చటోపాధ్యాయ.

బాజీశివపురం 18-11-1920.

(వారా)

శ్రద్ధాస్పదేషు కేదారబాబూ,

మీపుత్తరం నేను భాగల్పూర్ లోవుండగా అందింది. నేను మీపట్ల నిందనీయంగానే ప్రవర్తించాను. కానీ తప్పనిసరై అలా చేయవలసివచ్చింది. భవిష్యత్తులో యిక ఎప్పుడూ అలా జరగదని ఆశిస్తున్నాను. మొదటివిషయం జబ్బునపడి మంచంఎక్కాను. ఏమీ తోచడంలేదు. ఆతరువాత ఆరోగ్యవంతుణ్నయ్యాక యింకొక యిబ్బంది ఏర్పడిపోయింది. ఈనెలలో మీకు రచన పంపేవాడినే! కానీ, 'భారతవర్ష'కు పంపకపోయినకారణంగా మీకుకూడా పంపించలేదు. వారికి యివ్వకుండా మీకు యిచ్చినట్లయితే, వాళ్ళకెంతో బాధగా వుంటుంది. అనమానించినట్లుకూడా వుంటుంది.

ఈనెలనుంచి ఇకమీదట అంతా నియమానుసారంగా పంపిస్తూ వుంటాను. నాతో ఎవరైనా వ్యవహారం చేస్తుంటే యీవిధంగానే బాధపడవలసివస్తుంది నేను స్వయంగా అన్యాయమనేది చేయను. ఇంకా యీవిధంగానే అయిదారుగురిని యిబ్బందిపెట్టాను. ఇక మీరు దీన్ని మనస్ఫూర్తిగా క్షమిస్తారనుకుంటాను. నాస్వభావమే యింత;

ఇప్పుడెలావుంటున్నారు-? అప్పుడప్పుడు కబుర్లుపంపుతూవుండండి. ఈమారు వీలున్నంతవరకూ తొందరగా పంపుతాను. మీరు ఈ విషయంలో నిశ్చింతగా వుండ

వచ్చును. మిగిలిన స్నేహితులందరికీ నా నమస్కారములు చెప్పండి. మీరుకూడా నా నమస్కారాలు స్వీకరించండి.

మీ,
శరత్ చంద్ర చటోపాధ్యాయ.

—...—

బాజీశివపూర్ 6-4-1924
(హౌరా)

ప్రియవరేషు కేదారబాబూ,

నా ఆచరణకూ, చేతలకూ ఎక్కడా కలియకే లేకండాపోతుంది. అందువల్ల ఎక్కడైనా హఠాత్తుగా మిమ్మల్ని ఒక్కసారి కలుసుకోవాలని మనస్సులో అనుకుంటున్నాను. అది మనయిద్దరికీ ఎంతో ప్రశాంతతను యిస్తుంది. అప్పుడు తెలుసుకుంటాం. ఈ విషయంమీద మీకు బహుశా విశ్వాసం లేకపోవచ్చు. మీకు ఎప్పుడూ వుత్తరం వ్రాయను. సాధారణంగా ఎవ్వరికీ వుత్తరాలు రాయడంలేదు. కానీ, మీరు నన్నెంతగా ప్రేమిస్తున్నారో– ఆ ప్రేమను ఒక్కనాటికీ మరచిపోలేను.

పత్రికల్లో నా సంగతి తెలుసుకొని నన్ను దీర్ఘజీవిగా ఆశీర్వదించావు. దాని ఆంతర్యంలోని వస్తువును మరచిపోవడం సాధ్యపడదు.

కానీ, దీర్ఘజీవితం ఎందుకు చెప్పండి? ఒకవేళ రేపు రమ్మనమని కబురువస్తే – 'తమ్ముడూ, రేపురానోయ్, ఒక దినం ఆగి వస్తాను.' అని మాత్రం నేను చెప్పలేనని మీతో

నిజంచెబుతున్నాను. చాలారోజులూ, చాలాకాలం బ్రతికాను. ఇప్పుడు మెల్లమెల్లగా వెళ్ళిపోవడమే, చూడ్డానికి, వినడానికి అందంగావుంటుంది. అందంగా వుండదంటారా? నా జాతకచక్రంలో 'నలభైతొమ్మిది పూర్తికానిదే ఏవిధంగానూ వెళ్ళలేవు!' అని వున్నదట. నేనేమో సంతోషంతో-'క్షమించు! తొందరగా విడుదల ప్రసాదించండి. ఇంగ్లీషు వాళ్ళ జెయిల్లోనుండికూడా తొందరగా విడుదలయ్యేందుకు విధి, నియమం వున్నది. నన్నుమాత్రం విడిచిపెట్టేయండి!' అని నేనంటాను.

కేదారబాబూ, నేను అలసిపోయాను. అంతేగాక నాకు వేరే చెప్పుకోదగ్గరోగం అంటూ లేదు. అందరూ నన్ను బాధపెట్టడానికే చూస్తుంటారు.

మీరెలా వుంటున్నారు? కాశీలో మీరెందుకు వుండడంలేదు. ఈ పట్టణంలోవున్న అందమేమంటే మధ్యమధ్యలో పరిచితుల ముఖాలను చూడడం తటస్థపడుతుంది.

అప్పుడప్పుడు మీ సమాచారం యిస్తూ వుండండి. నా శ్రద్ధాసక్తులూ, నమస్కారాలూ పుచ్చుకోండి.

మీ సేవకుడు,
శరత్ చంద్ర చటోపాధ్యాయ.

బాజీశివపురం, 14-10-1924.

(హౌరా)

ప్రియవరేషు,

ఇవాళవుదయమే నీ వుత్తరం అందింది. అనేక పనుల వల్ల మరచిపోతున్నాను. ప్రతిరోజూ చాలా వుత్తరాలు

వస్తున్నాయి. అయినా అప్పుడప్పుడు మీరు వ్రాసిన కొద్ది పంక్తులే నాకు ఎంతో ఆనందాన్నిస్తున్నాయి. అటువంటి ఆనందం నిజంగా నాకు దుర్లభమే! ప్రేమ హృదయం లోంచి వస్తూనే, దానితోపాటు అనేకవిషయాలను తీసికొని వస్తుందనుకుంటాను. కేదారబాబూ! మనిషియొక్క నిజమైన ప్రేమను నేను అర్థంచేసుకోగలను. అందులో నేను పొరపాటుపడను. శరీరం బావుండలేదు. చాలా జీర్ణించి పోయింది. కానీ, అది ఏనాటికైనా తనపని ముగించిందంటే నేను దుఃఖించను. హృదయంలోమాత్రం వ్యథపొందు తాను. 'అప్పుడు కొత్తరచనలలోని భావాల్ని, సహృద యంతో గ్రహించేశక్తిగల వ్యక్తిగా ఆయనతప్ప యింకెవరు న్నారు?' అని అనుకుంటాను. మీ స్వంతరచన సంబం ధంలో మీరెప్పుడూ చెప్పలేదు. కానీ, యింతవరకు ప్రచురింపబడిన మీ రచనలన్నీ చదివాను.... ప్రశంసకు మారుగా ప్రశంసించడమంటే నాకు సంకోచంగా వుంటుంది. నిరంతరం దాన్ని మీరెక్కడ నమ్మరోనని, ఎక్కడ మీ ఆత్మగౌరవానికి దెబ్బ తగులుతుందోనని - భయంగా వుం టుంది. వర్షాకాలం వస్తుంది. దసరాకూడా వస్తుంది. ఒక నాడు మీరు యిక్కడకు రాలేరు. నేను అక్కడకు రాలేను. మీరు వయస్సులో నాకంటే పెద్దవారు. మీరు నన్నాశీర్వ దించండి. నేను చాలా అలసిపోయాను. తుచ్ఛసుఖాలు, తుచ్ఛఆనందాలూ, ఒకప్పుడు దుఃఖించడమూ, మరొ కప్పుడు సంతోషించడమూ - యివన్నీ నాకు పాతకాలపువై పోయాయి. నాకు నలభై ఎనిమిదేళ్ళు గడిచాయి. ఆ తరు

వాత ఇక యేమి పొందడం తప్పనిసరిగా వుంటుందో-దాన్ని చూడాలనే చివరికోర్కెగా మిగిలివుంది. దానికివ్యర్థమైన విలంబన అవసరం లేదనుకుంటాను. మీరు నన్నాశీర్వదించండి. సమ్ముఖంలోనే మీరు వచ్చి మీ నిజమైన ఆశీర్వాదాలను యిస్తే నేను ధన్యుణ్ణవుతాను.

మీ,

శరత్ చంద్ర చటోపాధ్యాయ.

సామతాబేడ్, పాణిత్రాస్ పోస్ట్

(హౌరాజిల్లా) 8 వైశాఖ 1927.

ప్రియనరేషు, కేదారబాబూ,

చాలాకాలమయ్యాక మీ పోస్టుకార్డు ఒకటి అందింది. వుత్తరం చిన్నదైనా ప్రేమతో నిండివున్నది. మీరు నన్నెందుకు ప్రేమించుతారో నాకు తెలియదు. ఏగుణాల కారణంగా మనిషి ... మనిషిని ప్రేమిస్తాడో, అవి నావద్ద లేవు. ఎంతలేదన్నా తప్పులుమాత్రం లెక్కలేనన్ని నాలో వున్నాయి.

ఆనాడు దిలీప్‌కుమార్ రాయ్‌కి 'రవిబాబు' యిలా వ్రాశాడు- 'శరత్ బాబు బుద్ధిపూర్వకంగా ఏ ద్వీపాంతర వాసమో చేయాలనుకొని, ద్వీపాంతరమే వెళ్ళి నిస్సంగియై నిర్బంధదీక్షలో మునిగివున్నాడని విన్నాను. ఆయన అడ్రసు నాకు తెలియదు. తమకు తప్పకుండా తెలుసుననుకుంటాను. అందువల్ల ఆయనతో నీవు కలిసి నప్పుడో, వుత్తరంద్వారానో, ఎక్కడున్నానసరే, నా మనః

పూర్వకమైన శుభాభివందనములు అర్పిస్తున్నాననీ, వారి సుఖాలను కోరుతున్నాననీ, తెలియజేయి.'

కేదారబాబూ! నిర్బంధదీక్షే పుచ్చుకున్నాను. పట్టణంలో వున్నప్పటికీ, గ్రామంలో వున్నప్పటికీ, నేను సాంసారిక ఆటు, పోటులనుంచి దూరమైపోయాను.

ఆరోగ్యం ప్రతిదినమూ దిగజారిపోతున్నది. మీకు బహుశా నా జాతకంలో ఏభైరెండో సంవత్సరంలో నేను గతించిపోతానని మీకు జ్ఞాపకం వుంటుంది. యిప్పుడు అందులో ఎక్కువ ఆలస్యంలేదు. ఒకటిన్నర సంవత్సరం మాత్రంవుంది. భగవంతుడు అలాగే అనుగ్రహించుగాక. ఇప్పుడాయన నాకు పరిశ్రమను అధికంచేయకుంటే అంతే చాలు!

కాన్పూరు వెళ్ళదామనుకుంటూండగా ఒకనాడు ముందుగా - హఠాత్తుగా కొన్నిసార్లు వాంతులయ్యాయి. కడుపులో నొప్పి వచ్చింది. డాక్టరు చెప్పినమీదట, అయిదారురోజులు మంచంమీద పడివున్నాను. యిప్పుడా స్థితిలేదు. ఇప్పుడు యదార్థంగా మిమ్మల్ని ఒక్కసారి కలుసుకోవాలనే యిష్టంగావుంది. ఎండలు ఎక్కువగా లేకుండావున్నట్లయితే, నేను కాశీకి వచ్చేముందు ఒక యిల్లు అద్దెకుతీసుకొని వుంచవలసిందిగా మిమ్మల్ని కోరతాను.

ఇప్పుడేమీ చేయడంలేదు. రూపనారాయణనది ఒడ్డున యిల్లుకట్టాను. ఈజీచైరులో రాత్రింబవళ్ళు పడి వుంటున్నాను. హరిదాసు అన్నయ్యను కలిసినట్లయితే,

నా మనఃపూర్వక శ్రద్ధాంజలులు తెల్పండి. ప్రస్తుతంస్వాస్థ్యం గానేవుంటున్నాను. సామాన్యమైన ఫిర్యాదులుతప్ప, విశేష మైన అభియోగాలులేవు. నా శ్రద్ధాత్మకమైన నమస్కారాలు పుచ్చుకోండి.

మీ,

శరత్ బాబు.

సామతాబేడ్, పాణిత్రాస్ పోస్టు
(హౌరా జిల్లా) 22 కార్తీకం-1927.

ప్రియవరేషు,

మీ వుత్తరం అందింది. చెప్పడానికి యిప్పుడేమీ లేదు. కేదారబాబూ, ఇంట్లోని ఒక పెంపుడు జంతువు చనిపోయినప్పుడు, అదిచూచి సహించలేనివారివద్ద యిప్పుడు చెప్పడానికేముంటుంది? మీవద్దకువచ్చి, మీదగ్గరకూచుని కాలక్షేపంచేద్దామనివుంది. నేను యింత హృదయదౌర్బ ల్యంగలవాణ్ణని యింతవరకూ ఎరగను. ఈ వ్యథ భ్రాతృ వియోగజనితం. ఎలా సహించగలను?

తమ,

శరత్

సామతాబేడ్, పాణిత్రాస్ పోస్టు,
(హౌరాజిల్లా) 13-2-1926.

పరమ శ్రద్ధాస్పదేషు,

కేదారబాబూ! నేనింకా బ్రతికేవున్నాను. నా నమ స్కారాలు పుచ్చుకోండి. మరి మీరో? వున్నారుకదూ?

ఒకవేళ బ్రతికివుంటే, మీ సమాచారం తెలియపరుస్తూ వుండండి. లేకుంటే ఏంచేస్తాం? ఆ అవస్థలో మీరు నాకు జాబురాయలేకపోయినా, నాకు కోపంవుండదు. యదార్థంగా నా హృదయం వుదారంగా క్షమాశీలమైపోయింది. మీభార్య వుందా? మీకంటే ముందే దాటిపోయిందా!

మీ,

శరత్.

సామతాబేడ్, పాణిత్రాస్ పోస్టు,
(హౌరా జిల్లా) 26 కు ఆర్, 1928

ప్రియవరేషు,

నమస్కరించే సమయం ఆసన్నమయింది. అందుకనే ఒకవిధంగా కాశీరావడానికి నిశ్చయించుకున్నాను. ఇల్లు మాట్లాడి వుంచమని వుత్తరం వ్రాస్తాను. త్వరలోనే వ్రాస్తాను.

కానీ, మరి మీరు లేరేమో? భగవంతుడైన విశ్వనాథుడుకూడా అక్కడ వుండకపోయినా, నాకేమీ యిబ్బంది వుండదు. కానీ, మీరు లేకపోతే కాశీలో నా కొక్కపూట కూడా గడవదు. దయయుంచి యీమాట అతిశయోక్తిగా తలచి నిశ్చింతగా వుండకండి. నాసంగతి మీరు బాగా ఎరుగుదురుగూడా!

శరత్

సామతాబేడ్, పాణిత్రాస్‌పోస్టు
(హౌరాజిల్లా) 10-6-1928.

ప్రియవరేషు,

యింతకాలంగడిచాక తిరిగి మీ వ్రాత చూచేభాగ్యం కలిగింది. ప్రేమ ఎక్కడైతే నిజంగా వుంటుందో, ఎక్కడ ఆంతరికవస్తువుంటుందో, అక్కడ భగ్నముకు తావులేదని మొట్టమొదటిసారిగా యీ విషయం మనస్సులో మెదిలింది. మనస్సు స్వయంసిద్ధలా నవ్వుకుంటూవుంది. మన యిద్దరి బాహ్యాచరణనుచూచి ఎవరూ మనం ఒకరినొకరు జ్ఞాపకం చేసుకొంటున్నామనుకోరు. అయినా మీరచనలు చదువుతున్నపుడుకూడా, నాకు కాశీ గుర్తుకువస్తూవుంటుంది. ఆఖరి జీవితంలో నాకు లభించే పాథేయం ఇదేకాబోలు! ఇదివరకల్లా నాకు కాశీవెళ్లాలనిపించేది. ఇప్పుడాకోర్కెలేదు. ఎందువల్లనంటే మీరు యిప్పుడు కాశీలో వుండడంలేదుగనుక! సరే, కేదారబాబూ, మీరు కాశీవాసం వదలిపెట్టేశ్లేనా? చివరలో పూర్ణియామట్టిలోనే వుండాలనుకున్నారా? మీరు 'పూర్ణియా' వదిలిపెట్టినట్లయితే చాలా బాధలున్నాయని తెలుసు. అయినప్పటికీకూడా మీ రాప్రదేశంలో వున్నారని జ్ఞాపకం వచ్చినప్పుడల్లా నాకు అదొకరకంగా వుంటుంది. ఇదే కాశీఅనికూడా అనుకోలేను. వెళ్లి కేదారబాబును కలుసుకుందామనిపిస్తుంది.

చూస్తున్నకొద్దీ నా నివాసం సామతాబేడ్‌లోనే స్థిరపడినట్లుంది. కానీ నాకిక్కడేమీ బావుండడంలేదు. అందువల్ల ఎక్కడికి కెళితే బావుంటుందో, అదికూడా నిర్ణ

యించుకోలేకుండా వున్నాను. దసరా తరువాత ఏదో ఒకటి నిర్ణయించుకుంటాను.

మీరు 'షోడశి' సంగతి ఎవరివద్ద విన్నారు? శిశిరుని అభినయం చూశారా? ఎంతఅందంగా అభినయించేస్తాడో? నాటకం 'లేన్ దేన్' అనే నా నవలనుండి ఎత్తి వ్రాయ బడింది. ప్రదర్శనాయోగ్యమైన మరొక నాటకాన్ని ముద్రించారని తెలిసినది. మీరు చదివారా? నాటకం ఎలావున్నా అభినయంమాత్రం చాలా బావుంటుంది.

మీ ఆరోగ్యం ఇప్పుడెలావుంది? కేదారబాబూ, బావున్నారుకదూ? మీ రింకా కొంతకాలం బతికివుండి కథలు వ్రాస్తూవుండాలని ప్రార్థిస్తున్నాను. నేను మీ రచనలలోని ప్రతి పంక్తీ చదువుతున్నాను. అంటే, అది మధురంగా వుంటుందనికాదు. యదార్థమైన సాహిత్యసేవకుని రచన కాబట్టే చదువుతున్నాను.

నేనేదో ఒకవిధంగా బ్రతికేయున్నాను. ఈ బ్రతికియుండడం చాలా పాతబడిపోయింది. విసుగుకూడా కలుగుతుంది.

వుత్తరానికి జబాబియ్యడం మరచిపోయ్యేరు.

మీ,

శరత్.

సామతాబేడ్ పాణిత్రాస్ పోస్టు
28 కు cఅర్ 1930

ప్రియవరేషు,

ఇవాళ విజయదశమినాటి సంధ్యాకాలంలో అర్పించే నా శ్రద్ధాపూర్వకమైన నమస్కారములు స్వీకరించండి. ఈ జీవితంలో ఏ ఏ మిత్రులనుపొంది నేను సార్థకజన్ముడినై పోయానో, వారిలో మీరు ఒకరు. కానీ, స్నేహమర్యాద కేవలం జడత్వంతో, సోమరితనంతోనే వుంచుకోలేదు. బహుశా ఒక్క నెలకూడా కాకముందే, మీరు జ్ఞాపకం రాకుంటే, నే నెంతో అపరాధంచేసినవాడిలా భావిస్తూ వుంటాను.

1 కార్తీకం.

'కుండలీ కా ఫలాఫల్' ఇవాళ వుదయమే ముగించాను. సరే, నాబోటిమనిషిని, ఏమనుకొని యింతగా గౌరవిస్తున్నారో, సాహితీపరులదళం ఏమనుకుంటుందో చెప్పండి. చాలా బాగావుంది. దీనులను, దుఃఖితులను, యివాళకూడా యీవిధంగా ఆత్మీయులుగా భావించి మీవలె మృదుమధురంగా రచనలుచేసేవారు ప్రపంచంలో చాలా అరుదుగా వుంటారు. గుండెల్లో బాధతో ఒకపోటు పొడిచినట్లుంటుంది.'భాష, శైలిలో భగవంతుడేమీకుసాటి.' అని అనుకుంటాను. ఈ పుస్తకంతో ఒక హితోపదేశం కూడా సంగ్రహించారు. 'ఒక తరుణకవి రోజులో ఒక్కసారైనా కలం పట్టకపోతే, ఆరోజంతా వ్యర్థంగా పోయిందని అంటాడు.' వ్రాయగలను. వ్రాయలేను. ఆలోచిస్తుం

టాను. ఈ జీవితంలో ఈ పరమస్వచ్ఛమైన ఈ వాక్యాన్ని ప్రతిరోజూ పాలిస్తూవుంటాను. నెలమీద నెల గడిచిపోతూ వుంటుంది. కాఫీ, సిరాబుడ్డి, కలాన్ని చేత్తో ముట్టుకు నేందుకు కూడా బుద్ధిపుట్టడంలేదు. మీ ఆశీర్వాదంవల్ల బ్రతికివున్నంతకాలం ప్రతిరోజూ యీ సంగతిని జ్ఞాపకం పెట్టుకుంటాను. పుస్తకంలోని ఒకే ఒక తప్పును యిప్పుడు చెబుతున్నాను. మీరు కోపం చేయకండి. ఇదే నాప్రార్థన. భగవంతుడు మీకు రాసేశక్తిని బాగానే యిచ్చాడు. అయినా ఐశ్వర్యవంతుడు మితవ్యయి కావాలనే సంగతి మరచిపోతేమాత్రం పనిజరగదు. కంగాళీలకు దీని అవసరం లేదు. కేవలం వ్రాస్తూ పోతూ వుండడమే కాదు. ఆగిపోయే విషయాన్ని కూడా మరచిపోకూడదు.

ఈమారు కాశీ ఎప్పుడెళతారు? తొందరగా వెళ్ళి నట్లయితే నాకు రెండక్షరాలు వ్రాయడం మరచిపోకండి. యిప్పటినుంచి వుత్తరానికి జవాబు మరునాడే యిస్తూ వుంటాను. ఇక అన్యథా జరగదు. నమస్కారములు.

మీ,

— శరత్.

పునశ్చరణ :- ఇప్పుడిప్పుడే 'విజయ' శుభాన్ని కోరుతూ, మీరువ్రాసిన వుత్తరం అందింది. నా శ్రద్ధాంజలి, ధన్యవాదాలు స్వీకరించండి.

సామతాబేడ్, ప్రాణిత్రాస్‌పోష్టు,
(హౌరాజిల్లా) 25 కార్తీకం 1930.

ప్రియవరేషు,

మీ అపారప్రేమను తీసుకొనివచ్చిన వుత్తరం యీనాడే అందింది. కొంచం మనస్సుకు శాంతిదొరకగానే జవాబు రాద్దామనుకున్నాను. అందుకే వీలుదొరకడం లేదు. రెండక్షరాలైనాసరే, మీ వుత్తరానికి జవాబు రాస్తాను. చాలా తప్పులు జరిగిపోయాయి ఇక ముందు అలాంటి అపరాధాలు చేయను. అందువల్లే రాస్తున్నాను. గ్రామనివాసం ఏర్పరచుకున్నందుకు తగిన ఫలితం ప్రారంభమైంది. దావాలలో, క్రిమినల్ కేసుల్లో చిక్కుకొని తిరుగుతున్నాను. మూడేళ్ళు నిర్లిప్తంగా, నిర్వికార భావంతో, అనంతమైన విశ్రాంతితో వున్నాను. దీన్ని ఆ గ్రామదేవత సహించలేనట్టుంది. తలమీంద ఎక్కి సవారీ చేసింది. పెద్ద జమీందారులను తప్పించుకున్నప్పటికీ, స్థానిక వుద్యోగులబాధలు ఎక్కువగా వున్నాయి. చాలా రోజులక్రితం జమీందారుగారు శివాలయంకోసం నాలుగైదు ఎకరాలభూమిని దానంచేశారు. అయినా ఇక్కడి వుద్యోగి దాన్ని సహించలేకపోయాడు; బీదప్రజలు ఏడవడం మొదలుపెట్టారు. అందువల్ల నేను జోక్యంకలిగించుకోవలసి వచ్చింది. ఒకపని పట్టుకున్నానంటే, దాన్ని సాధించనిదే వదలనని కబురుచేశాను. ఆతరువాత దావా మొదలైంది. పోనీయండి యీ విషయాలన్నీ! దీన్ని ఏదో ఒకవిధంగా పరిపూర్తిచేసి ఎక్కడికైనా పారిపోదామనుకుంటున్నాను.

ఒకవిధంగా పట్టణమే బావుంటుందనిపిస్తుంది. 'కుండలి'కి యిచ్చిన వివరణ-అది ఏ స్థితిలోకూడా అవిశ్వసనీయంకాదు. జ్వరానికికూడా ఒకవిధమైన మత్తు వుంటుంది. దాహావిషయం అంత అధికమైనది కాకపోయినా, దాని వుత్తేజం తుచ్ఛమైన వస్తువుకాదు. జ్వరంతో వ్రాస్తుంటే, యిలాగే వుంటుంది. కానివ్వండి, ఆ తరువాత శాంతి, స్వాస్థ్యం కలిగాక, ఆ తప్పొప్పులభాగాన్ని కొట్టివేయవలసి వుంది. ఈ పని మీదే! రెండవవారు చేయలేరని నా విశ్వాసం.

ఆ పుస్తకంలో పరిహాసనెపంతో ఎన్నో మధుర విషయాలున్నవి. పుస్తకం నేను చదువుకొనేగదిలో మంచం మీద పడివుంటోంది. మధ్యమధ్యలో తిరగబడిన పేజీలను పది, పదిహేనునిమిషాలు చదువుతుంటాను. 'బాదుడీ' మహాశయుని కథను నేను చదవలేదు. 'వసుమతి' వచ్చిందే తడవుగా పైకి వెళ్ళిపోతుంది. మళ్ళీ నాచేతికి రాదు. ఇంట్లోనే వుంటుంది. దాన్ని తీసుకోవాలనుకున్నా కష్టం కాదు. చదివినతర్వాత కబురు చెబుతాను. కానీ, కథ మీదే! మీరే వ్రాశారు. వాటిసమస్యల్ని పరిష్కరించడం నా కేమి చేతనవుతుంది? మీపాండిత్యాన్ని నేను విమర్శిస్తే లోకులు వూరుకుంటారా? ఒకవేళ మీరు ఆదేశించినట్లయితే, నే నా కథను సర్వనాశనం చేయవలసివుంది. జనవరినెలలో మీరు కాశీ చేరుకుంటే లాహోరునుంచి నేను తిరిగివస్తూ అక్కడ దిగుతాను. నమస్కారములు.

మీ,

— శరత్‌చంద్ర చటోపాధ్యాయ.

సామతాబేడ్, పాణిత్రాస్‌పోస్టు
(హౌరా జిల్లా) 7 పుష్యమి 1932.

ప్రియవరేషు,

కాలం జారిపోయిన తరువాతనే మత్తు వదిలిపోతుంది. అందువల్లే యీ జీవితంలోని కామ్యవస్తువులన్నీ చేతికి దగ్గరగావచ్చాయి. పిడికిలిలోకి రాలేకపోయాయి. ఉత్తరం రాద్దామనుకున్నాను. మాటిమాటికీ రోజులు క్షణాలు గడిచిపోతున్నాయి. ఆ వుత్తరాన్ని ఇవాళే రాశాను. కానీ, దానిఫలితంమాత్రం యింకా అందలేదు... ఇంతవరకూ నా పిడికిలికి బయటగానే వుండిపోయింది. ఇదంతా నా అదృష్టమనుకున్నాను. ప్రేమించి కలుసు తెలుసుకోవడంలో గెలుపు మీదేననుకుంటాను. జన్మాంతరమనేదివుంటే అప్పీలుచేస్తాను. నేను ఎలా వున్నానో, తెలుసుకోవాలనుకున్నారుగదూ? బాగానే వున్నాను. రాత్రింబవళ్ళు ఈజీ చైరులోవారిగి వసారాలో పడుకొనివుంటాను. కుడికాలు పడిపోయింది. కుడిచెవి వినబడదు. మూలవ్యాధివల్ల రక్తస్రావం జరుగుతూవుంది. క్షణక్షణానికి కునుకుపాట్లుతీస్తున్నాను. స్వప్నాలు కంటున్నాను. మేలుకుంటున్నాను. ఎదురుగా పెద్ద నది కనిపిస్తుంది. నదిలో వెళుతుండే పడవలు లెక్కపెడుతూంటాను. హఠాత్తుగా ఏనాడు కన్ను మూస్తానో? అన్నీ మరచిపోతూంటాను. దక్షిణాన్నుంచి సూర్యుడు తన తీక్షణమైన కిరణాలతో శరీరానికి వేడిమి కలుగజేస్తున్నాడు. కళ్ళుతెరవగానే 'ఎవర్రా అక్కడ' అని కేక వేస్తాను. 'చిలుము నింపుకురా' అంటాను. బహుశా

నింపేశేస్తారు. అయినా పీల్చిచూస్తే పొగరాదు. నేను వాడిని దబాయిస్తే మీరు నిద్రపోతూవుంటే లోపల పొగా కంతా కాలిపోయిందంటాడు. అది నిజమో, కాదో పరీక్షించి తెలుసుకునేశక్తి నాలో లేదు. అయినప్పటికీ కూడా గట్టిగా దబాయించి 'అవును! నిద్రపోతున్నాను. లేకుంటే యింకేమి చేస్తున్నాననుకుంటావు. అబద్ధాల కుంకా! తిరిగి నింపుకురా! ఢిల్లీనుంచి తెచ్చిన యీ చిలుం గొట్టం ఆరిపోవడమేమిటిరా?' అని అంటాను. వాడు వెళ్ళిపోగానే, మనస్సులో భగవంతుడనేవాడుంటే, నా నౌకరు మర్యాదను ఎందుకుంచడు? ఇంతగా ఎవరు నిందిస్తారు? "నామీద ఒట్టు బాబూ! మీరు ఒప్పుకోని తీరవలసిందే!" ఏనాటికైనా వప్పుకొనితీరవలసిందే. నాకు తెలుసు. అది నాలానే సమయం గడవాలి. అప్పుడు ప్రసన్నతాపూర్వకంగా పుచ్చుకోలేను. పిలుపు వచ్చింది. మృత్యువు దగ్గరగా సమీపించింది. నిద్రిస్తూ, నిద్రిస్తూ హఠాత్తుగా మేల్కొని, చదవడానికి పుస్తకాన్ని తీస్తాను. ఇది ఒక జీర్ణమైన అలవాటు. చాలా నల్లమందు రక్తంలో మిళితమైపోయివుంది. చాలామందిచేతుల్లో ఓడిపోయాను. కానీ, ఆ బాక్రీవాళ్ళను నేనే ఓడించాను. తరువాత నిద్రలో కూడా పాథేయరసం క్రిందకు పోదనే నమ్మకంవున్నది. నా వుత్తరాల్లోని భాష ఎప్పుడూ అస్తవ్యస్తంగానే వుంటుంది. మనిషి ఎంతో కష్టపడి అర్థంచేసుకోవలసివుంటుంది. అదే వారికి శిక్ష! మీకుకూడా అదే దొరికింది. మధ్యమధ్య

ఏ సమాచారాన్నైనా తే యిస్తూవుంటారో, కోపంవచ్చి వాటి నుంచి నన్ను వంచితుణ్ణిచేయవద్దని ప్రార్థిస్తున్నాను.

మీ స్నేహపాత్రుడు,
శరత్ చంద్ర చటోపాధ్యాయ.

సామతాబేడ్, పాణిత్రాస్ పోస్టు,
(హౌరాజిల్లా) 5 ఆషాఢం 1932.

సహృదయ, కేదారబాబూ,

మీ చల్లని ఉత్తరం యథాసమయానికి అందింది. కానీ, నేను జవాబు వ్రాయలేనంతటి పనిపాటల్లో మునిగి వున్నాను. నిన్న మా హౌరాజిల్లా ఎన్నికలు జరిగాయి. ఈమారు ఎదుటిపక్షంవాళ్ళు తిట్టుకున్నారు. లాఠీలు విసిరారు. కొంత రక్తపాతంతో కానీ ఎన్నికలు కావేమోనని పించింది. నేను సభాపతిని కాబట్టి నేనుకూడా నియమానుసారంగా తయారుకావలసివచ్చింది. సభలో గల్లంతు జరుగుతుందేమోనని భయపడ్డాను. ఆవరణచుట్టూ ముళ్ళ తీగ కట్టించాను. ఏర్పాట్లన్నీ నిర్విఘ్నంగానే జరిగాయి. పది సంవత్సరాలనుంచీ సభాపతిగా వుంటున్నాను. ఇందులో ఒకవిధమైన స్వార్థం ఏర్పడిపోయింది. అంత తేలికగా విడిచి పెట్టడానికి యిష్టంలేదు. అయినా ఎలా విడిచిపెట్టగలం? మాపక్షంవారి తర్కమేమిటో తెలుసా? "మేం పొరపాట్లే చేస్తాం. మీరెవరు అడగడానికి? దేశానికి స్వాతంత్ర్యం వస్తే మావల్లే రావాలి. మీవల్ల రాదు. మీరుమాత్రం జోక్యం కలుగజేసుకోవద్దు" అని అంటారు. వాళ్ళుమాత్రం

రాజీకివస్తారా? అందువల్ల నాకు కోపంవస్తుంది. లేకుంటే నా సుభాష్‌దళం చాలా శాంతస్వభావంగలది. అంతా మీకుమల్లేనే వుంటుంది. ఇక నాకు కొంత తీరుబడి చిక్కుతుంది. ఒకటి రెండు నెలలు పుస్తకాలు రాస్తాను. మీ వుద్దేశమేమిటో చెప్పండి. కలకత్తా వచ్చినపుడు నాకు కొంచం కబురెందుకు చేయలేకపోయారు? దారి ఎంతగా చెడిపోయినా ఏదో ఒకవిధంగా వచ్చేవాడిని కదా! కాశీ ఎప్పుడు వెళుతున్నారు? ఒకసారి కలుసుకుంటే బాగావుంటుంది. జవాబులు రాస్తూవుండండి.

మీ

—శరత్.

24 అశ్వనీదత్తరోడ్డు,
కాళీఘాట్, కలకత్తా, 29 కార్తీకం, 1937.

ప్రియవరేషు,

నేనుకూడా మీకు హృదయపూర్వక నమస్కారాలు పంపుతున్నాను. ప్రపంచంలోకి నేను మీకంటే కొంచం ఆలస్యంగా వచ్చాను. అందువల్ల ప్రపంచంనించి ఆలస్యంగా పోవాలనే నియమాన్ని భగవంతుడు ఏర్పరచలేదు. ఈవిషయం రాయడం చాలా ముఖ్యమనుకుంటున్నాను. ఎవరో ఒక యూరోపియన్ గుమస్తా వుండేవాడట. ఒకనాడు దొరగారు కోపగించుకున్నప్పుడు అతను అన్నాడట. "యస్, సార్. నేను చాలా ఆలస్యంగానే వస్తుంటాను.

అయినా ఎప్పుడూ ముందుగానే వెళుతుంటాను." కాబట్టి యిలాగకూడా జరగవచ్చు కేదారబాబూ!

తమ
—శరత్.

## "ఆత్మశక్తి" సంపాదకునకు

5 ఆశ్వయుజం, 1928

శ్రీయుత ఆత్మశక్తి సంపాదకమహాశయునికి,

మీ 'ఆత్మశక్తి' భాద్రపదమాసపత్రికలో 'బాటసారి' వ్రాసిన సాహిత్యవిమర్శ చదివాను. ఒకానొక కాలంలో పత్రికల్లో వంగసాహిత్యంలోని నీతిని, అవినీతిని విమర్శిస్తూ చాలా కటువైనపదాలనే విమర్శకులు వుపయోగిస్తూవుండేవారు. ఇప్పుడు హఠాత్తుగా సాహిత్యంలో రసచర్చ చేస్తూ కఠినమైనరసాన్ని చూలకపోస్తున్నాను. అలాగే జరుగుతూవుంటుంది. దేవునిగుడిలో అర్చకులసంఖ్య ఎక్కువైనకొద్దీ, దేవికి భోగం ఎక్కువగా జరగవలసింది పోయి, తగ్గిపోతూవుంటుంది. అలాగే యీవిషయంకూడా కనిపిస్తూవుంది.

ఆధునిక సాహిత్యపరులకు విరుద్ధంగా ఎన్నో కటువైన మాటలు కురిపిస్తున్నారు. అలా దూషణపాత్రులైనవారిలో నేనూ ఒకడినే! అందుకు 'శనివారేర్ చిట్టీ'యే నిదర్శనం!

బాటసారివ్రాసిన యీ సాహిత్యవిమర్శనలోని

ఎక్కువభాగంతో నేను ఏకీభవిస్తున్నాను. కేవలం ఒక్క విషయంలో నాకు అభిప్రాయభేదముంది.

రవీంద్రునిసంగతి రవీంద్రునికే తెలుసు. కానీ, నా స్వంతవిషయం నాకు తెలిసినంతవరకు శరత్ చంద్రుడు 'కల్లోల్,' 'కాలీకలం' - లేక ఏ బెంగాలీపత్రికనుకూడా చదవడు. చదవడానికి అతనికి తీరుబడికూడా వుండదు.' అని బాటసారి అనుకున్నట్లుంది. ఒకవేళ నేను చదివినా, అన్నివిషయాలు నాకు అర్థంకావనేసంగతిని వప్పుకుంటాను. కానీ, చదవకుండానే తెలుసుకోగలననే వాదనమాత్రం చేయను.

ఇంతవరకూ జరిగిందంతా నా విషయం. కానీ, ఏ విషయంకోసం పోట్లాటనిలిచిందో, అదేమిటో పోట్లాడి దాన్నెంతవరకు పరిష్కరించవలెనో, నా బుద్ధికి అందని విషయం.

రవీంద్రనాథ్ సాహిత్యధర్మరీతిని నిరూపించేశాడు. నరేశచంద్రుడు యీ ధర్మానికి హద్దుల్ని ఏర్పరిచాడు. ఎలాంటి సాహిత్యమో, అటువంటి తర్కంకూడా! చదివి ముగ్ధుణ్నైపోయాను. 'చాలు! ఇక ఎవరేమి చెప్పగలరు?' అని అనుకున్నాను. అయినా ఎక్కువగానే చెప్పడం జరిగింది. అటువంటప్పుడు ఎవరిహద్దుల్లో ఎవరు కాలు పెట్టారో, యీ నాలుగుహద్దుల్ని ఆధారంచేసుకొని ఎందుకు కర్రసాము ఆరంభమైందో - ఎవరికి తెలుసు ? 'కుమారవిచిత్ర' లో ద్విజేంద్రనారాయణ బాగ్చీమహాశయుడు, 'సీమానేపర్ విచార్'మీద తన అభిప్రాయా

న్నిచ్చారు. ఇరవైపేజీల విమర్శన అది ఎన్నివిషయాలున్నాయో, అన్ని భావాలుగా వున్నయ్! ఎంత గంభీరత వున్నదో, అంతవిస్తారంగానూ వున్నది. అంతే పాండిత్యమున్నది. వేదం, వేదాంతం, న్యాయం, గీత, విద్యాపతి, చండీదాసు, కాళిదాసు శ్లోకాలు ఉజ్జ్వలమైన నీలమణిల వ్యాకరణంతో నిండిపున్నది. మానవులు పేటినన్నిటినీ ఎప్పుడు చదువుతారో, ఎలా జ్ఞాపకం పెట్టుకుంటారో ఎవరికి తెలుస్తుంది ?

అతనికి ఎదురుగా లాలమండిత వంశఖండ నిర్మిత క్రీడాగాండీవధారి 'నరేశచంద్రుడు' వట్టి పనికిమాలిన వాడుగా అయిపోయాడు. మా జీతబత్తెంలేని 'నవనాట్య సమాజం'లో గొప్ప నటుడు 'నరసింహబాబ'ని ఒకడు వున్నాడు. రాముడు, రావణుడు, హరిశ్చంద్రుడు మొదలైన అన్ని వేషాలను బాగానే వేయగలడు. హఠాత్తుగా యింకొక మహాత్ముడు వచ్చాడు. అతనిపేరు రామ నరసింహబాబు. అతను యింకా పెద్దనటుడు. ఎంతో ముగ్ధస్వరంతో, హావభావాలతో చక్కగా నటిస్తాడు. అంటే మదించిన ఏనుగులా నటిస్తాడు. ఈ సవాగంతుకుడైన రామనరసింహబాబుముందు మా నరసింహబాబు తృతీయ శుక్లపక్షచంద్రునిలా కాంతివిహీనమైపోయాడు. నేను నరేశబాబును చూడలేను. అయినా కల్పనాజగత్తులో వారిముఖంచూచి చేతులుజోడించి బ్రహ్మదేవునితో 'ప్రభూ! ఈ బ్రతుకుకంటె, అడవిలోకి వెళ్ళిపోవడం మంచిది' అని విజ్ఞప్తిచేద్దామనుకున్నాను. ద్విజేంద్రబాబు వాదనలోని

శైలి ఎంత కఠినంగా వుంటుందో, దృష్టికూడా అంత తీక్షణ మైనదే! తను రాసినదానిలో ఎక్కడైనా ఒక్క అక్షరం కూడా పొల్లుపోకండా సతర్కంచేయగలవాడు. పెద్ద వలలోని చేపలనూ, ఆలిచిప్పలనూ వేరుచేయగల సూక్ష్మ బుద్ధి గలవాడు.

ఏమి నిర్ణయాలు! ఏమి సాహిత్యరసం! దీన్ని ఎంత మధనంచేసినా తృప్తి అనేది కలగదు. రవీంద్రనాధుని, నరేంద్రుని యిరువైపులా వుంచుకొని - గొప్ప మేధావంతు డైన ద్విజేంద్రనాధుడు సింహావలోకనంచేశాడు.

కానీ, ఇంతకీ ప్రయోజనం ఏమిటి? ఈ ప్రయోజ నమే చాలా విచారకరమైనవిషయం. నరేశచంద్రుడూ, ద్విజేంద్రనాధుడూ - యిద్దరూకూడా సాహిత్యవేత్తలే! వీరి భావవినిమయాలు, సంభాషణలూ, అవగతం అవుతూనే వున్నయ్! కానీ, వీరి ఆదర సత్కారాల సూత్రాలను పట్టుకొని బయటవారు వుత్సవంలోదూరి యోగదాసం చేసినట్లయితే, వారి తాండవనృత్యాన్ని ఎవరాపగలరు?

ఒక ఉదాహరణ యిస్తాను. ఈ కుమార 'ప్రవాసి' లోనే శ్రీ 'ప్రజదుర్లభహజారా' అనే పేరుగలవ్యక్తి రస చర్చచేస్తూ ఒక వ్యాసం వ్రాశాడు. వారు యువక రచ యితలమీాదనే లక్ష్యముంచి దాడిచేశారు. అతను తన రసరుచినిగురించి పరిచయమిస్తూ, 'ఈ రోజుల్లో శిశువులూ, తరుణులూ, విద్యార్థులూ, సోమరిపోతులైన వ్యక్తుల రాజ కీయాల్ని గురించి చర్చిస్తున్నారు. అలాగే అర్థోపార్జనకోసం యీా సోమరిపోతులైన సాహిత్యసేవకుల దళం గ్రంథరచనలో

మునిగిపోయింది. దానిఫలితం గదిలో ఆవలపెట్టి కలం చేత పడితే ఏమవుతుందో, అదే అయి కూచుంది' అన్నాడు.

ఈ వ్యక్తే వుద్యోగంచేసి డబ్బు కూడబెట్టాడు. ఆజన్మం నౌకరీలో గడిపినందుకు పెద్ద పెన్షన్‌కూడా పొందుతున్నాడు. అందుకనే సాహితీపరుల నిరాతిశయమైన దారిద్ర్యాన్ని పరిహసించడానికి సంకోచించలేదు. దారిద్ర్యం అనేది అపరాధంకాదనీ అన్ని దేశాల్లో, అన్ని యుగాల్లో వారు వుపవాసాలు వుంటూ, ప్రాణాన్ని పరిత్యజించారని యితనికి తెలియదు. అందువల్లే 'సాహిత్యానికి యింత గొప్పగౌరవంకూడా దొరికింది'-అనికూడా తెలియదు.

వ్రజదుర్గబాబుకు యీ విషయం తెలియక పోయినా 'ప్రవాసి' ప్రవీణ సంపాదకమహాశయులకు తెలియకపోలేదు. సాహిత్యంలోని మంచిచెడ్డలనుగురించి సమీక్షచేయడమూ-నిర్భాగ్యులైన సాహితీపరుల పొయ్యి క్రిందికీ, పొయ్యిమీదికీలేని దారిద్ర్యాన్ని సమీక్షించడమూ - ఒకటికాదు...వారికి తెలియకండానే యింతకటు విషయం ఆయన పత్రికలో ముద్రించబడుతుందని నేననుకోను. అందువల్ల వారుకూడా బాధపడుతుంటారనే, బహుశా ఆ రాసినవారినిపిలిచి-'తమ్ముడూ! మానవదారిద్ర్యాన్ని అపహాస్యంచెయ్యడం, సభ్యత అనిపించుకోదు. లోటాలు దొంగిలించి సంపాదించడానికి, సాహిత్యాన్ని చర్చించడానికి- చాలా తారతమ్యంవున్నది. ఈ రెంటి అంతర్యాన్ని అర్థంచేసుకునేశక్తి నీలో లేదు' అని చెబుతాడని నా విశ్వాసం. —శరత్.

## శ్రీ మణీంద్రనాథ్ రాయ్‌కి

సామతాబేడ్, పాణిత్రాస్‌పోస్టు
[హౌరా జిల్లా] 1 జూన్, 1927

పరమకళ్యాణీయ, మణీంద్రా,

నీ ఉత్తరం యథాసమయానికి అందింది. కానీ, రేపు, రేపు అంటూ శరీర అస్వస్థతచేత కాలం దొర్లించాను.

నువు నాదగ్గరకు వస్తానంటే, అది మాకెంతో సంతోషంగా వుంటుందని నీకు తెలుసు. కానీ, నాకు చాలా కష్టాలున్నాయి. మొదటిది – ఇక్కడ ఎండలు తీక్షణంగా వున్నాయి. ఇక్కడ మైదానంలోంచి మధ్యాహ్నం రావడం భయంకరమైన విషయం. కొంత వర్షాలుకురిసిన తర్వాత ఎప్పుడైనా రావడం మంచిది. అంతేగాక, యీ ఆరవ తారీఖువరకూ నేను శివపురంలో వుంటాను. 'శశిరబాదుడీ' థియేటరులో షోడశి రిహార్సలు చూడవలసివుంది. 'భారతి' పుస్తకం 'ప్రింట్' అవగానే 'శివరామచక్రవర్తి' నాటకంగా దాన్ని రాశారు. నేను దాన్ని సరిచేసి శశిరుని నటనకు యోగ్యంగాచేశాను. బహుశా అంత చెడ్డగా వుండదు. వీలువుంటే ఒకసారి వచ్చి చూడవలసివుంది. ఈమధ్య ఒకనాడు సెలవుపుచ్చుకొని మీ దగ్గరకువచ్చి మీ నాన్నగారితో కలవాలనుకొని, తిరిగి బ్రాహ్మణ భోజనంచేయాలని యిష్టంగావుంది. మీ యింట్లో భోజనం చేయడమంటే నాకెంతో యిష్టం. అంతా కుశలంగానే వున్నారు. కేవలం మూలవ్యాధివల్ల రక్తస్రావం ఎక్కువ కావడంవల్ల బలహీనంగా వున్నాను.

మీరు కుశలంగా వున్నారని భావిస్తున్నాను. భూపేన్ బాబు ఎలావున్నాడు? నా స్నేహ ఆశీర్వాదాలు పుచ్చుకోండి.

—శరత్.

—*—

సామతాబేడ్, పాణిత్రాస్ పోస్టు,
(హౌరాజిల్లా) 27-8-1927.

పరమకళ్యాణీయ వరేషు,

మణీంద్రా, నీ ఉత్తరం అందింది. నీ ఉత్తరం చదువుకున్న తర్వాత 'యిప్పుడే నేను బయలుదేరుదామా' అని బుద్ధిపుడుతున్నది. కానీ, తమ్ముడూ, నేను అనారోగ్యంగా వుంటున్నాను. షుమారు రెండు వారాలనుంచీ ఇన్‌ఫ్లూయంజా పట్టుకొని నన్ను పీల్చివేసింది. యింతేగాక స్టేషన్‌కు వెళ్ళడానికి వున్న ఒక్కదారికూడా వర్షాల మూలంగా అటు వెళ్ళడానికే భయంకలిగిస్తూవుంది. పాలకి ఎక్కి వెళ్ళదామనుకుంటే, కాళ్ళుజారి వాళ్ళు నన్నెక్కడన్నా పడేస్తారేమోనని భయంగా వుంది. మంచిచోటనే యిరుక్కున్నాను. ఇక్కడి ప్రజల్లో ఒకమంచి వున్నది. ఈ వర్షాకాలంలో వారికాళ్ళకు గిట్టలు మొలుచుకొని వస్తాయిట. వారు జారి పడిపోకుండా, ఎంత బురదలోనైనా సునాయాసంగా నడిచివెళ్ళగలరు. పడిపోతామన్న భయం వారికి లేదు. నాకింకా గిట్టలు మొలవలేదు. ఇంకా ఒకటి రెండు సంవత్సరాలుంటే, గిట్టలు మొలుస్తాయనే ఆశ చూపి

స్తున్నారు. అదేమంత అసంభవం కానివిషయమే! కానీ, నాకు గిట్టలు అవసరంలేదు. పైగా నే నెక్కడున్నానో, ఎక్కడ వుండేవాడినో, అక్కడికే వెళ్ళిపోతానని చెప్పాను.

మీ నాన్నగారిని కలుసుకోకండా ఎంతకాలం యిలా గడుపుతానో నాకు తెలియదు. కానీ, వారి మధుర స్వభావానికి వారిపట్ల నాకెంతో శ్రద్ధవున్నది. వారికి నా నమస్కారాలు చెప్పు. శరీరంలో కొంచం బలం రాగానే వచ్చి కలుసుకుంటాను.

'షోడశి' అభినయాన్ని నేను ఒక్కసారే చూశాను. దానివల్లే నే నిప్పుడు అనుభవిస్తున్నాను. వర్షంలో తడిసి, బురదలో నడిచి యీ యిక్కట్లను కొనుక్కున్నాను. వీలుంటే నీవు ఒకసారివచ్చి కలుసుకొని వెళ్ళు. యదార్థంగా శశిర్, చారు (జీవానందు, షోడశి) అభినయం చూసితీరా ల్సిందే. ఆశీర్వాదాలు పుచ్చుకో!

నీ దాదా.
—శరత్

## శ్రీ బుద్ధదేవ్ భట్టాచార్యకు

24, అశ్వనీదత్తురోడ్డు
కలకత్తా, 25 వైశాఖం - 1344

కళ్యాణీయషు,

బుద్ధదేవా! వుత్తరాలు వ్రాయడానికి కాగితం యింత వరకు నాకందలేదు. బహుశా అంతా మరిచిపోయారనుకుం

టాను. మళ్ళీ జ్వరం బాగా తిరగబెట్టింది. ఈమారు రక్త పరీక్షలో ఏమీ లేకపోయినప్పటికి - యిది 'మలేరియా' యేనని, యింకేమీ కాదని ఆయన నిర్ణయించాడు. సరే, నా రోగకథను వదలిపెట్టు. ఒక్క విషయం - ఇప్పుడు పెద్ద పెద్ద గొప్పవారి యిండ్లలో ఆడపిల్లలకు 'అంజలి' అని పేరు పెడుతున్నారు. కానీ, అంతా దీర్ఘ 'యీ'నే రాస్తున్నారు. 'అంజలీ' అని రాయడంలో స్త్రీలింగ మవుతుందా? బెంగాలీభాషలో అవుతుందనే కొందరంటున్నారు. నాకు మాత్రం తెలియదు. వీలుగా వుంటే, ఒకసారి రావాలి. నా ఆశీర్వాదాలు పుచ్చుకో.

నీ దాదా.

—శరత్.

---

1913 చివరలో వ్రాసినది.

పరమ కళ్యాణీయ,

కొన్నాళ్ళు సెలవుపెట్టి బర్మాలోనే ఏదో ఒక ఆరోగ్యమైన ప్రదేశానికెళ్ళి వుందామని అనుకుంటున్నాను. కానీ, రాత, చదువు - పదహారణాలా వదిలిపెట్టాననే చెప్పవచ్చు. మీరంతా నన్ను కలకత్తాలో వుండమంటు న్నారు. అది నిజమే! కానీ, నాకు నచ్చడంలేదు. ఉద్యోగ సద్యోగాన్ని విడచిపెట్టి ఈ అస్వస్థశరీరాన్ని తీసుకొని ఇంకొ కరివద్దకు వచ్చివుండాలనేది నాకు మనస్కరించడంలేదు. నేను ఒక్క హాస్పటల్లోనే చనిపోతాను. కానీ, ఈ శరీరాన్ని

ఏపరిస్థితుల్లోకూడా ఆఖరుసారిగా ఒకరియింటికి తీసుకొని వస్తానని అనుకోవద్దు. దీన్ని నేను అసహ్యించుకుంటాను. నాకు చాలామంది స్నేహితులూ, సంబంధీకులూ వున్నారు. దీన్ని నేను బాగా ఎరుగుదును. ఒకవేళ నేను వెళ్ళినట్లయితే, కొన్నిరోజులు సరిగా చూడరనికాదు. అయినా యితరులను కష్టపెట్టడం నా కిష్టంలేదు ఒకవేళ నేను వెళ్ళినట్లయితే మా పెద్దక్కయ్యగారింటికి వెళతాను. ఒక విధంగా ఆమెయిల్లే నాయిల్లు! ఆమెస్థితికూడా కొంచెం బాగానేవుంది. రమ్మనమని ఎంతో పోట్లాడుతోంది. కానీ, అస్వస్థతశరీరాన్ని తీసుకొని ఎక్కడికీ వెళ్ళలేను. ఒకవేళ హఠాత్తుగా చచ్చిపోయి ఆమెకు కష్టం కలుగచేస్తానేమో నని భయంగా వుంది. ఇది అకారణ భీతి కావచ్చు. వర్ష ఋతుకాలం నాకు చాలా బాధ కలిగిస్తుంది. అది దాటిపోయింది. మెల్లమెల్లగా యిక కోలుకుంటాననే ఆశిస్తున్నాను. ఈ దుస్సమయంలోనే ఒకవేళ నేను 'చరిత్రహీన్'ను ముగించకుంటే - యింకెవరు ముగిస్తారని ? ఇదివరకే ఈ ప్రశ్న ఒకసారి అడిగాను. దీనికి సరైన జవాబు రాసి నా మనస్సును నిశ్చింతగా చేయి.

ఇంకొకవిషయం తెలుసుకోవాలని కోరికగావుంది. 'నారీర్ మూల్య' పూర్తి అయిపోయింది. దీన్ని యింతగా ప్రశంసిస్తారని నే ననుకోలేదు. అనేకమంది చిరపరిచితులూ అపరిచితులూ దానిమీద అభిప్రాయాలు తెలుపుతూ ఆ పుస్తకం చాలామంచిదని వుత్తరాలు వ్రాస్తున్నారు. మళ్ళీ నాకు ఆరోగ్యం చిక్కితే యిదివరకు అనుకున్నట్లుగానే

చేస్తాను. అయినా ఒకసంగతి: ఎవరు ఏవిధంగా ప్రతివాదం చేయకపోయినా దానిని ఒక స్త్రీ వ్రాసిన గ్రంథం అనుకొని, ఎవరూ విమర్శించడానికి ప్రయత్నించకపోవచ్చు. సరేనయ్యా! అది నేను వ్రాసినదేనని మణిలాల్‌కు ఎలా తెలిసింది. కొంప తీసి నీవు ప్రచారంచేయలేదుకదా? అవును, ఎవరికి నా రచనలతో బాగా పరిచయముంటుందో, వాళ్ళే దాన్ని తెలుసుకోగలరు. సాధారణమైన వాళ్ళకుమాత్రం తెలియదు

('యుగాంతర్' మాఘం 1344)

—o—

54/36 వామ్‌స్ట్రీట్,
రంగూను, 1-2-1910

సవినయ నివేదనము,

పరిచయంలేకపోయినా, యీ ప్రశంసలు, ఆశీర్వాదాలుపొంది నేను ధన్యుడనైపోయాను. మీరు ఒక వృద్ధులని వ్రాశారు. నేనుకూడా ఒకరకంగా ముసలివాడినే. నా వయస్సు ముప్ఫయితొమ్మిదేండ్లు. అయినప్పటికీ కూడా ఒకవేళ వయస్సులో కొంత చిన్నవాడిగానైనా నా నమస్కారాలు స్వీకరించండి. ఉత్తరంలో మిమ్మల్ని గురించి తక్కువగానే తెలుపుతున్నాను. 'ప్రపంచంలోని భిన్న భిన్న సభ్యతలుగల కేంద్రాలను ఈ కంట్లతో చూచి వచ్చాక నా జన్మభూమిపట్ల మీ మమత తక్కువైపోవడమటుంచి, పైగా పెరుగుతున్నద'ని వ్రాశారు. అదికూడా సరికాదేమోననిపిస్తోంది. ఎందుకంటే జ్ఞానం, అనుభవాలఆధారాలమీద

జన్మభూమిలోని గ్రామసీమలమీద ప్రేమ వుద్భవిస్తుందనేది సరికాదు. కలకత్తాకు ప్రవాసంవచ్చిన చాలామంది జన్మస్థానాలను నా కండ్లతో చూసివచ్చాను. వారి దుర్దశ అంతులేకుండా వుంది. వారిలోగల సామర్థ్యంలో నూరోవంతైనా యింకొకమార్గంలో వినియోగించినట్లయితే దుఃఖభూయిష్టమైన గ్రామాలు సౌభాగ్యవంతమవుతాయి.

నావద్ద కాలం సామర్థ్యం లేదు. వారికి నేను పదహారణాలా ఏమీ చేయలేకపోతున్నానంటే - అది నా దోషం కాదు. అయినప్పటికీకూడా ఒక్క మనిషిదృష్టినైనా తన గ్రామసీమలమీద ఆకర్షించేటట్లు చేయాలని ప్రయత్నిస్తున్నాను. అందుకనే ఎంత అప్రియమైనా ఎంత క్లేశదాయకమైనప్పటికీ - గ్రామసీమల సంబంధంలోనే మంచి విషయాలను వ్రాయడానికి ప్రయత్నంచేస్తున్నాను. పట్టణవాసులు కాల్పనిక ఆధారాలమీద నిలబడి గ్రామ్యసీమలను ప్రశంసిస్తుంటే, అవి యదార్థంగా నిజంకాదని ఎక్కువగా తెలుస్తుంది. పైగా గ్రామసీమలు మెల్లమెల్లగా అవినీతివేపు దిగజారిపోతున్నాయి. ఈ విషయంతోనే 'గ్రామీణ సమాజ'మనే పేరుతో ఒక పుస్తకాన్ని వ్రాశాను. కానీ, ప్రయత్నించడమూ, సఫలత పొందడమూ - అనేదానిలో ఏ అంతర్యముంటుందో, నా రచనలోకూడా అంతే అంతర్యముంది.

మీరు దీన్ని నాటకరూపేణా ప్రచురించాలనేవుద్దేశ్యం వెలిబుచ్చారు. బహుశా చేస్తే బాగానే వుంటుంది. కానీ,

నాకు యిప్పుడు ఓపికలేదు. వున్నదో, లేదోకూడా కనీసం పరీక్షించి చూసుకోలేదు. కానీ, యితరులెవరైనా కష్టించి ఓప్పుతో, ఆ పని చేసినట్లయితే, చాలా బాగుంటుంది. కానీ, నేను చేయడంమాత్రం బహుశా వ్యర్థపరిశ్రమతప్ప-యింకేమీ కాదు. ఏదైనా 'నాటక సమాజం' తనకాలాన్ని సామర్థ్యాన్ని, అపవ్యయపరచి, దాన్ని ఆడలేదుగదా? అయినా మీ వుపదేశాన్ని జ్ఞాపకంపెట్టుకొని భవిష్యత్తులో ఒకవేళ కొంత చేసేందుకు ప్రయత్నిస్తాను. మొదట గ్రామ సంబంధంలో నా 'పండితమహాశయ' పుస్తకాన్నికూడా ఎవరో నాటకంగా మార్చాలని అనుకున్నారుట. కానీ, అలా జరగలేదు. బహుశా అది బాగా రాణించదు కూడాను.

ఏది ఏమైనా యీ ఉపదేశాన్ని నేను మరచిపోను. అందుకోసమే మీకు ప్రణామంచేస్తున్నాను.

మీ,

—శరశ్చంద్ర చట్టోపాధ్యాయ.





## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA120B183 |
| పుస్తకం పేరు | శరత్ ఉత్తరాలు |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 253 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 256 |
| లేని పేజీలు | 47 to 50 |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Aswini |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |